# అపరాధ పరిశోధన

రూ.6 | ఆగస్టు '85

సప్లిమెంట్

140



అపరాధ పరిశోధన అనుబంధం—140

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## న్ కార్డ్ హోల్డర్

చన : వసుంధర

## జీవం వున్న దేవత

రచన : అజీజ్

## జా

న· టెంపోరావ్

## రాధిక ప్రియుడు

రచన: మిస్ కె. మధుబాల

అపరాధ పరిశోధన సప్లిమెంట్—140
ఆగస్టు, 1985
వెల: రు. 6-00
ఏడాది చందా: 72 రూపాయలు



కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# గ్రీన్ కార్డ్ హోల్డర్

## వసుంధర

సువర్చల సన్నగా పొడుగ్గా అందంగా ఆకర్షణీయంగా ఉండి పార్కులో చూపరుల నాకర్షిస్తోంది.

ఆమె మాత్రం ఎవరినీ చూడ్డంలేదు. ఆమె రెండు గులాబి మొక్కలచుట్టూ ఆలోచిస్తూ అసహనంగా ప్రదక్షిణాలు చేస్తోంది. ఆమె ముఖంమీదుండడంవల్ల ముత్యాల్లా కనబడుతున్న స్వేదబిందువులను చేతిరుమాలుతో మాటిమాటికీ తుడుచుకుంటోంది.

అప్పుడు వాతావరణం మనోహరంగా వుంది. నీరెండ ఎంతో ఆహ్లాదకరంగా వుంది. ఆ సమయంలో సువర్చలకు చెమటలు పట్టాయంటే అందుకామె మనస్థితే కారణమయుండాలి.

ఆమె మరోసారి టైము చూసుకొని—"రామదాసింకా రాలేదు—" అని తనలో తను గొణుక్కుంది.

రామదాసుకోసం ఆమె ఎదురుచూడ్డానికి బలమైన కారణమే వుంది. దాన్ని కారణమనడంకంటే జీవన్మరణ

సమస్య అనడం సబబేమో!

సువర్చల, రామదాసు పరస్పరం ప్రేమించుకున్నారు. ఆ ప్రేమకు దోహదం చేసినవాడు రామదాసే!

రామదాసుది ఆరడుగుల విగ్రహం. పచ్చటి ఛాయ. సినిమాల్లోకి వెడితే రాణిస్తాడని అంతా అనేవారు. అందులోనూ అతడు నటుడుకూడా.

"సినీ నటులు డబ్బు సంపాదించవచ్చు. కానీ ఆరోగ్యకరమూ, ఆనందకరమూ అయిన వ్యక్తిగతజీవితం వారికి అరుదు. నేను నలుగురి ప్రమేయంలేకుండా నా జీవితం నేనే అనుభవించాలని కోరుకుంటున్నాను. నేను—నా సంసారం—అదే నా జీవితం కావాలి—" అంటూండేవాడు రామదాసు.

అవతడు మనస్ఫూర్తిగా అన్నమాటలు. కాలేజీలో అతడు నాటకాల్లో వేషాలు వేశాడు. మగపిల్లలతడి నటనకు జోహార్లంటే—ఆడపిల్లలు కొందరు ప్రేమలేఖలుకూడా వ్రాశారు. ఒకసారి ముఖ్య అతిథిగా వచ్చిన ఓ సినీ దర్శకుడు రామదాసుకు సినిమా ఆఫరిచ్చాడు. రామదాసు మృదువుగా నిరాకరించాడు.

"సంసార జీవితం గురించి కలలుకంటూ వచ్చిన సదవకాశాల్ని జారవిడుచుకుంటున్నావు. మారేజెస్సార్ మేడిన్ హెవెన్ అంటారు. నీకెలాంటి భార్య వస్తుందో-" స్నేహితులతణ్ణి భయపెడుతూండేవారు.

"ఐ కెన్ మేక్ హెవెన్ ఔటాఫ్ హెల్!" అనేవాడు రామదాసు.

చదువు పూర్తికాగానే ఆ ఊళ్ళోనే కాలేజీ లెక్చరరయ్యాడు రామదాసు. అతడి సచ్ఛీలత గురించి కాలేజీలో అందరూ కథలుగా చెప్పుకునేవాళ్ళు.

ఆ కాలేజీలో కొత్తగా స్టూడెంటుగా ప్రవేశించిన సువర్చల అతడి నాకర్షించింది. శ్రద్ధగా అతడామెను పరిశీలించాడు. ఆమెను గురించిన వివరాలు తెలుసుకున్నాడు. అన్నివిధాలా ఆమె తనకు తగినదని నిర్ణయించుకున్నాక తనామెను ప్రేమిస్తున్న విషయం ఓ శుభ ముహూర్తాన ఆమెకు తెలియబర్చాడు.

సువర్చల ముందు ఆశ్చర్యపడింది. తర్వాత భయపడింది. అటుపైన సంతోషించింది. విషయం రామదాసే ఆమె తలిదండ్రులకు చెప్పాడు. వాళ్ళకూ ఈ సంబంధం నచ్చింది.

పెళ్ళి కుదిరిపోయినట్లేనని సువర్చల అనుకుంది.

అప్పుడు తెలిసిందామెకు అసలు విషయం.

రామదాసు తండ్రి మాధవయ్య. రామదాసుకు చిన్నతనంలోనే తల్లిపోతే మళ్ళీ పెళ్ళికూడా చేసుకోకుండా కంటికి రెప్పలా అతడిని పెంచి ఇంతవాడిని చేశాడాయన. రామదాసుకు తండ్రిమాట శిరోధార్యం. కొడుకు తన మాట వినకపోతే ఆ తండ్రికి గుండె ఆగిపోతుంది. తనకోసం కొడుకేమైనా చేయగలడన్నది ఆయన నమ్మకం. తనకోసం కొడుకు చేత ఏమైనా చేయించుకోవాలనే దుర్బుద్ధి మాత్రం ఆయనకు లేదు.

పెళ్ళి విషయం ఆయన ఒప్పుకొనితీరాలి. లేకుంటే ఈ పెళ్ళి జరుగదు.

“నేను నాకై నేనే ఈ పెళ్ళి సంబంధం చూసుకున్నానంటే నాన్నకోపం వస్తుంది. అందువల్ల మీ నాన్నగారిని పెళ్ళి మామూలుగా సంబంధం ప్రసక్తి చేయమను. ఎట్టి పరిస్థితుల్లోనూ మన ప్రేమవ్యవహారం ఆయనకు తెలియకూడదు—” అన్నాడు రామదాసు

సువర్చలతో.

సువర్చల తండ్రి మాధవయ్యను కలుసుకున్నాడు. తన కూతుర్ని రామదాసుకివ్వాలనుకుంటున్నట్లు చెప్పాడు.

"చాలా సంతోషం—" అన్నాడు మాధవయ్య.

సువర్చల తండ్రి ఆయన్ను పెళ్ళిచూపులకు రమ్మనమని ఆహ్వానించాడు. మాధవయ్య వెంటనే—"పెళ్ళి చూపులకు ముందే మనం తేల్చుకోవలసిన విషయమొకటుంది" అన్నాడు.

"చెప్పండి!" అన్నాడు సువర్చల తండ్రి వినయంగా.

"అబ్బాయికి లక్షరూపాయలు కట్నంగా ఇవ్వాలి. పెళ్ళి ఘనంగా చేయాలి—" అన్నాడు మాధవయ్య.

సువర్చల తండ్రి తెల్లముఖం వేసి—"ఏదో సామాన్యులం—అంత డబ్బెక్కణ్ణించి తేగలం?" అన్నాడు.

"అయితే మీరు సామాన్యమైన సంబంధాలే చూసుకోవడం మంచిది—" అన్నాడు మాధవయ్య తాపీగా.

"మనం మధ్యతరగతివాళ్ళం...." అంటూ సువర్చల తండ్రి యేదో చెప్పబోయాడు.

మాధవయ్య ఆయన్నాపి తన కథ చెప్పాడు.

మాధవయ్యకు భార్యపోయినపుడు పరిస్థితి ఘోరంగా వుంది. భార్య వైద్యం గురించి ఆయన ఆర్థికంగా బాగా నష్టపోయాడు. అప్పుడు బంధువులెందరినో సాయమడిగాడాయన. ఒక్కరూ ముందుకు వచ్చి సాయపడలేదు. ఇప్పుడు రామదాసుకుద్యోగం రాగానే పిల్లనిస్తామంటూ ముందుకొస్తున్నారు. మాధవయ్య కసిగా ప్రతిఒక్కరినీ యాభైవేలు కట్నం కావాలని అడిగాడు.

మాధవయ్యకు కట్నమంటే మోజు లేదు. కానీ ఒకనాడు తనను చిన్నచూపు చూసిన బంధువులపైన

కసి తీర్చుకు నేందుకాయనాపని చేశాడు. ఆయన నడిగిన కట్నానికా వేశపడి—"నీ కొడుక్కి యాభై వేలు కాదు. అయిదు వేలు కూడా యెవరూ ఇవ్వరు—" అన్నాడో బంధువు. దానికి మాధవయ్యింకా ఆవేశపడి—"మీరు గతిలేనివాళ్ళు కదా అని యాభై వేలన్నాను. ఇక మీదట లక్షరూపాయలంటాను. తెలిసిందా?" అన్నాడు.

"నీ కొడుక్కి లక్షరూపాయలా—ఏం మానిస్తారు?" అన్నాడా బంధువు!

"అదే నువ్వు చూద్దువుగాని—" అన్నాడు మాధవయ్య.

"అయితే నీ కొడుకు ఆజన్మబ్రహ్మచారిగా వుండిపోతాడు...."

"అదంతా నీ కనవసరం—" అన్నాడు మాధవయ్య.

"కాబట్టి—బంధువుల్లో నా పట్టుదల నెగ్గించుకుందుకు నేను లక్షరూపాయల కట్నం తీసుకోక తప్పదు...." అన్నాడు మాధవయ్య.

సువర్చల తండ్రి ఆయన ముఖంలోని పట్టుదలను స్పష్టంగా చదివాడు. అనాలా అనకూడదా అని జంకుతూనే—"మీరింత పట్టుదలతో వున్నారు. అవతల మీ అబ్బాయి యే ప్రేమ వివాహమైనా చేసుకుంటే...." అన్నాడు.

"మా దాసు గురించి మీకు తెలియదు. నా అనుమతి లేనిదే వాడూపిరి కూడా పీల్చడు—" అన్నాడు మాధవయ్య.

సువర్చల తండ్రి తిరిగి ఇంటికి వెళ్ళి విషయం కూతురికి చెప్పుకున్నాడు. రామదాసాయన్ను కలుసుకొని జరిగింది తెలుసుకొని — "ఆయన అనుమతిలేనిదే నేనూపిరి కూడా

పిల్చినన్న విషయం నిజం—" అన్నాడు.

సువర్చల తండ్రి కంగారుగా — "అలాంటప్పుడు వ్యవహారాన్నింతవరకూ యెందుకు తెచ్చావు? ఇప్పుడు నలుగురిలో మా పరువేం కావాలి?" అన్నాడు.

"కంగారుపడకండి. ఈ పెళ్ళి వ్యవహారం పదిమందికీ యెలాగూ తెలియదు. ఇంతవరకూ అంతా రహస్యంగానే ఉంది కదా—" అన్నాడు రామదాసు.

"అంటే ఈ పెళ్ళి జరగదంటావా?"

"ఎందుకు జరగదూ? నేనెలాగో అలా మా నాన్ననీ పెళ్ళికి ఒప్పిస్తాను—" అన్నాడు రామదాసు.

"ఎలా ఒప్పిస్తావో కూడా చెప్పు...."

"కట్నమంటే నాకసహ్యం. ఆ విషయం నాన్నకు చెబుతాను. నా ఆశయాల నాయన దెబ్బతీయడని నా నమ్మకం—" అన్నాడు రామదాసు.

అలాగని చెప్పిక నాలుగు రోజులపాటతడు సువర్చల కుటుంబానికి ముఖం చూపించలేదు. ఇందులో యేదో మోసముందని అంతా అనుకుంటూండగా కాలేజీలో అతడు సువర్చల నాల్రోజుకు పార్కుకు రమ్మనమని చెప్పాడు.

ఇప్పుడామె పార్కులో రామదాసు గురించి ఎదురు చూస్తోంది. అన్నటైముకతను రాలేదు. అతడు వస్తాడా అని అనుమానిస్తూండగా ఓ అరగంట ఆలస్యంగా వచ్చాడు రామదాసు.

"సారీ సువర్చలా! ఆలస్యమైపోయింది"—అన్నాడు రామదాసు.

అతణ్ని చూడగానే సువర్చలలో కొత్త ఉత్సాహం పుట్టుకొచ్చింది—"మీ నాన్నను ఒప్పించావా?" అంది.

రామదాసు ముఖంలో దిగులు స్పష్టంగా కనబడింది.

"ఆయనలో ఇంత పట్టుదలుందని నేననుకోలేదు. పెళ్ళి విషయంలో తన మాట వినకపోతే — ఇంక జీవితంలో మేము కలిసి వుండడం వీలుపడదని చెప్పాడు—"

"అందుకు నువ్వేమన్నావు?"

"నన్నర్థం చేసుకో సువర్చలా! మన పరిచయం వయసు కొద్ది నెలలుమాత్రం. ఈమాత్రపు పరిచయం గురించి నేను కొన్ని దశాబ్దాల అనురాగాన్ని దెబ్బతీయలేను-" అన్నాడు రామదాసు విచారంగా.

రామదాసు నిర్ణయం సువర్చల కర్థమైంది—"అది వయసుడిగిన అనురాగం. ఇది కొత్త చిగుళ్ళ ప్రేమాభిమానం. రెంటిలో దేన్ని ప్రోత్సహించాలో నువ్వే బాగా ఆలోచించుకో—" అందామె.

"ఈ విషయంలో నా ఆలోచనంటూ యేమీలేదు. నాన్నే నా తరపున ఆలోచిస్తాడు. నాకెంతో చేశాడాయన. ఆయనకోసం ఇంతకుమించిన త్యాగం చేయడానికి సిద్ధమే నేను!" అన్నాడు రామదాసు.

"నువ్వు నన్ను మోసం చేశావు—" అంది సువర్చల.

"నువ్వు నా గురించి యేమనుకున్నా సరే నాకు బాధ లేదు. నా తండ్రి నన్ను కృతఘ్నుడనుకోకుండా వుంటే చాలు...." అన్నాడు రామదాసు.

"నా ప్రేమ ఎంతో విలువైనది. బలమైనది. అది కాదన్నందుకు ఒకరోజున నువ్వు తప్పక విచారిస్తావు...." అంది సువర్చల.

"నీ ప్రేమకంత విలువ, బలము వుంటే లక్ష రూపాయలు సంపాదించి పెట్టమని ఆ ప్రేమనే అడుగు" అన్నాడు రామదాసు,

"ఇది నువ్వు సృష్టించిన ప్రేమ. ఆ ప్రేమను నువ్వే

నడిపించు. లేదా యెలాగో అలా నువ్వే అంతంచేయి" అంది సువర్చల.

"అయాం సారీ సువర్చలా!" అంటూ రామదాసు అక్కణ్నించి వెళ్ళిపోయాడు.

## 2

"అక్కా!" అన్నాడు దిలీప్.

"ఏరా—" అంది సువర్చల.

"నీకోపం రాదంటే ఓ విషయం చెబుతాను...."

"చెప్పు...."

"ఆ రామదాసును మర్చిపో అక్కా!" అన్నాడు దిలీప్.

సువర్చల ఉలిక్కిపడి—"అలాగేలే!" అంది.

ఆమె సమాధానమతడికి నచ్చలేదు — "ఎందుకని అడగవేం?" అన్నాడు.

"అడగడమెందుకూ? మన దగ్గర లక్ష రూపాయా లేవుకదా—అందుకని!" అంది సువర్చల మామూలుగా.

"అందుకేం కాదు?"

"పోనీలే—ఎందుకో ఒకందుకు...." అని నిట్టూర్చింది సువర్చల.

"అలా ఊరుకుంటావేమిటక్కా — యెందుకని అడగవేం?"

సువర్చల విసుగ్గా—"ఎందుకేమిటి?" అంది.

"నీ ఫ్రెండు స్వతంత్ర లేదూ—" అన్నాడు దిలీప్.

"ఇక్కడలేదు...." అంది సువర్చల.

"ఇక్కడెందుకుంటుందీ — అక్కడ పార్కులో రామదాసుతో కబుర్లు చెప్పుకుంటూ ఉంటుంది...."

అప్పుడు కనపడింది సువర్చల కళ్ళలో కుతూహలం.

ఆ కుతూహలం కలవరంగా మారడానిక్కూడా ఎంతో సేపు పట్టలేదు.

దిలీప్ మ్యాట్నీ సినిమాకు వెళ్ళి తిరిగి వస్తూండగా రామదాసు ఓ అమ్మాయితో పార్కులోకి వెళ్ళడం కనిపించింది. ఎవరా అని పరీక్షించి చూస్తే ఆమె స్వతంత్ర. దిలీప్ రహస్యంగా వాళ్ళ ననుసరించాడు.

పార్కులో వాళ్ళు చెప్పుకున్న కబుర్లు కూడా అతడు విన్నాడు.

రామదాసు డబ్బు గురించి చెబుతున్నాడు.

“నాకు డబ్బే ముఖ్యం. పెళ్ళి చేసుకుంటే డబ్బు కోసమే చేసుకుంటాను. నువ్వు మీ నాన్నను ఒప్పించు” అన్నాడతడు స్వతంత్రతో.

స్వతంత్ర కలవారిబిడ్డ. వాళ్ళింట్లో ఆమెకోసమే ప్రత్యేకమైన కారుంది. ఆమె సాధారణంగా రామదాసు వంటి వారివైపు కన్నెత్తి చూడదు. స్వతంత్ర సువర్చల క్లాసుమేటు. వారిద్దరిదీ మంచి స్నేహం. స్వతంత్రను రామదాసుకు సువర్చలే పరిచయం చేసింది.

దిలీప్ సినిమాలు బాగా చూస్తాడు. దీన్నిబట్టి అతడికర్థమైనదేమిటంటే — రా మ దా సు డబ్బు మనిషి. సువర్చలనుంచి డబ్బు రాబట్టాలనే అతడామెతో ప్రేమ నాటకమాడాడు. అది ఫలించలేదు. ఈలోగా సువర్చల పరిచయం చేసిన స్వతంత్ర అతడంటే ఆకర్షితురాలైంది. అతడామెను వలలో వేసుకున్నాడు.

“అదేమీ కాదు. స్వతంత్రను చూసేక నన్ను వదుల్చుకోవాలనే డబ్బడిగి వుంటాడు. లక్ష రూపాయలనగానే గుడ్లు తేలేశాం మనం. స్వతంత్ర లక్షలు పరిచి వాటిపై అతణ్ని పడుకోబెట్టగలదు....” అంది సువర్చల.

"నువ్వు చాలా బాగా చెప్పావు...." అన్నాడు దిలీప్.

"పటవ్!" అంది సువర్చల.

దిలీప్ కంగారుగా—"ఏం?" అన్నాడు.

"ఈ కథ నీకెవరు చెప్పారు?" అంది సువర్చల గంభీరంగా.

"ఏ కథ?" అన్నాడు దిలీప్ అర్థంకాక.

"రామదాసును నువ్వు స్వతంత్రతో కలిపి మాళావా-వాళ్ళేమో పార్కులో నువ్వు వినేలా మాట్లాడుకున్నారా — ఇలాంటి కథలు చెవులో పువ్వెట్టుకున్న వాళ్ళకి చెప్పు. నాకొద్దు—" అంది సువర్చల.

"నేను చెప్పేది నిజమనుకో!" అన్నాడు దిలీప్.

"ఏది నమ్మాలో యేది నమ్మకూడదో నాకు బాగా తెలుసు...."

"అయితే నేనబద్ధం చెప్పాననంటావు. అందువల్ల నాకు ప్రయోజనమేమిటంటావ్?" అన్నాడు దిలీప్.

"చెబుతాను విను...." అంది సువర్చల.

సువర్చల రామదాసును మనసారా ప్రేమించింది. రామదాసామెను మోసంచేశాడు. రామదాసును గురించిన బెంగతో ఆమె కృంగి కృశించిపోతుందని భయపడి తండ్రి దిలీప్ చేత ఆమెకీ కథ చెప్పించాడు. అందువల్ల రామదాసుపై ఆమె మనసు విరిగిపోతుందనీ ఆమె మామూలు మనిషవుతుందనీ తండ్రి అభిప్రాయం.

"నేనంత బలహీన మనస్కురాలిని కాదు. నేనేమీ కృంగి కృశించిపోవడంలేదు. మామూలుగా వున్నాను. చక్కగా చదువుకుంటున్నాను. ఇలాంటి కథలవసరం లేదని నాన్నకు చెప్పు...." అంది సువర్చల.

"నేను చెప్పేది కథ కాదక్కా! అనవసరంగా లేనిపోనివన్నీ ఊహించుకుంటూ నిజాన్ని నమ్మడంలేదు నువ్వు—" అన్నాడు దిలీప్ దీనంగా.

"నేను నిజాన్ని నమ్ముతాను...." అంది సువర్చల.

"అయితే నా మాటలు నమ్మాలి...."

"నమ్ముతాను. కానీ రామదాసు మంచివాడు కాడని అనుకోను...."

"ఎందుకని?"

"రామదాసు మంచివాడు. లక్షరూపాయల విషయంలో అతడు చెబుతున్నదంతా నిజం. అతడసహాయుడు....'

"కట్నమడిగినవాణ్ణి సమర్థిస్తున్నావా?" అన్నాడు దిలీప్ కోపంగా.

"కట్నం అడిగించుకోవడం అవమానమే! ఒప్పుకుంటాను. కానీ ఇందులో రామదాసు తప్పులేదు. కొందరి మూర్ఖత్వాలకు మంచివాళ్ళు తలవంచక తప్పదు. తండ్రిని కాదని ఈ పెళ్ళి చేసుకుంటే రామదాసు జీవితాంతం మానసిక వ్యథననుభవించాలి. తండ్రిపట్ల కృతఘ్నుడినన్న భావం అతడిని బ్రతికున్నంత కాలం వేధిస్తుంది. సామాన్యులందరూ మహాత్ములు కాలేరు. రామదాసు సామాన్యుడు. సామాన్యులెవ్వరూ కోరి జీవితంలో వ్యథను కొని తెచ్చుకోరు. మన సంగతే తీసుకో—మనమివ్వలేనంత అడిగారన్న కోపం తప్పితే — కట్నమడిగారని మనకూ వాళ్ళమీద కోపంలేదు...." అంది సువర్చల.

"అయితే రామదాసు స్వతంత్రను ప్రేమించడంలో న్యాయముందంటావా?" అన్నాడు దిలీప్ కోపంగా.

"అసలు విషయం నేనూహించగలను. రామదాసు

స్వతంత్రను ప్రేమించడం లేదు....” అంది సువర్చల గంభీరంగా.

“మరైతే—అతడామె డబ్బును ప్రేమిస్తున్నాడనే కదా అర్థం. అప్పుడు మాత్రం అతడు మంచివాడెలా గౌతాడు....?”

“అతడామె డబ్బునూ ప్రేమించడంలేదు. అతడు కావాలనే నువ్వు వినాలనే స్వతంత్రతో అలా మాట్లాడాడు. ఆ విధంగా అతడు నాకతడిపై విరక్తి కలగాలని కోరుతున్నాడు. నేనతడినసహ్యించుకోవాలని అతడి ప్రయత్నం. తండ్రి మాట కాదనలేనివాడంతకంటే ఏం చేయగలడు? అలాంటి ప్రేమమూర్తిని నేనెలా అసహ్యించుకోగలను?”

దిలీప్ ఆశ్చర్యంగా ఆమెవైపు చూసి — “ప్రేమ గుడ్డిదంటే యేమో అనుకున్నాను. నిజమే!” అన్నాడు.

## 3

“సార్!” అన్నాడు సుందరం.

ఏదో ఫైలును సీరియస్ గా చూస్తూన్న ప్రఫుల్లకుమార్ “ఏమిట్రా—?” అన్నాడు చురుగ్గా.

“అమ్మాయిగారి గురించండి....” అన్నాడు సుందరం.

“ఎవరూ — రాధ గురించా?” అన్నాడు ప్రఫుల్లకుమార్. అతడి కళ్ళు కుతూహలంతో పెద్దవయ్యాయి.

“అవునండి....”

“ఏదైనా మంచి కబురు తెచ్చావా?” అన్నాడు ప్రఫుల్లకుమార్.

అతడు రాధని ప్రేమిస్తున్నాడు. అతడి బాస్ జయరామయ్యకావిషయం తెలుసు. జయరామయ్య కూతురే రాధ.

జయరామయ్యకు ప్రఫుల్లకుమార్ శక్తిసామర్థ్యాలమీద మంచి నమ్మకం యేర్పడినాక—అతడినింటల్లుడిగా చేసుకోవాలని తీర్మానించుకున్నాడు.

"నీకు రాధ అంటే యిష్టమని నాకు తెలుసు. కానీ రాధ స్వతంత్ర భావాలుకలపిల్ల. మా యింట్లో దాని మాట కెదురులేదు. ఈ వివాహం గురించి నేను దానికి చెప్పను. అదే నాకు చెప్పాలి. ఆ విధంగా నీ సమర్థతను ఋజువుచేసుకో—" అన్నాడు జయరామయ్య అతడితో.

రాధ పేరు చెప్పి ఆయన వ్యాపారంలోకూడా అతడికి కొన్ని టార్గెట్స్ విధించాడు. ప్రఫుల్లకుమార్ ఇటు బిజినెస్ ఇంప్రూవ్ చేస్తూ అటు రాధ నాకట్టుకునేందుకు తాపత్రయపడుతున్నాడు. కానీ వ్యాపారం కారణంగా రాధ గురించి అతదెక్కువ టైం వెచ్చించలేకపోతున్నాడు. అయితే పలుమార్లతడు రాధకి తన ప్రేమ గురించి చెప్పుకున్నాడు. ఆమె అతడిని ప్రోత్సహించనూలేదు. నిరుత్సాహపరచనూలేదు.

సుందరం అతడికీ విషయంలో సాయపడుతున్నాడు. కావడానికి చప్రాసీయే అయినా అతగాడికి చిన్నతనం నుంచీ రాధతో చనువుంది. అతడామెను చెల్లెమ్మగారూ అని పిలుస్తూంటాడు. ఎవరికైనా చెప్పేటప్పుడుమాత్రం అమ్మాయిగారంటాడు. రాధకూడా మంచి మూడ్‌లో ఉన్నప్పుడేరా అన్నయ్యా అంటుంది.

"కబురంత మంచిది కా దం డి...." అన్నాడు సుందరం.

"ఏం? రాధ నన్నేమైనా అందా?" కంగారుగా అడిగాడతడు.

"మిమ్మల్నేమీ అనలేదండి. కానీ...."

"ఊఁ కానీ...." ఆత్రుతగా అడిగాడు ప్రఫుల్ల కుమార్.

"అమ్మాయిగారీ మధ్య ఓ కొత్త ఫ్రెండును పట్టారు...."

"ఫ్రెండంటే...."

"అమ్మాయి కాదండి. అబ్బాయే...."

"అలాగా...." అన్నాడు ప్రఫుల్లకుమార్ — "ఇది ఆధునిక యుగం. ఆడపిల్లకు మగ స్నేహితులుండడంలో తప్పులేదు...."

"ఆ అబ్బాయి స్నేహితుడులాగుండడం లేదండి. వాళ్ళిద్దరూ ప్రేమికులని పార్కులో చూసినవారెవరైనా అనుకుంటారు...."

"పార్కేమిటి?"

"నిన్న నేను వాళ్ళిద్దర్నీ పార్కులో చూశానండి."

"అంటే వ్యవహారం పార్కులదాకా వచ్చిందన్న మాట...."

"అవునండి...."

"మరప్పుడు నువ్వేం చేశావ్?"

"నేనూరుకోలేదు. వెంటనే అమ్మాయిగారితో — ఈ విషయం ప్రఫుల్లకుమార్ బాబుకు చెబుతానన్నానండి" అన్నాడు సుందరం.

"అప్పుడామె యేమందీ?" ఆత్రుతగా అడిగాడు ప్రఫుల్లకుమార్.

"చెప్పమంది. ఆయనాఫీసు పనుల్లో బిజీగా ఉంటారుగా — నువ్వు చెబితే తప్ప నేనేం చేస్తున్నానో కూడా తెలుసుకోలేడు. మళ్ళీ ప్రేమంటాడు .... ప్రేమట....

ప్రేమ.... అంటూ పళ్ళు పటపటలాడించారండి...."

ప్రఫుల్లకుమార్ కోపంగా - "అప్పుడేం జరిగింది?" అన్నాడు.

"ఆ అబ్బాయి పడిపడి నవ్వాడండి...."

ప్రఫుల్లకుమార్ కోపం పెరిగింది - "వాడలా నవ్వుతూంటే నువ్వు చూస్తూ ఆనందించావా?"

"లేదండి. ఆ అబ్బాయితో దెబ్బలాడదామనుకున్నానండి. కానీ...." అంటూ నీళ్ళు నమిలాడు సుందరం.

"కానీకి యేమయింది?"

"ఆ అబ్బాయి చాలా అందంగా ముచ్చటగా ఉన్నాడండి. ఏమీ అనలేకపోయాను...."

"నీకు నేనంటే చాలా వేళాకోళంగా వుంది...."

సుందరం స్వరం తగ్గించి— "బాబూ—మీ రేమీ అనుకోకపోతే నాదో సలహా..." అన్నాడు.

"నేనింకా నీ సలహా వినే స్థితికి దిగజారిపోలేదు..."

"మీరేమనుకున్నా సరే— నేను చెప్పేది మానను...." అన్నాడు సుందరం—"ఆ అబ్బాయి పేరు రామదాసు. కాలేజీలో లెక్చరర్. సినిమా హీరో లతడిముందు బలాదూర్. పెద్దింటి పిల్లలు చాలామంది అతడి వెనుక పడ్డారు. నిజం చెప్పాలంటే అమ్మాయిగారి పక్కన అతడు జోడుగా చాలా బాగున్నాడు. అయినా సరే అమ్మాయిగారు మిమ్మల్ని చేసుకుంటేనే నేను సంతోషిస్తాను. ఎందుకంటే దేనికైనా తాహతంటూ వుంటుంది. అమ్మాయిగారి విలువను మీరర్థం చేసుకున్నట్లు అబ్బాయర్థం చేసుకోలేడు. అమ్మాయిగారు మీతో సుఖపడ్డట్లు అబ్బాయితో సుఖపడలేరు. ఎర్రగా బుర్రగా

వున్నవాళ్ళంతా మంచి మొగుళ్ళు కాలేరు. ఇదంతా అమ్మాయిగారికి తెలియదనుకోకండి. ఆమె మిమ్మల్ని కాదని ఆ అబ్బాయి వెంటపడ్డానికి కారణం నాకు తెలుసు. అందుకే మీకు సలహా యిద్దామనుకున్నాను. కానీ మీరు వద్దన్నారు....” అని ఆగాడు సుందరం.

“చెప్పరా బాబూ ఆ సలహా యేమిటో!” అన్నాడు ప్రఫుల్లకుమార్.

“చూశారా—అంటే మీరిప్పుడు నా సలహా వినే స్థితికి దిగజారిపోయారన్నమాట..” అన్నాడు సుందరం.

ప్రఫుల్లకుమార్ విసుగ్గా — “చెప్పమన్నానా!” అన్నాడు.

“మీరు ఎల్లకాలమూ బిజినెస్ విషయాలే చూస్తూ కూర్చున్నారంటే ఈ ఆస్తికి కూడా ఎల్లకాలమూ మేనేజరుగానే వుండిపోతారు. యజమాని కాలేరు. యజమాని కావాలనుకుంటే మీకున్న ఇరవై నాలుగ్గంటల్లోనూ కొన్ని అమ్మాయిగారి గురించికూడా ఖర్చుపెట్టండి-” అన్నాడు సుందరం.

“అలాగని మీ అమ్మాయిగారు నీచేత రాయబారం పంపిందా?” వెటకారంగా అన్నాడు ప్రఫుల్లకుమార్.

“ఇంక మీకేమీ చెప్పను—” అన్నాడు సుందరం ఉక్రోషంగా.

“చెప్పరా—” అన్నాడు ప్రఫుల్లకుమార్.

“చెప్పనుగాక చెప్పను....”

“నువ్వు చెప్పకపోతే విశేషాలు నాకెలా తెలుస్తాయి?” అన్నాడు ప్రఫుల్లకుమార్ బెంగను నటిస్తూ.

“విశేషాలు తెలుసుకోవాలనుంటే ఇంకో అరగంటలో

చేతనా పార్కుకు వెళ్ళండి. నేను చెప్పకుండా మీకే తెలుస్తాయి...." అన్నాడు సుందరం.

# 4

ప్రఫుల్లకుమార్ చేతనా పార్కంతా కలయతిరిగాడు. యెక్కడ చూసినా అతడికి యే జంటలోనూ రాధ కనబడలేదు.

"సుందరంగాడో పిచ్చి వెధవ—" అనుకున్నాడతడు మనసులో. అలా అనుకున్నప్పటికీ యేదో మూల అనుమానమూ పీకుతోంది. వృత్తినే తీరికూర్చుని వాడలాంటి కబురు తీసుకురాడుకదా అనుకుంటూండగా అతడికక్కడ ఓ చెట్టు క్రింద ఒంటరిగా కూర్చున్న రాధ కనబడింది.

అంతసేపూ అతడు జంటల్లో రాధకోసం వెతుకుతున్నాడు తప్పితే విడిగా ఆడవాళ్ళ నెవర్నీ చూడలేదు. రాధ, అక్కడ దిగులుగా అశోక వనంలో సీతలా కూర్చుని వుంది..

"హాయ్—" అన్నాడు ప్రఫుల్లకుమార్.

రాధ ఉలిక్కిపడి అతణ్ని చూసి—"హాయ్—" అంది నీరసంగా.

"ఇక్కడ ఒంటరిగా వున్నావేమిటి?" అన్నాడతడు.

"కూర్చో—చెబుతాను...." అంది రాధ.

ప్రఫుల్లకుమార్ ఆమె ఎదురుగా కూర్చున్నాడు.

"మా ఆస్తి ఎంతుంటుందో అంచనావేసి చెప్పగలవా నువ్వు?" అంది రాధ.

"ఎందుకు?" అన్నాడు ప్రఫుల్లకుమార్ ఆశ్చర్యంగా.

"నువ్వు చేరిన రెండేళ్ళలో మా ఆస్తి రెట్టింపు అయిందని నాన్నగారంటూంటారు—...." అంది రాధ అసలు విషయం చెప్పకుండా.

ప్రఫుల్లకుమార్ గర్వంగా నవ్వి—"అది నిజం—" అన్నాడు.

"ఆస్తి రెట్టింపయిందని నీకు తెలుసు కాబట్టి అసలు ఆస్తికూడా యెంతో నీకు తెలిసే వుండాలి—" అంది రాధ.

"నీకా వివరాలెందుకు?"

"నీకు రఘువీర్, శివమూర్తి తెలుసుగదా...."

"వాళ్ళు తెలియకేం—అంతా మనజాతి వాళ్ళేగా.."

"వాళ్ళకంటే మన ఆస్తి యెక్కువో కాదో చెప్పగలవా?"

"ఎందుకు నీకీ వివరాలు!"

"నేను అడిగినప్పుడల్లా వివరాలెందుకూ అనడం తప్ప ప్రశ్నకు బదులివ్వడంలేదు నువ్వు...."

"వ్యాపారసులతో వ్యవహారాలిలాగే వుంటాయి. అవసరాన్నిబట్టి ప్రశ్నలకు జవాబులు మారుతూంటాయి."

"అర్థమయిందిలే—" అని— "నీ ఆలోచనెప్పుడూ వ్యాపారం గురించే వుంటుంది. నా సమస్య ప్రేమ గురించి...." అంది రాధ.

"వివరంగా చెప్పు...."

"నేను రామదాసును ప్రేమించాను...."

"రామదాసెవరు?" అన్నాడు ప్రఫుల్లకుమార్ ఏమీ ఎరుగనట్లు. అయితే సుందరం చెప్పిన విషయంలో కొంత నిజముండడం అతడిని బాధించింది.

"మా కాలేజీలో లెక్చరర్...."

"అతణ్ని ప్రేమించడ మెందుకు?"

"పెళ్ళి చేసుకుందుకు ..." అంది రాధ.

"మరి నేనేమైపోతాను?" అన్నాడు ప్రఫుల్లకుమార్.

"నీకు పెళ్ళెందుకూ — వ్యాపారముందిగా...."

"రాధా! నేను మీ వ్యాపారం పనులు చూడ్డం నీకిష్టంలేకపోతే మానేస్తాను. నాకు నువ్వే కావాలి. నువ్వొద్దంటే వ్యాపారంకూడా వద్దు...."

"నేను వద్దని చెబితేగానీ నా మనసు తెలుసుకోలేవా నువ్వు?" అంది రాధ.

"నన్ను మన్నించు రాధా—కానీ నన్ను కాదనకు.."

"అయాం సారీ మిష్టర్ కుమార్....ఇట్స్ టూ లేట్...." అంది రాధ.

"అంటే—?"

"నువ్వు నిజంగా నన్ను ప్రేమిస్తూంటే—నా ప్రేమ సఫలమయ్యేలా చూడు. నాకూ రామదాసుకూ పెళ్ళయ్యే మార్గం చూడు...."

"ఇది చాలా అన్యాయం...." అన్నాడు ప్రఫుల్ల కుమార్.

"రామాదాస్‌కీ నాకూ పెళ్ళి జరక్కపోతే—నేను నా ప్రాణాలు తీసుకుంటాను. న్యాయా న్యాయాలాలోచించే ముందు నువ్వీ విషయం గుర్తుంచుకో—"

ప్రఫుల్లకుమార్ తెల్లబోయి — "నీ కిష్టమైన పెళ్ళి జరిగితీరుంది. నీవల్ల కానిపని నావల్లనవుతుందని ఎలాగను కుంటున్నావ్?" అన్నాడు.

"ఇది నావల్లకాదు. నీ వల్లనే కావాలి..." అంది రాధ.

"మీ నాన్న నీ మాటే విననప్పుడు నా మాట వింటాడనుకున్నావా?"

"ఇందులో మా నాన్న ప్రసక్తి ఎక్కడొచ్చింది? నాకాయన ఇష్టాయిష్టాలతో నిమిత్తంలేదు. ఈ పెళ్ళికి

రామదాసే ఒప్పుకోవడంలేదు —"

ప్రఫుల్లకుమార్ ముఖంలో కొత్త వెలుగు వచ్చింది—"ఏమిటీ—రామదాసే నిన్ను పెళ్ళిచేసుకోనంటున్నాడా? నువ్వు నచ్చలేదన్నాడా..?" అన్నాడు. కానీ మనసులో అతడికి రవంత బాధకూడా కలిగింది. మంచి పొజిషన్‌లో వుండి జయరామయ్యచేత అభిమానించబడుతూ కూడ తను రాధ ప్రేమను పొందలేక పోతున్నాడు. ఆ రామదాసెవడో కానీ రాధ పెళ్ళి చేసుకుంటాననంటే తిరస్కరించాడు.

"అతడికి నేను నచ్చానా లేదా అన్నది నాకనవసరం. నాకతడు నచ్చాడు. అతడు ఆఫ్టరాల్ లెక్చరర్. నాకు నచ్చి అటువంటివాణ్ని పెళ్ళిచేసుకోలేకపోతే నా జన్మ వ్యర్థం...." అంది రాధ.

"ఆఫ్టరాల్ లెక్చరర్ వాడు. వాడి గురించి నీకెందుకూ ఇంత తాపత్రయం...." అన్నాడు ప్రఫుల్లకుమార్.

రాధ ముఖం ఎర్రబడింది—"రామదాసును ఆఫ్టరాల్ లెక్చరర్ అన్నావంటే నాకు ఒళ్ళు తెలియని కోపం వస్తుంది. ఇంకెప్పుడూ అలాగనకు...."

"నేనేమన్నాను? నువ్వన్నదే నేనూ అన్నాను.."

"రామదాసు నావాడు. అతడి గురించి నా యిష్టం వచ్చినట్లు మాట్లాడే హక్కు నాకుంది. అతడి నితరులేమైనా అంటే నేను భరించలేను—తెలిసిందా?"

రాధ గొంతులోని తీవ్రతకు ప్రఫుల్లకుమార్ భయపడ్డాడు. అప్పుడతడు నెమ్మదిగా—"వివాహానికి అతడి అభ్యంతరమేమిటట?" అన్నాడు.

"డబ్బు...." అంది రాధ —"డబ్బెవరిదగ్గరెక్కువుంటే వాళ్ళను పెళ్ళిచేసుకుంటాట్ట. ఇప్పుడతడు మేనక

చుట్టూ తిరుగుతున్నాడు. మా ముగ్గురిలోకీ తనే బాగా డబ్బున్నదని అది అతణ్ణి బాగా నమ్మించింది—"

"ముగ్గురెవరు?" అన్నాడు ప్రఫుల్లకుమార్.

"రఘువీర్ కూతురు స్వతంత్ర—శివమూర్తి కూతురు మేనక...."

"ఛీ....ఇలాంటి వాడినా నువ్వు ప్రేమిస్తున్నది...."

"నువ్వు నన్ను ప్రేమించడం లేదూ?"

"అంటే?"

"రామదాసే కాక కాలేజీలో ఇంకా నలుగైదుగురు కుర్రాళ్ళున్నారు. వాళ్ళు నాకనుసన్నల్లో యెదురు చూస్తూంటారు. ఆ విషయం నీకోసారి చెప్పాను. అంత మంది నన్ను ప్రేమిస్తున్నారని తెలిసీ నువ్వు నన్ను ప్రేమించడం మానలేదు...."

"అయితే ఏమంటావ్?"

"రామదాసులో ఆడపిల్లలభిమానించే లక్షణాలు చాలా వున్నాయి. నాకు తెలిసి నాతో కలిపి అతడిని గాఢంగా ప్రేమిస్తున్నవారు నలుగురాడపిల్లలున్నారు. ఇందులో అతడి తప్పేముంది? ఇందరాడపిల్లలు తనవెంట పడుతున్నప్పుడు వారిలో ఒక్కరినే ఎన్నుకోవాల్సి నప్పుడు—అతడందుకేదో ఒక నియమం పెట్టుకోవాలి. డబ్బు నతడు నియమంగా పెట్టాలి. నేనిప్పుడు డబ్బుతో అతణ్ణి కొనదలిచాను. అది మనవల్లవుతుందో కాదో నువ్వే తేల్చాలి...."

ప్రఫుల్లకుమార్ గంభీరంగా—"ఇది ఆలోచించాల్సిన విషయమే — నేనోసారి ఆ రామదాసును కలుసుకొని మాట్లాడుతాను—" అన్నాడు.

# 5

"నమస్కారం—నా పేరు ప్రఫుల్లకుమార్. ప్రముఖ వ్యాపారస్థుడు జయరామయ్యగారి మేనేజర్ని...."

"రండి—కూర్చోండి... నాన్నగారింట్లో లేరు...." అన్నాడు రామదాసు.

"నేను మీ కోసమే వచ్చాను. రాధ విషయం మాట్లాడదామని...."

రామదాసు ముఖం గంభీరంగా అయిపోయింది— "రాధ మిమ్మల్ని పంపిందా?" అన్నాడు.

"లేదు—నేనే వచ్చాను. ఆమెను పెళ్ళిచేసుకుందుకు నిరాకరించారుట గా...."

రామదాసు నవ్వాడు — "ఈ వయసులో మనకి పెళ్ళేమిటి చెప్పండి...."

"అంటే?"

"ఆడపిల్లలు మన చుట్టూ తిరుగుతూంటే అదో ఆనందం. పెళ్ళి ఆ ఆనందానికి ఫుల్ స్టాప్ పెడుతుంది." అన్నాడు రామదాసు.

"అలాగని మీరా ఆడపిల్లల మధ్య పోటీలు పెడతారా?"

"నేను పోటీలు పెట్టలేదు...." అన్నాడు రామదాసు- "ఒకరికి తెలియకుండా ఒకరిని నేను చాలామంది అమ్మాయిల్ని ప్రేమించాను. కానీ ఇలాంటి వ్యవహారాలెన్నాళ్ళో దాగవుకదా. నాకింకా ప్రియురాండ్రున్నారన్న విషయం బయటపడగానే తెలివి తేటలుపయోగించి ఒకొక్కరికొకో కారణం చెప్పి వదుల్చుకుంటున్నాను. ఉదాహరణకు రాధకి నేను సువర్చల నే అమ్మాయితో కూడా తిరుగుతున్నట్లు తెలిసింది. ఆమెకోపం వచ్చింది.

సువర్చలను లక్షరూపాయలు కట్నం కావాలన్నాను. అంతటితో ఆ అమ్మాయి ఫినిష్. ఆమెకు పాపం — అట్టే డబ్బులేదు. ఆ తర్వాత స్వతంత్ర, రాధ, మేనక.... నా దురదృష్టంకొద్దీ వీళ్ళు ముగ్గురూ స్నేహితులు. ఎన్నాళ్లో రహస్యం దాగలేదు. అప్పుడు వాళ్ళలో వాళ్ళకు పోటీలు పెట్టాను. ఇప్పుడు నన్నెవరూ బాధించడంలేదు. నాతో ప్రేమ కబుర్లూ మానలేదు...."

"దీనికి ఫలితమేమిటో తెలుసా?" అన్నాడు ప్రఫుల్ల కుమార్.

రామదాసు నవ్వాడు— "నేనేమీ దాచడంలేదు. ఈ ముగ్గురూ తమ ఆధిక్యతను చూపడానికి పోటీలు పడుతున్నారు. ముగ్గురూ భాగ్యవంతుల బిడ్డలు. పోటీలో యెవరోడినా వారి ప్రిస్టేజికి భంగమే! తండ్రులేమో నన్నల్లుడిగా చేసుకోవడం వారి ప్రిస్టేజికి భంగమను కుంటారు. అమ్మాయిలేమో నేనే కావాలంటారు. ముందా తండ్రీ బిడ్డలమధ్య రాజీ కుదరడమే అసాధ్యం. ఒక వేళ రాజీ కుదిరిందా — జయరామయ్య, రఘువీర్, శివమూర్తి — వీరి ముగ్గురిమధ్యా పోటీ ప్రారంభమవు తుంది. ముగ్గురిలో ఇద్దరోడక తప్పదు. అప్పుడా గెలిచిన వాడిమీద మిగతా ఇద్దరూ కలిసికట్టుగా పగబడతారు. అలాంటి పరిస్థితిని తెలిసి తెలిసి యే వ్యాపారస్థుడూ ఆహ్వానించడు. అందుకని వాళ్ళలో వాళ్ళు రాజీకి ప్రయ త్నిస్తారు. అమ్మాయిలది సాగనివ్వను. అందువల్ల యిది యిప్పట్లో తేలే వ్యవహారం కాదు. ఇందులో నాకున్న ప్రమాదమూ లేదు. మరిన్ని యేళ్ళపాటు నా ప్రణయం కొనసాగుతుంది...."

ప్రఫుల్లకుమార్ కు పిడికిళ్ళు బిగిశాయి. అయితే అత

దాకేశాన్నణచుకుని - "ఇందులో నీకు నీ ఊహాకందని ప్రమాదముంది. అదేమిటో త్వరలోనే తెలుస్తుంది—" అన్నాడు.

"నా ప్రియురాండ్రే నాకు శ్రీరామరక్ష...." అన్నాడు రామదాసు.

# 6

జయరామయ్య పళ్ళు పటపట కొరికాడు. "వాడు.... అఫ్టరాల్ లెక్చరర్ .... నా మేనేజర్‌తో ఇలా మాట్లాడతాడా?"

"అయ్యా—మీరు ముందు మేనేజరు గురించి ఆలోచించకండి. అమ్మాయి గురించి చూడండి. ఆమె యెదుటగా ఆ రామదాసుని అఫ్టరాల్ లెక్చరర్ అన్నారంటే ఊరుకోదు...." అన్నాడు ప్రఫుల్లకుమార్.

"ఊరుకోక యేం చేస్తుంది? అయినా ఉన్నమాటనడానికి నాకు భయమేమిటి? ఆ రామదాసుగాడు అఫ్టరాల్ లెక్చరర్. ఒక్కసారి కాదు. పదిసార్లంటాను. ఆ రామదాసుగాడు అఫ్టరాల్ లెక్చరర్ ...."

సరిగ్గా అప్పుడే ఆ గదిలోకి గాధ ప్రవేశించింది. ఆమె ముఖం ఎర్రగా ఉంది. కోపంగా తండ్రివంక చూస్తూ— "నాన్నా! ఈ గదిలోంచి యేవో మాటలు వినబడ్డాయి. అవి అన్నది నువ్వా—ఈ మేనేజరా?" అంది.

జయరామయ్య తడబడుతూ—"నేనింకా యేమీ మాట్లాడలేదమ్మా—మన మేనేజరేదో చెబుతూంటే వింటున్నాను ..." అన్నాడు.

"మిస్టర్ కుమార్! నీకిది లాస్టు వార్నింగ్. నా కిష్టమైన వారినైనా అన్నారంటే నేనేం చేస్తానో నాకే తెలియదు. నువ్వు అఫ్టరాల్ ఓ మేనేజరువన్న విషయం

గుర్తుంచుకో—" అనేసి అక్కణ్ణించి వెళ్ళిపోయింది రాధ.

"ఇది చాలా అన్యాయం. మీరు మీ తప్పును నా మీదకు నెట్టేశారు...." అన్నాడు ప్రఫుల్లకుమార్ దీనంగా.

"అంటే—నేను తప్పుచేశా నంటావ్....ఆ రామదాసుని అష్టరాల్...." అని యేదో అనబోయి—

"ఎందుకలే మళ్ళీ మళ్ళీ అనడంగానీ—అలాగనడం తప్పంటావా?" అన్నాడు జయరామయ్య.

ప్రఫుల్లకుమార్ మాట మారుస్తూ—"ఇంతకీ ఆ రామదాసు నేం చేయాలంటారు?" అన్నాడు.

"ముందు తలుపులు వేసిరా—చెబుతాను...."

ప్రఫుల్లకుమార్ తలుపులు వేసివచ్చాడు.

జయరామయ్య స్వరం తగ్గించి—"ఆ రామదాసు చాలా ప్రమాదకరమైన మనిషిలాగున్నాడు. అలాంటి వాడికి బుద్ధి చెప్పడం పెద్ద కష్టంకాదు. కానీ ఇది స్టూడెంట్సుకు సంబంధించిన వ్యవహారం. రామదాసుకు కాలేజీలో పాపులారిటీ బాగుంటే అతడికేం జరిగినా స్టూడెంట్సు మనమీద తిరగబడతారు. మనం చాలా జాగ్రత్తగా ఆలోచించి మరీ ముందడుగు వేయాలి. నా అభిప్రాయంలో మన మొకసారి రఘువీర్, శివమూర్తులను కలిసి మాట్లాడ్డం మంచిది—" అన్నాడు.

"వాళ్ళతో యేం మాట్లాడతాం?"

"నాకు తెలిసినంతవరకూ శివమూర్తి చేతిలో కొందరు కాలేజీ యూనియన్ నాయకులున్నారు. వాళ్ళు తలచుకుంటే నే కాలేజీ స్టూడెంటుని చీమ కుట్టినా సత్యాగ్రహాలు జరుగుతాయి. వాళ్ళు తలచుకోకపోతే—

స్టూడెంట్సుని హత్య చేసినా అది సామాన్య విషయమై పోతుంది.... —" అన్నాడు జయరామయ్య.

"అంటే యూనియన్ నాయకుల మద్దతు కూడా సంపాదించాలంటారు...." అన్నాడు ప్రఫుల్లకుమార్.

"అంతే కాదు. మనం రఘువీర్ మనుషులనే ఇందుకు నియోగించాలి. ఆయన దగ్గర మేరికల్లాంటివాళ్ళున్నారు. వేటకుక్కలకూ—డా ఆమాంకీ దొరక్కుండా—ఆ రామ దాసుని చావదన్ని రాగలరు వాళ్ళు—...." అన్నాడు జయరామయ్య.

"అందుకాయన అంగీకరించాలిగా...." అన్నాడు ప్రఫుల్లకుమార్.

"చూస్తూ చూస్తూ నా లాంటి వాడెవడూ అఫ్టరాల్ ...." అని ఓసారి గుమ్మంవంక చూసి స్వరంతగ్గించి "లెక్చరర్‌కు పిల్లనివ్వాలనుకోడు. అంతగా తప్పనిసరి పరిస్థితేర్పడి ఇవ్వాల్సొచ్చినా అఫ్టరాల్ ...." అని మళ్ళీ మరోసారి గుమ్మంవంక చూసి—"లెక్చరర్ గాడి కోసం మాలో మేము పోట్లాడుకునే స్థితి యేర్పడనివ్వం...." అన్నాడు జయరామయ్య.

"అయితే వాళ్ళనెప్పుడు కలుద్దామంటారు?"

"ఆలస్యం అమృతం విషం. ఈ రోజే వాళ్ళను కలిసి మాట్లాడుదాం. రేపే రామదాసుకు పాఠం చెప్పడానికి ముహూర్తం పెడదాం. ఎల్లుండి నువ్వోసారి మామూలుగా సరదాగా వెళ్ళి రామదాసును పలకరించి రావచ్చు...." అన్నాడు జయరామయ్య.

సరిగ్గా అప్పుడే జయరామయ్య పక్కన టెలిఫోన్ మ్రోగింది. ఆయన రిసీవర్ తీసి—"హలో!" అన్నాడు.

"రఘువీర్ స్పీకింగ్!" అంది అవతల గొంతు.

"హలో — నేను జయరామయ్యను .... యేమిటి విశేషం?"

"నా కిప్పుడే శివమూర్తి ఫోన్ చేశాడు...."

## 7

రామదాసు మంచి నిద్రలో వున్నాడు. పుస్తకం చదువుతూ చదువుతూ నిద్రపోయాడేమో — అది గుండెల మీదనే వుంది. గదిలో దీపం వెలుగుతూనే ఉంది. ఎటు వంటి కలలు కంటున్నాడో యేమో — ముఖంలో సంతోషం కనబడుతోంది.

అది రామదాసు మంచం. మంచానికి నాలుగువైపులా ఇప్పుడు నలుగురు మనుషులున్నారు. నలుగురూ అజాను బాహులు. నలుగురివీ కండలు తిరిగిన శరీరాలు. నలుగురూ ఒకేరకం యూనిఫారంలో ఉన్నారు. నల్లని నేరోకట్ పాంటు. దానిమీద నిలువు చారల బుష్షర్టు టక్ చేశారు. సుమారు మూడంగుళాల మందమున్న బెల్టు ధరించి ఉన్నారు. ఆ బెల్టుకు మధ్యలో ఉండే బిళ్ళ మీద లేడిని వేటాడుతున్న సింహం బొమ్మ ఉంది.

అప్పుడు వాళ్ళ నలుగురి ముఖాలూ చూస్తూంటే లేడిని వేటాడబోయే సింహాల్లా ఉన్నారు.

నలుగురూ నాలుగువైపుల నుంచీ రామదాసును గమ నించారు. అతడి ముఖంలోని సంతోషాన్ని చూసి తమలో తామే నవ్వుకున్నారు వాళ్ళు.

ముందొకడు రామదాసు గుండెలమీది పుస్తకం తీసి మడతపెట్టి పక్కన పెట్టాడు. తర్వాత నలుగురూ ఒకరి నొకరు చూసి సైగలు చేసుకున్నారు.

అప్పుడొకొక్కరే బుష్షర్టు విప్పి పక్కనే ఉన్న బల్లమీద పెట్టి యథాస్థానాల నలంకరించారు. ఒకసారి

నలుగురూ ఛాతీ ఉబ్బించి కండలు పొంగించారు. అప్పుడు వాళ్ళ శరీరాలు తళతళా మెరుస్తున్నాయి.

ఒకడు ముందుకు వంగి రామదాసును మృదువుగా తట్టాడు. కలలు కంటున్న రామదాసు కా స్పర్శ యే విధంగా తోచిందో యేమో—అతడు నవ్వాడు. ఆ నవ్వు ఎంతో మనోహరంగా ఉంది. కనులు మూసి ఉండడం వల్ల అతడేదో పరవశంలో ఉన్నాడనిపిస్తుంది.

రెండో మనిషి అతడిని మళ్ళీ తట్టాడు. రామదాసు మళ్ళీ నవ్వాడు. అలాగే మూడోమనిషి, నాలుగోమనిషి. వాళ్ళు తట్టినప్పుడల్లా అతడు నవ్వుతున్నాడు.

అప్పుడొకడు రామదాసును కుదిపాడు. రామదాసు ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు. కానీ వెంటనే కళ్ళు తెరవలేదు. ఒక్క నిమిషమలాగే కూర్చుని కళ్ళు మూసుకునే మళ్ళీ వెనక్కి వాలాడు.

అప్పుడు రెండోవాడు రామదాసుని కుదిపాడు. అతడు లేచి కూర్చుని మళ్ళీ వెనక్కి వాలాడు. అలా నలుగురితోనూ జరిగింది.

"వీడు మంచి నిద్రలో ఉన్నాడు..." అన్నాడు వాళ్ళలో ఒకడు. ఆ గొంతు బొంగురుగా ఉంది. చీకట్లో వింటే ఆ గొంతు కెవరైనా జడుసుకుంటారు.

ఇప్పుడా గొంతే రామదాసుకు నిద్రాభంగం చేసింది. అతడు చటుక్కున కళ్ళు విప్పాడు. మంచం చుట్టూ ఉన్న నలుగురినీ చూశాడు. అది కలా నిజమా అనుకుని మళ్ళీ కళ్ళు నులుముకుని చుట్టూ చూశాడు. ఇంకా అనుమానం తీరక తన్ను తాను గిల్లి చూసుకో బోయాడు.

"నిన్ను గిల్లడానికి మేముండగా—నువ్వెందుకూ ఆ

పని చేయడం?" అన్నాడొకడు.

రామదాసు ఉలిక్కిపడి రెండు చెవులూ మూసు
కున్నాడు. ఆ గొంతు కర్ణకఠోరంగా ఉంది.

తను చూస్తున్నది కలకాదనీ ఎవరో తనింట్లోకి ప్రవే
శించారనీ అతడి కర్థమయింది—"ఎవరు మీరు?" అన్నా
డతి కష్టంమీద గొంతు పెగల్చుకుని.

"మే మెవరమో నీకు చెప్పం. అయినా మేము వెళ్ళేక
మే మెవరమో నువ్వు జీవితాంతం గుర్తుంచుకుంటావు—"
అన్నాడు నలుగురిలో ఒకడు.

రైలాగు బాగుందని మెచ్చుకుందామనుకున్నాడు
రామదాసు. కానీ అదే సమయంలో నలుగురూ చేతి
లోకి బెల్టు తీయడం చూసి—"ఏమిటిది?" అన్నాడు.

"శిక్ష...." అన్నాడొకడు.

"ఎందుకు?"

"కక్ష...." అన్నాడింకొకడు.

రామదాసు వాళ్ళకు రెండు చేతులూ జోడించి—
"రక్ష!" అన్నాడు.

నలుగురి చేతుల్లోని బెల్టులూ ఒకేసారి గాలిలోకి
లేచాయి.

"ఒక్క నిముషం ఆగండి...." అన్నాడు రామ
దాసు.

వాళ్ళు ఆగి—"సరిగ్గా ఒక్క నిముషమే ఆగుతాం—"
అన్నారు.

"మా నాన్న యేడీ?"

"ఆయనకు మత్తుమందిచ్చాం. రాత్రేం జరిగిందీ
ఆయనకు తెలియదు—" అన్నాడొకడు.

"నేను చేసిన తప్పేమిటి?"

"అది నువ్వే ఆలోచించుకో...."

"తెలిసి చేసే తప్పా చేయలేదు...."

"తెలిసి చేసినా తెలియక చేసినా తప్పు తప్పే!"

"ఒప్పుకున్నాను. కానీ తెలియక చేసిన ఆ తప్పేదో మీరు చెప్పకపోతే నాకెలా తెలుస్తుంది?"

"ఇలా!" అంటూ ఒకడు బెల్టు గాల్లోకి విసిరాడు.

"ఆగు...." అన్నాడు రెండోవాడు.

"ఎందుకని?" అన్నాడు మొదటివాడు. అతదేం చెబుతాడోనని రామదాసు ఆశగా చూశాడు.

"ఇంకా నిముషం పూర్తికాలేదు...." అన్నాడు మొదటివాడు.

"ప్లీజ్....మీరేం చెబితే అది చేస్తాను. ఎలా చెబితే అలా నడుచుకుంటాను. నా తప్పేమిటో చెబితే యింకెప్పుడూ నా నుంచి అలాంటి తప్పు జరక్కుండా సరిదిద్దుకుంటాను...." అన్నాడు రామదాసు.

"హెచ్చరికలు నీకు ముందే అందాయి...." అన్నాడు మొదటివాడు,

"ఎప్పుడు?"

"అదిప్పుడు చెప్పను...."

"ఎందుకని?"

"ఒక్క నిముషం అయిపోయింది...." అన్నాడు మొదటివాడు.

# 8

"కాలేజీకి ఫోన్ చేశాను. రామదాసీ రోజు సెలవు పెట్టాట" అన్నాడు జయరామయ్య. ఆయన బుగ్గ మీసాల వెనుక దాచుకుందా మనుకున్నా నవ్వు దాగడం లేదు.

"అయితే ఎక్కడికెళ్ళాడంటావు?"అన్నాడు ప్రఫుల్ల కుమార్.

"ఎక్కడికెళ్ళగలడో ఆలోచించి చెప్పు చూద్దాం...." అన్నాడు జయరామయ్య ఇంకా అలాగే నవ్వుతూ.

"ఎక్కడికీ వెళ్ళలేదు...." అన్నాడు ప్రఫుల్ల కుమార్.

"యూ ఆర్ బ్రిలియంట్...." అన్నాడు జయ రామయ్య.

"థాంక్యూ సర్...." అన్నాడు ప్రఫుల్లకుమార్.

"మరి నువ్వోసారి వెళ్ళి అతణ్ణి పలకరించి రావూ?" అన్నాడు జయరామయ్య ఉత్సాహంగా.

"అవునవును. కానీ అది పలకరింపు కాదు. పరా మర్శ...."

"ఏదో ఒకటి....త్వరగా వెళ్ళు...." అన్నాడు జయ రామయ్య.

ఆ వెనువెంటనే కార్లో బయల్దేరాడు ప్రఫుల్లకుమార్. అతడు కారు దిగి ఇంట్లో అడుగు పెట్టగానే మాధవయ్య అతణ్ణి చూసి—"ఎవరు బాబూ నువ్వు!" అన్నాడు.

"రామదాసు స్నేహితుడినండి...." అన్నాడు ప్రఫుల్ల కుమార్.

"వాడికి ఒంట్లో బాగాలేదు...."

"అదే నిన్నటివరకూ బాగానే ఉన్నాడు కదా...."

"ఎవరికైనా బాగున్నప్పుడే జ్వరం వస్తుంది. జ్వర మున్నవాళ్ళకి మళ్ళీ జ్వరం వచ్చిందని అనంగా—" అన్నాడు మాధవయ్య చిరాగ్గా.

ప్రఫుల్లకుమార్ తడబడి—'ముసలాడు ఘటికుడే—' అనుకున్నాడు. పైకి మాత్రం—"నేనొకసారి మీ అబ్బాయిని కలుసుకుని మాట్లాడాలి—" అన్నాడు.

"వాడికిప్పు డెవరితోటీ మాట్లాడ్డం యిష్టం లేదు. అందుకే కాలేజీకి సెలవు కూడా పెట్టాడు" అన్నాడు మాధవయ్య.

"ఒకసారి నా పేరు చెప్పండి. నా పేరు ప్రఫుల్ల కుమార్—" అన్నాడతడు.

మాధవయ్య విసుగ్గానే లోపలకు వెళ్ళివచ్చి—"నీ పేరు చెప్పగానే వాడి ముఖంలో ఉత్సాహం వచ్చింది" అని—"లోపలకు వెళ్ళు—" అన్నాడు.

ప్రఫుల్లకుమార్ లోపల గదిలోకి వెళ్ళాడు. అక్కడ ఓ మంచంమీద పడుకున్నాడు రామదాసు. మంచం పక్కనే ఓ కుర్చీ వుంది. ప్రఫుల్లకుమార్ ఆ కుర్చీలో కూర్చున్నాడు.

"ఏమిటి పని?" అన్నాడు రామదాసు.

"మీ వంట్లో యెలా వుందోనని చూడ్డానికి వచ్చాను...."

"నా వంట్లో నిక్షేపంలా వుంది—"

"అందుకేనా కాలేజీకి సెలవు పెట్టారు?"

"అందుకే మరి! అనారోగ్యంగా ఉన్నప్పుడు చస్తే కాలేజీకి సెలవు పెట్టను—" అన్నాడు రామదాసు.

అతడి మాటల్లో చలాకీతనానికి ఆశ్చర్యపడుతూ— "ఆరోగ్యంగా ఇంట్లో ఇలా పడుకుని యేం చేస్తారు?" అన్నాడు ప్రఫుల్లకుమార్.

"మిమ్మల్ని కలుసుకుని మాట్లాడాలని మాత్రం అనుకోలేదు...."

"మాట భీకరంగానే ఉంది. వళ్ళే తిన్నగా లేదను కుంటాను...." అన్నాడు ప్రఫుల్లకుమార్.

"మీవంటివారి కలాంటి సందేహాలుండడం మంచిది కాదు. వెంటనే తీర్చేస్తాను—" అంటూ లేచి నిలబడి—"ఇంతకంటే తిన్నగా నా వళ్ళుండగా మీ రెప్పుడైనా చూశారా?" అని మళ్ళీ—"అన్నట్లు మీరు తిన్నగా చూడగలరు కదూ!" అన్నాడు రామదాసు.

ప్రఫుల్లకుమార్ తెల్లబోయాడు. ఒకరు కాదు—యిద్దరు కాదు—ఊరి ముఖ్యుల్లో ముగ్గురు కలిసి జమాజెట్టీలాంటి వాళ్ళని నలుగుర్ని పంపితే—ఈ రామదాసు చెక్కు చెదర లేదు సరికదా చిలాకలా కబుర్లు చెబు తున్నాడు.

"రాత్రి నీ దగ్గర కెవరూ రాలేదా?" అన్నా డతడు.

"వచ్చేరు. మొత్తం నలుగురు. ప్రతి ఒక్కడూ కొండల్ని పిండిచేసే వస్తాదులాగున్నాడు. వాళ్ళు నన్ను కొట్టడానికి బెట్టులు కూడా తీశారు—" అన్నాడు రామ దాసు.

"అప్పుడు నువ్వేం చేశావు?"

"నిజం చెప్పమంటారా అబద్ధం చెప్పమంటారా?"

"నువ్వు నిజం చెబుతావన్న నమ్మకం నాకు లేదు—...."

"అయితే నాకు కరాటే వచ్చు. ఒకేఒక్క దెబ్బలో నలుగుర్నీ చిత్తుచేశాను...."

"నేను నమ్మను—" అన్నాడు ప్రఫుల్లకుమార్.

"అరె—నిజం చెబితే నమ్మరని అబద్ధం చెప్పాను. అదీ నమ్మడం లేదు. పోనీ నిజం చెప్పమంటారా?"

"ఊఁ" అన్నాడు ప్రఫుల్లకుమార్ ఆసక్తిని చంపుకో లేక.

"ఇది మీరు కూడా గుర్తుంచుకోండి. ఎక్కడైనా అనుకోకుండా యెవరైనా మిమ్మల్ని హింసించబోయారనుకోండి. వెంటనే హరహర మహాదేవ శంభో అనాలి. అప్పుడా హింసకుడు ఒక్క నిముషం ఆగి గ్రీన్ కార్డుందా—అనడుగుతాడు. అతడికి గ్రీన్ కార్డు చూపించండి. వెంటనే ఆ హింసకుడు మీకో నమస్కారం పెట్టి వెళ్ళిపోతాడు...."

"ఇది నీకెలా తెలుసు....?" అన్నాడు ప్రఫుల్లకుమార్.

"నా దగ్గర గ్రీన్ కార్డుంది. చూస్తారా?" అంటూ పక్కకు వెళ్ళాడు రామదాసు. ప్రఫుల్లకుమార్ ఆలోచనలో పడిపోయాడు. ఈ రామదాసు సామాన్యుడని తాననుకున్నాడు. కానీ అలా కనిపించడంలేదు.

ఆ ఊళ్ళో గూండాలందరికీ వేరే ప్రపంచముంది. వారిని శాసించేవాడు—ఎలమంద. ఎలమంద ఆజ్ఞ లేనిదే గూండా ప్రపంచంలో చీమైనా కుట్టదు. ఎలమందను కాదన్న గూండా మర్నాటికల్లా శవమైపోతాడు. అయితే అ సమానూ అతడు గూండాల వ్యవహారాల్లో జోక్యం చేసుకోడు. ఊళ్ళో గొడవలుగా ఉన్నప్పుడు గూండాలవల్ల వారి రాజపోషకులకు ప్రమాదంలేకుండా ఎలమంద గ్రీన్ కార్డు సిస్టం పెట్టాడు. ఒకో గూండాకు ఒకో రాజపోషకుడుంటాడు. అందువల్ల యెవరు రాజపోషకులో, ఎవరు సామాన్యులో అందరికీ తెలియదు.

అత్యవసర పరిస్థితుల్లో ఎలమంద కొందరికి గ్రీన్ కార్డ్సిస్తాడు. ఆ గ్రీన్ కార్డుమీద దాని వేలిడిటీ పీరియడ్

కూడా ఉంటుంది. పరిస్థితినిబట్టి ఒకరోజు నుంచి నెల రోజులవరకూ ఆ కార్డు చెల్లుతుంది. గూండాల వల్ల ప్రమాదమున్నప్పుడు గ్రీన్ కార్డున్న వ్యక్తి హరహర మహాదేవ శంభో అని అరిస్తే ఆ గూండాలాగుతారు. ఆ గ్రీన్ కార్డు చూపిస్తే అతడినేమీ చేయకుండా వెళ్ళిపోతారు. ఈ విషయం సామాన్యులకు తెలియదు. రామదాసుకెలా తెలిసింది?

రామదాసు గ్రీన్ కార్డు తెచ్చి ప్రఫుల్లకుమార్‌కు చూపించాడు. అతడది చూసి ఆశ్చర్యపోయాడు. నాలుగు రోజుల క్రితం ఆ కార్డు యివ్వబడింది. మొత్తం నెల రోజులు చెల్లుతుంది.

"ఇది నీకెలా వచ్చింది?"

"నళిని తెలుసా నీకు?"

"తెలియదు...."

"పోనీ చిట్టిబాబుగారు తెలుసా?"

"చిట్టిబాబుగారా? వారు తెలియకపోవడమేమిటి?" అని—"అవునూ—అన్నట్టు వారమ్మాయి పేరు నళిని కదూ—నువ్వనేది ఆ నళిని గురించేనా?" అన్నాడు ప్రఫుల్లకుమార్.

"అవును...."

"ఆమె నీకెలా తెలుసు?"

"ఆమె నా ప్రియురాలు...."

"బావ్‌రే...." అన్నాడు ప్రఫుల్లకుమార్.

"ఎందుకో నా మంచిదని నళిని నాకీ కార్డు తెచ్చిచ్చింది. నా దగ్గర ఈ కార్డు గనుక లేకపోతే—నిన్న రాత్రే చచ్చిపోయుండేవాణ్ణి—" అన్నాడు రామదాసు.

"నువ్వు సామాన్యుడివి కాదు—" అన్నాడు ప్రఫుల్ల కుమార్.

"నేను సామాన్యుడినే. అవతలివాళ్ళు చేతకానివాళ్ళయినప్పుడే నేను అసామాన్యుడి నౌతాను—"అన్నాడు రామదాసు.

"నేను సామాన్యుణ్ణి కాను. కానీ నీ ముందు ఓడిపోయాను...."

"ఓటమికి కారణం నువ్వు చేతకానివాడవడం కాదు. నాలాంటి వాడిమీద అన్యాయంగా పగబట్టావు...."

"అన్యాయంగా పగబట్టానా? నువ్వు చేస్తున్నది బాగుందా—అమాయకురాళ్ళైన ఆడపిల్లలను వలలో వేసుకుని వాళ్ళ జీవితాలతో ఆటలాడాలనుకొంటున్నావు...."

"నువ్వు నామీద అసూయపడుతున్నావనుకుంటాను. లేకపోతే యిలా మాట్లాడవు...." అన్నాడు రామదాసు.

"ఏం— నేనన్నది అబద్ధమా?"

"అబద్ధమో నిజమో తర్వాత ఆలోచిద్దాం. దేశంలో యెందరో కూటికీ, గుడ్డకీ, నిలువ నీడకూ అలమటిస్తున్నారు. అలాంటప్పుడు నువ్వు ఎయిర్ కండిషన్డు మేడల్లో ఉంటూ విదేశీ బట్టలు కడుతూ అవసరానికి మించి తిని తాగుతూ విలాసజీవితాన్ననుభవిస్తున్నావు. ఇదన్యాయం కాదా?" అన్నాడు రామదాసు.

"అదన్యాయం కాదు. నా సమర్థత!"

"ఇప్పుడు దారికి వచ్చావు. డబ్బు విషయంలో నువ్వు చేస్తున్నదే ఆడపిల్లల విషయంలో నేనూ చేస్తున్నాను. అది సమర్థతేనని ఒప్పుకుంటావు కదూ!" అన్నాడు రామ

దాడు గంభీరంగా.

ప్రఫుల్లకుమార్ కోపంగా అతడికేసి చూశాడు. అతడి చేతిలోని గ్రీన్ కార్డును చూసి నిట్టూర్చాడు.

## 9

"వాడసాధ్యుడు. మనం పంపినవాళ్ళు వాడినేమీ చెయ్యలేదు. కారణం—వాడి దగ్గర గ్రీన్ కార్డుంది...." అన్నాడు ప్రఫుల్లకుమార్.

"గ్రీన్ కార్డా—మనకే అదంత సులభంగా దొరకదే—వాడిదగ్గరకెలా వచ్చింది?" అన్నాడు జయరామయ్య ఆశ్చర్యంగా.

"చిట్టిబాబుగారి ద్వారా...."

"చిట్టిబాబా?" అన్నాడు జయరామయ్య తెల్లబోయి. కాసేపాయనకు నోటమాట రాలేదు. చిట్టిబాబా ఊళ్ళో మోసగాళ్ళకు మోసగాడు. మంచివాళ్ళకు మంచివాడు. ధనికులకు ధనికుడు. రాజులకు రాజు. ఆయన తలచుకుంటే చేయలేని పనిలేదు. ఏ పనికి తను తలచుకోవాలో ఆయనకు తెలిసినట్లుగా యింకెవ్వరికీ తెలియదు.

"ఆ రామదాసు చిట్టిబాబు మనిషా?" అన్నాడు జయరామయ్య.

"కాదు. వారి కూతురు నళిని కూడా అతణ్ని ప్రేమించింది...."

"అలాగా—అయితే మన సమస్య ఆ అమ్మాయే పరిష్కరించగలదేమో—" అన్నాడు జయరామయ్య.

"అదెలా?" అన్నాడు ప్రఫుల్లకుమార్.

"ఆ నళిని రామదాసుకు గ్రీన్ కార్డు సంపాదించి పెట్టిందంటే—అతణ్ణి బాగా ప్రేమిస్తోందన్నమాట.

తండ్రి కూడా ఈ ప్రేమ నామోదించే ఉండాలి. లేకుంటే గ్రీన్ కార్డు సంపాదించడమంత సులభం కాదు. నళిని రామదాసును పెళ్ళి చేసుకుంటే—మన సమస్య తీరిపోయినట్లే కదా...." అన్నాడు జయరామయ్య.

"మీ బుర్ర అద్భుతం సార్!" అన్నాడు ప్రఫుల్ల కుమార్.

"ఇలా నువ్వు చాలాసార్లు నన్ను పొగిడావు. నాకూ నిన్నిలాగే మెచ్చుకోవాల నుంటుంది. కానీ నువ్వవకాశ మివ్వడంలేదు—" అన్నాడు జయరామయ్య.

"మీరలాగంటే నేను మేనేజరు పదవికి రాజీనామా యిచ్చేస్తాను సార్!" అన్నాడు ప్రఫుల్లకుమార్ వెంటనే.

"అయ్యో! నేనంటున్నది వ్యాపారం గురించి కాదు. ప్రేమ వ్యవహారం గురించి—...." అన్నాడు జయరామయ్య.

"అందరూ అన్నింట్లోనూ రాణించలేరు సార్! నేను ప్రేమ వ్యవహారం నడిపించలేక పోవచ్చు. కానీ నా వళ్ళంతా ప్రేమే ఉంది—...." అన్నాడు ప్రఫుల్ల కుమార్.

"ఆ ప్రేమేదో అమ్మాయికన్నబడుంటే—ఇప్పుడు మన కీ సమస్యే ఉండేది కాదుగదా—" అని నిట్టూర్చి—"నళినికీ రామదాసుకీ పెళ్ళి జరిగిపోవాలి. అందుకు మన మేదైనా చెయ్యాలి—" అన్నాడు జయరామయ్య.

సరిగ్గా అప్పుడే ఆయన పక్కనున్న టెలిఫోన్ మ్రోగింది. జయరామయ్య రిసీవర్ తీసి—"హలో—జయరామయ్య స్పీకింగ్ ... " అన్నాడు.

"జయరామయ్యగారా — నమస్కారం.... ఉండండి.

"....చిట్టిబాబుగారు లైన్లో కొస్తారు...." అందవతలి కంఠం.

జయరామయ్య మౌత్ పీస్ కు చేయి అడ్డం పెట్టి—
"వెతకబోయిన తీగ....చిట్టిబాబు నుంచి ఫోన్...." అన్నాడు.

"వీలు చూసుకుని ఈ విషయ మెలాగో ఆయన బుర్రలో ఎక్కించేయండి—" అన్నాడు ప్రఫుల్లకుమార్ ఉత్సాహంగా.

"హాలో—జయరామయ్యగారా?—" అందవతలి గొంతు.

"నమస్కారం చిట్టిబాబుగారూ!" అన్నాడు జయరామయ్య వెంటనే.

చిట్టిబాబు రెండు మూడు కుశలప్రశ్నలు వేసి—
"మీకు రామదాసనే కాలేజీ లెక్చరర్ గురించి తెలుసా?" అన్నాడు.

ఆయనే రామదాసు ప్రసక్తి తీసుకురావడంతో జయరామయ్య కుత్సాహం వచ్చి—"తెలుసండి—ఏమిటి విశేషం?" అన్నాడు.

"ఆ కుర్రాణ్ణి మా అమ్మాయి నళిని ప్రేమించింది. అందరూ చాలా యోగ్యుడని అంటున్నారు. మీకేమైనా తెలుసేమోనని...."

"నాకు తెలియదు కానీ మా మేనేజరుకి బాగా పరిచయమండి. అతడెప్పుడూ అదే పనిగా నా దగ్గర ఆ రామదాసును పొగడుతూంటాడండి...."

"అలాగా—అయితే యోగ్యుడేనన్నమాట. కానీ మా అమ్మాయికి మేనరికం సిద్ధంగా ఉంది. అది కాదని కూడా ఈ సంబంధం చేయొచ్చంటారా? ఎందుకంటే

అమ్మాయి చాలా యెక్కువగా యిష్టపడుతోంది....”
అన్నాడు చిట్టిబాబు.

“అమ్మా యెక్కువగా యిష్టపడుతున్నప్పుడు—పిల్లాడు యోగ్యుడైనప్పుడు—ఇంక మేనరికాలూ అవీ అంటూ కూర్చోకూడదండి. ఈ సంబంధం విషయంలో మీది నాది ఒకేమాట—” అనేశాడు జయరామయ్య.

“హమ్మయ్య—నా మనసిప్పటికి తేలికపడింది....” అన్నాడు చిట్టిబాబు. ఆయన నిట్టూర్పు టెలిఫోన్లో కూడా స్పష్టంగా వినపడింది.

“ఏమిటండీ—ఈ విషయమై అంత బెంగ పెట్టుకున్నారా?” అన్నాడు జయరామయ్య.

“ఏమిటోనండీ—ఎవరి చాదస్తాలు వాళ్ళవి. నా పద్ధతులు వేరు. నేను మీకులా ఆడపిల్ల యిష్టానికి ప్రాధాన్యత నిచ్చేవాణ్ని కాదు. మా ఇంట్లో మేనరికం అనుకున్న ప్రకారం జరిగితీరాల్సిందే .... ఆ అబ్బాయి యోగ్యుడని నాకూ అనిపించింది. ఎర్రగా బుర్రగా వున్నాడేమో చాలామంది ఆడపిల్ల లతడివెంట పడుతున్నారు. వాళ్ళలో మీ అమ్మాయి కూడా వుంది. మా అమ్మాయి ఇష్టానికి విలువనివ్వలేను కానీ నేను దాని మనసునూ కష్టపెట్టలేను. మీవి చాలా విశాల భావాలు. కాబట్టి రామదాసును మీ ఇంటల్లుణ్ని చేసుకోండి. ఈ విధంగా మనమధ్య సంబంధ బాంధవ్యాలు గట్టిపడతాయి. అతడే కోరి మీ అమ్మాయిని చేసుకుంటే మా అమ్మాయీ నన్ను తప్పుపట్టలేదు....” అన్నాడు చిట్టిబాబు.

జయరామయ్య తెల్లబోయాడు. తానొకటనుకుంటే జరిగిందింకొకటి.... “హలో....చిట్టిబాబుగారూ.... నేను

చెప్పేది వింటారా?" అన్నాడాయన.

అవతల్నించి చిట్టిబాబు — "ఆర్థికంగా, రాజకీయ పరంగా, ఇతరత్రా నేను మీ కంటె బలవంతుణ్ణి కావచ్చు. కానీ మీ అమ్మాయి ప్రేమబలంముందు మా అమ్మాయి ప్రేమకు బలం చాలక ఓడిపోయింది. ఇందుకు మిమ్మల్నభినందిస్తున్నాను. ప్రస్తుతానికి సెలవు...." అని ఫోన్ పెట్టేశాడు.

జయరామయ్య తనూ ఫోన్ పెట్టేశాడు. ప్రఫుల్ల కుమార్ అతడివంక చూసి—"అదేంటండీ—అలా నీరసంగా అయిపోయారు!" అన్నాడు.

"చిట్టిబాబు అసాధ్యుడు. రామదాసు గురించి మొత్తం కూపీలాగాడు. నన్ను మాటల్లో బోల్తాకొట్టించి ఇప్పుడు మా అమ్మాయికే ఆ సంబంధం చేసుకోమంటున్నాడు. కాదంటే, పరోక్షంగా తన బలం గురించి హెచ్చరించాడుకూడా. ఇప్పుడు రాధకి రామదాసుతో పెళ్ళయినా జరిపించాలి. లేదా—నళినికి రామదాసు పీడ విరగడయ్యేలా చేయాలి....ఆ బాధ్యత పూర్తిగా మనది" అన్నాడు జయరామయ్య సోఫాలో వెనక్కి జారగిలబడిపోతూ.

అంతలోనే మళ్ళీ టెలిఫోన్ మ్రోగింది.

"నాకదోలా వుంది — నువ్వే ఫోన్ తీయి—" అన్నాడు జయరామయ్య.

ప్రఫుల్లకుమార్ వెళ్ళి ఫోనందుకున్నాడు—"హలో నేను రఘువీర్‌ని మాట్లాడుతున్నాను. ఇప్పుడే శివమూర్తి నాకు ఫోన్ చేశాడు...." అంది అవతలి గొంతు. అతడు రఘువీర్ చెప్పిందంతా విని ఫోన్ పెట్టేసి—"మనదిప్పుడు పూర్తి బాధ్యతకాదు. మనతో బాధ్యత పంచు

కుందుకు మరో యిద్దరున్నారు ..." అన్నాడు జయ రామయ్యతో.

# 10

జయరామయ్య, రఘువీర్, శివమూర్తి కూర్చుని సీరి యస్‌గా చర్చల్లో వుండగా ప్రఫుల్లకుమార్ అక్కడకు వచ్చి—"ఓ కొత్త విషయం తెలిసింది సార్. మాంత్రి కుడి ప్రాణమెక్కడుందో దొరికినట్లే—" అన్నాడు.

"ఏమిటది?" అన్నారు ముగ్గురూ ఏకకంఠంతో.

"రామదాసు తండ్రి మాధవయ్య. మన రామదా సెంతటి హీరో అయినా తండ్రి చేతిలో కీలుబొమ్మ. ఏ పెళ్ళి జరగాలన్నా ఆయన అనుమతితోనే జరగాలి. రామదాసు ఆయన వద్దన్న పని చేయడు. చేయమన్నది చేసితీరతాడు ...."

"అయితే?"

"రామదాసు పెళ్ళిలో మాధవయ్యది కీలకపాత్ర. ఆయనకు కట్నం కనీసం లక్షరూపాయలు కావాలి. పెళ్ళి ఘనంగా చేయాలి. అటుపైన సంప్రదాయం కల వాలి. ఆయనలో సంప్రదాయం కలిసిన వాళ్ళెవ్వరూ పది వేలకు మించి ఇచ్చుకోరు. అందుకని రామదాసుకిప్పట్లో పెళ్ళయ్యే అవకాశంలేదు. పెళ్ళయ్యేదాకా అతడిలాగే బలాదూర్‌గా తిరుగుతూ మనబోటివాళ్ళకిబ్బంది కలిగి స్తూంటాడు ...."

"అయితే ఏం చేయాలంటావ్?" అన్నాడు జయ రామయ్య.

"మాధవయ్యకు అన్నివిధాలా నచ్చిన సంబంధమొక టుంది. అమ్మాయి పేరు సువర్చల ....కట్నం దగ్గర పేచీ వచ్చి ఈ పెళ్ళి ఆగిపోయింది ....ఆ కట్నమూ—పెళ్ళి

ఖర్చులూ మనం భరించగలిగేమంటే రామదాసు పీడ మనకు వదులుంది...."

"ఇంత లేసి పరిచయాలయ్యాక రామదాసు ఆ మధ్య తరగతి పిల్లను చేసుకుందు కొప్పుకుంటాడంటావా?" అన్నాడు శివమూర్తి.

"ఆ సువర్చల నాకు తెలుసు. మా అమ్మాయి స్వతంత్ర స్నేహితురాలు. పిల్ల చాలా బాగుంటుంది. ."

"ఆ రామదాసుకంద మెందుకండీ — అతగాడు చూసేది డబ్బు.." అన్నాడు శివమూర్తి.

"మనమింక రామదాసు గురించి ఆలోచించవద్దు. ఇక ముందు కథంతా మాధవయ్య చుట్టూ తిరుగుతుంది.."

"సరే—ఎంత ఖర్చయినా ఫరవా లేదు. ఈ వ్యవహారమేదో తేల్చేసేయ్.." అన్నాడు జయరామయ్య.

# 11

కట్నం లక్షాయాభై వేల నెసరికి మాధవయ్య వెంటనే ఒప్పేసుకున్నాడు. రామదాసు గురించి మాట్లాడకుల్లే దన్నాడు.

పెళ్ళి స్థిరపడిపోయింది.

ఈ పెళ్ళి నిశ్చయమైనందు కందరూ యెంతో సంతోషించారు—ఒక్క దిలీప్ తప్ప!

ఇలా పెళ్ళి నిశ్చయమైనట్లు తెలియగానే అలా రహస్యంగా అక్కనో గదిలోకి తీసుకొనిపోయి—"అక్కా! నా మాట విను... ఈ పెళ్ళికి ఒప్పుకోకు..ఆ రామదాసు నిజంగానే మంచివాడు కాదు. నాకు బాగా తెలుసు. నేను నా కళ్ళారా చూశాను..." అన్నాడు.

"నువ్వు చూసిన దానికంటే నాకు ఎక్కువ తెలుసు..." అంది సువర్చల.

"ఏమిటి తెలుసు?" అన్నాడు దిలీప్ ఆశ్చర్యంగా.

"అతడు స్వతంత్రతో మాత్రమే కాదు..ఇంకా చాలా మంది అమ్మాయిలతో ప్రేమవ్యవహారం నడిపాడు."

"అయితే అంతా నీకు తెలుసన్నమాట."

"తెలుసు."

"అయినా ఇక పెళ్ళికెలా ఒప్పుకుంటున్నావ్?"

"అతదేం చేసినా నాకోసమేగదా!"

"అంటే?"

సువర్చల అతడికి వివరించింది.

స్వతంత్ర ఆమెకు స్నేహితురాలు. పెళ్ళి విషయంలో జరిగింది విని ఆమె చాలా బాధపడింది. తను డబ్బు సాయం చేయాలనుకుంది. కానీ అంత క్యాష్ ఆమెకద్ద వుండదు. బట్టలు కావాలన్నా, ఏం కావాలన్నా ఆమె డబ్బిచ్చి కొనక్కర్లేదు. ఆమె చేతిలో ఎప్పుడూ వెయ్యి రూపాయలకు మించి క్యాషుండదు.

అప్పుడామె తనకు బాగా దగ్గర స్నేహితురాండ్రయిన రాధ, మేనక, నళినిలతో మాట్లాడింది. వాళ్ళ పరిస్థితీ అంతే! అప్పుడందరూ కలిసి చర్చలు జరిపారు. వాళ్ళ చర్చల ఫలితంగా తేలిందేమిటంటే—సామాన్యుడితో తమ పెళ్ళి జరక్కుండా ఆపడానికి ఎంతైనా ఖర్చు చేయగల తమ తలిదండ్రులు-సామాన్యుల పెళ్ళి గురించి ఒక్క పైసాకూడా సాయం చేయరు.

అయితే ఆ విధంగానే డబ్బు సంపాదిద్దామని—వాళ్ళనుకున్నారు. ఫలితంగా ప్రేమనాటకం ప్రారంభమైంది. తర్వాత అదెటువంటి అపార్థాలకు దారితీయకూడదని ఈ విషయాన్ని వాళ్ళందరూ సువర్చల, రామదాసులముందే చర్చించారు. అందువల్ల ఈ ప్రేమనాటకం

వారి వారి తల్లిదండ్రులకు మాత్రమే తెలిసేవిధంగానూ-ఇతరత్రా రహస్యంగానూ కొనసాగింది.

వాళ్ళాశించిన దేమిటంటే - "మా అమ్మాయి జీవితం లోంచి వెళ్ళిపోవడానికి నీకెంత డబ్బు కావాలి?" అని తమ తండ్రులు రామదాసునడుగుతారని. అప్పుడతడు డబ్బు మనిషిలా నటించి ప్రతిఒక్కరి దగ్గర్నుంచీ యాభై వేలకు తక్కువ కాకుండా వసూలు చేయాలని!

అయితే ఈ ప్రేమనాటకమెంతలా రక్తి కట్టిందంటే ఆడపిల్లల తండ్రులదిరిపోయారు. రామదాసును లొంగదీయడం తమవల్ల కాదనుకున్నారు. ఆఖరికి మాధవయ్యను ఆశ్రయించారు.

ఎలాగైతేనేం నాటకం సత్ఫలితాలనే యిచ్చి పెళ్ళి కుదిరింది.

దిలీప్ ఆశ్చర్యంగా-"నేనిది నమ్మలేకుండా వున్నాను" అన్నాడు.

"మన దేశంలో ధనికులవద్ద ఎంతైనా డబ్బు మూలుగుతోంది. అది వారు సత్కార్యాలకుపయోగిస్తే దేశం సస్యశ్యామలంగా, నిత్యకళ్యాణం పచ్చతోరణంగా వుంటుందనడానికి నా కథే సాక్షి. కానీ అలా జరగడం లేదనడానికి మన దేశం సాక్షి.." అంది సువర్చల.

"అంటే బావ నిజంగానే మంచివాడన్నమాట.." అన్నాడు దిలీప్.

"అవును. నేను గ్రీన్ కార్డు ఇచ్చాను కాబట్టే అతడలా ప్రవర్తించగలిగాడు. ఇప్పటికి నువ్వతణ్ని బావ అనగలిగినందుకు నాకు చాలా సంతోషంగా వుంది-" అంది సువర్చల.

గ్రీన్ కార్డన్న పదాన్ని అనుమతికి పర్యాయపదంగా

వాడినట్లు దిలీప్ గ్రహించి "నేను రామదాసుని బావా అంటాను. సరే! మరి పెళ్ళయ్యాక నువ్వేమని పిలుస్తా వశ్రా" అన్నాడు నవ్వుతూ.

"గ్రీన్ కార్డ్ హోల్డర్!" అంది సువర్చల-"అయితే ఆ గ్రీన్ కార్డు నాతో మాత్రమే చెల్లుబడి అవుతుంది. ఇది వరకటిలా అందరమ్మాయిలతో కాదు...."

—: అ యి పో యిం ది:—

# జీవం వున్న దేవత

అజీజ్

"కెప్టెన్!"

"ఊఁ!"

"మనం భారత దేశంలో దించాల్సిన సరుకులన్నీ దించబడ్డాయి. మన ఓడను బూత్‌కు దూరంగా తీసికెళ్ళి నిలపమని హార్బర్ నించి ఆదేశాలొచ్చాయి. కాసేపట్లో కస్టమ్స్ ఆఫీసరులొచ్చి ఫైనల్ చెకప్ చేస్తారుట" చెప్పాడు స్టోర్ కీపర్ కెప్టెన్ ముందు సరుకుల తాలూకు ఫైలు పెడుతూ.

వాలుకుర్చీలో జారగిలబడి, కాళ్ళు టీపాయ్‌మీద చాపుకొని, సిగరెట్ కాలుస్తూ తీవ్రాలోచనల్లో మునిగి వున్న కెప్టెన్ లుంబా కళ్ళు తెరిచి సాలోచనగా తలూపాడు. "ఆల్ రైట్! లంగరు ఎత్తమని చెప్పు సిబ్బందికి" అంటూ ఫైలందుకున్నాడు.

స్టోర్ ఉద్యోగి వెళ్ళిపోగానే ఫైలు పరిశీలనలో మునిగిపోయాడు కెప్టెన్. తాము భారత దేశానికి చేర వేసిన

సరుకులన్నీ క్షేమంగా చేరినట్టు విశాఖపట్నం హార్బర్ అధికార్లు సంతకంజేసి, సీలువేసిన కాగితాలవి. తృప్తిగా తలూపి, సిగరెట్ ఆఖరి దమ్ము లాగి, ఆష్ట్రేలో నొక్కి లేచాడు లుంబా.

దక్షిణాఫ్రికాకు చెందిన రవాణా ఓడ అది. వివిధ దేశాల్లో సరుకులు దింపుతూ, ఎత్తుతూ ఆ రోజు ఉదయమే వచ్చింది విశాఖ రేవుకు. అంతవరకూ ప్రయాణ బడలిక తీర్చుకుంటూ తన కేబిన్‌లోనే వున్నాడు కెప్టెన్ లుంబా.

అతను దక్షిణాఫ్రికా నీగ్రో యువకుడే అయినా, పూర్తిగా నీగ్రో కాదు. కలర్ హెడ్! ఇప్పటికీ బ్రిటన్ పాలనలో వున్న దక్షిణాఫ్రికాలో యెంతోమంది తెల్ల వారుకూడా నివసిస్తున్నారు. ఆ తెల్లవాళ్ళకూ, అక్కడి నీగ్రో యువతులకూ మధ్య జరిగే తాత్కాలిక సంపర్కాలవల్ల పుట్టిన వాళ్ళనే కలర్ హెడ్స్ అంటారు!

వాళ్ళ రంగు నీగ్రోల్లా పూర్తిగా నలుపూ కాక, తెల్ల వారిలా తెలుపూ కాక నలుపులో ఇంత ఎరుపు రంగు కలిపినట్టు నిగనిగ మెరుస్తూ ఉంటుంది. కనుముక్కు తీరు కూడా నీగ్రోల్లా ఎబ్బెట్టుగా కాకుండా కాస్త నదురుగా ఉంటాయి.

ఆ సంకరజాతికి చెందిన ముప్పైయేళ్ళ యువకుడే కెప్టెన్ లుంబా! మంచి పొడవు. కసరత్తులో ఉక్కు ముక్కలా తయారైన శరీరం! విశాలమైన ఛాతీ. కండలు తిరిగిన చేతులు. ఉంగరాలు తిరిగిన పొట్టి జుత్తు. తెల్లని మర్చంట్ నేవీ యూనిఫాంలో అతని చాక్లెట్ రంగు శరీరం కంటి కింపుగా ఉంటుంది.

కేబిన్‌లోంచి బైట అడుగుపెడుతూ రిస్టువాచీ చూసు

టున్నాడు. సాయంత్రం ఆరుగంటలు. అప్పటికే ఓడ లంగరు ఎత్తేశారు సిబ్బంది.

నడుస్తూనే వారికి ఆదేశాలిస్తున్నాడు కెప్టెన్ లంబా. పది నిమిషాల్లో ఓడ బూత్ వదలి, హార్బర్ అధికార్లు సూచించిన ఖాళీ ప్రదేశంలో కెళ్ళి నిల్చుంది. రేలింగ్ ని సమీపించి, హార్బర్ వైపు చూశాడు లంబా.

అదే సమయంలో చిన్న లాంచీ ఒకటి తమ ఓడవైపు బెలుదేరడం కనిపించిందతనికి. అందులో ఫైళ్ళు పట్టుకు కూర్చున్న వ్యక్తుల్ని చూడగానే సాలోచనగా తలూపాడు లంబా. కస్టమ్స్ ఆఫీసర్లు!

లాంచీ నెమ్మదిగా ఓడను సమీపించగానే నీళ్ళలోకి నిచ్చెన వదలమని ఆదేశించాడు తన సిబ్బందికి. వెంటనే తాళ్ళతో చేసిన ఓ నిచ్చెన నీటిలో జారవెయ్యబడింది.

కస్టమ్స్ అధికారులు ఓడమీదికి రాగానే, "స్వాగతం! సుస్వాగతం!" అన్నాడు లంబా చెయ్యి చాపుతూ.

"సారీ కెప్టెన్! మీ ఓడను చివరిసారి చెక్ చెయ్యడానికి వచ్చాం!" అన్నాడు ఓ ఆఫీసర్ అతనితో కరచాలనం చేస్తూ.

"నిరభ్యంతరంగా! ఈసారే కాదు, మరో పదిసార్లు వచ్చినా నాకెలాంటి అభ్యంతరం ఉండదు" అన్నాడు లంబా నిండుగా నవ్వుతూ. నవ్వినపుడు అతని పలువరస తెల్లగా తళతళ మెరుస్తుంది.

కస్టమ్స్ ఆఫీసర్లు ఓడ నాలుగువైపులా వ్యాపించారు. సెర్చింగ్ ప్రారంభమైంది. చట్టం ఆమోదించని మత్తు మందులూ, వజ్రాలూ, వెండి బంగారాలూ, యితర స్మగ్లింగ్ సరుకులేవయినా ఓడలో దాచబడున్నాయేమోనని!

దాదాపు గంట గడుస్తోంది. సీనియర్ కస్టమ్స్ ఆఫీసర్ డెక్ మీద నిల్చుని కెప్టెన్ లుంబాతో కబుర్లు చెబుతూ అతని మొహాన్ని, కళ్ళనీ పరీక్షగా చూస్తున్నాడు. కస్టమ్స్ డ్యూటీలో ఫేస్ రీడింగ్ కూడా చాలా ప్రాధాన్యత వహిస్తుంది. ఎదటివారి మనసులో ఏముందో కళ్ళూ, మొహమూ యిట్టే చెప్పేస్తాయి.

అందుకే కస్టమ్స్ ఆఫీసర్లు వస్తువులతో బాటు మనుషుల మొహాలను కూడా చాలా పరీక్షగా చూస్తారు. గంట గడిచినా కెప్టెన్ లుంబా మొహంలో ఎలాంటి అనుమానాస్పద భావమూ కనిపించకపోవడంతో కస్టమ్స్ ఆఫీసర్‌కు నమ్మకం కుదిరింది ఆ ఓడలో ఎలాంటి అనుచిత వస్తువూ లేదని.

అంతలో అతని సిబ్బంది కూడా తిరిగివచ్చి, క్లియరెన్స్ రిపోర్టు ఇచ్చారు.

"మాతో సహకరించినందుకు మెనీ థాంక్స్ కెప్టెన్! వస్తాం!" అన్నాడు కస్టమ్స్ ఆఫీసర్ లుంబాతో కరచాలనం చేస్తూ.

"మళ్ళీ వస్తారా?" అడిగాడు లుంబా ఆశ్చర్యం నటిస్తూ.

కస్టమ్స్ ఆఫీసర్ పెద్దగా నవ్వి, "నో, నో!" అంటూ నిచ్చెన దిగి, లాంచీలో కూర్చున్నాడు. అక్కడే నిల్చుని, హార్బర్ వైపు సాగిపోతున్న లాంచీని చూస్తూ చెయ్యి ఊపసాగాడు లుంబా. అది కనుమరుగవగానే లోలోపల నవ్వుకున్నాడు చిన్నగా!

భారతీయులు చాలా అమాయకులని విన్నాడు తను. అది అక్షరాలా నిజమని ఈనాడు తెలిసింది. తన ఓడలో నిక్షిప్తమై ఉన్న ఆ రహస్య కేబిన్ని అఖరికి వాళ్ళు

కనుక్కోలేక పోయారన్న మాట! పాపం! పూర్ ఆఫీసర్స్!!

అనుకుంటూ వెనుదిరిగి, తన కేబిన్ వైపు నడిచాడు. ఓడ సిబ్బంది తమతమ పనుల్లో నిమగ్నమై ఉన్నారు. వాళ్ళను పట్టించుకోకుండా తన కేబిన్‌లో కెళ్ళి, ఓ పేము కుర్చీలో చతికిలబడ్డాడు కెప్టెన్. కుర్చీ వెనక తల ఆనించి కళ్ళు మూసుకుంటూ నెమ్మదిగా పిల్చాడు "జోంజా!"

"ఎస్ సర్!" అంటూ కేబిన్‌లోకి వచ్చిందో అందమైన యువతి.

"విస్కీ!" చెప్పాడు లుంబా, కళ్ళు తెరవకుండానే.

## 2

చెక్క బీరువా తెరిచి, ఆకుపచ్చరంగు విస్కీ బాటిల్, గ్లాసూ తీసి, అతని ముందుంచిందా యువతి. కళ్ళు తెరిచి, నింపాదిగా బాటిల్ కార్క్ తీసి, గ్లాసులో పోసుకోకుండా నోటికి ఆనించాడు లుంబా.

నిమిషంలో ఖాళీ అయింది బాటిల్.

"ఇంకోటి!" అన్నాడు ఖాళీసీసా టీపాయ్‌మీద పెడుతూ.

యువతి మరో బాటిల్ తీసి అతని ముంగుంచింది.

"వెళ్ళి జనరేటర్ స్టార్టు చెయ్యమని చెప్పు ఫోర్ మెన్‌కు" అన్నాడు గ్లాసందుకుంటూ. యువతి వెళ్ళిపోగానే ఈసారి గ్లాసులో విస్కీ ఒంపుకొని, కొద్ది కొద్దిగా తాగసాగాడు. ఓడలో లైట్లు వెలిగాయి. గంటలోపల ఆ సీసా కూడా ఖాళీ అయింది. రిస్టువాచీ చూసుకున్నాడు. రాత్రి ఎనిమిది గంటలు!

"జోంజా!" పిల్చాడు గట్టిగా.

"ఎస్ సర్!" అంటూ వచ్చిందా యువతి.

"డిన్నర్ రూంలో భోజనం ఏర్పాటు చెయ్! నువ్వు డార్లింగ్ డ్రెస్‌లో సిద్ధంగా వుండక్కడ" ఆజ్ఞాపించాడు తల వెనక్కి వాలుస్తూ.

"ఎస్ సర్!" అంటూ వెళ్ళిపోయిందా యువతి.

చిన్నగా నవ్వుకున్నాడు లుంబా, ఆ యువతి అతని సేవకురాలేకాదు, ప్రియురాలూ, సెక్రటరీకూడా! ఐతే, ఏ సమయంలో ఏ విధులు నిర్వహించాలో ఆ యా సమయాల్లో యేయే దుస్తులు తొడుక్కోవాలో వారిమధ్య ఓ క్రమశిక్షణ పాటించబడుతోంది.

సేవకురాలి డ్యూటీ నిర్వహించేటప్పుడామె నీలిరంగు స్కర్టులో పదహారణాల సర్వెంట్‌లా వుంటుంది. ఆ సమయంలో ఆమెగానీ, అతనుగానీ పరస్పరం ఎలాంటి చనువునూ వ్యక్తం కానివ్వరు.

ప్రియురాలి విధులు నిర్వహించేటప్పుడామె కిష్టమైన యే దుస్తులైనా వేసుకోవచ్చు. అప్పుడు వారిమధ్య చనువుకు పట్టపగ్గాలుండవు. సెక్రటరీ డ్యూటీ సమయంలో మళ్ళీ పూర్తి గాంభీర్యం చోటు చేసుకుంటుంది వారిమధ్య.

లేచి అడుగులో అడుగు వేసుకుంటూ కేబిన్ తలుపు వైపు నడిచాడు లుంబా. రెండు విస్కీ సీసాలు ఖాళీ చేసినా, అతని మొహంలోనూ, నడకలోనూ తాగినవాడి లక్షణాలేవీ కనిపించడంలేదు.

కేబిన్ దాటి డైనింగ్ రూంలో అడుగు పెట్టాడు. విశాలమైన టేబిల్ మీద పాలమీగడలాంటి దుప్పటి పర్చి వుంది. వెళ్ళి తన కుర్చీలో కూర్చున్నాడు. అప్పుడు అడుగుపెట్టిందామె గదిలోకి. అంతక్రితం కనిపించిన

జోంజాకూ, ఈమెకూ భూమ్యాకాశాల తారతమ్యం కనిపిస్తోంది.

"వెల్‌కమ్ మై స్వీట్ హార్ట్!" అన్నాడు టుంబా ఆమె చెయ్యందుకుంటూ. ఆ చేతిని ముద్దాడి, తన పక్క సీటులో కూర్చోబెట్టుకున్నాడు. ఇద్దరు నీగ్రో బట్లర్లు భోజన పదార్థాలు తెచ్చి టేబిల్ మీద సర్దసాగారు. గంట పట్టింది వారి భోజనం పూర్తయ్యేసరికి.

తృప్తిగా సిగరెట్ అంటించి, బేరర్‌కు సైగ చేశాడు టుంబా. మరుక్షణం ఓ మూల వున్న టేప్ రికార్డర్ ఆన్ అయింది. ఇద్దరూ లేచారు. ఆమె నడుం చుట్టూ చెయ్యివేసి, టేబిల్ కెడంగా వున్న ఖాళీ ప్రదేశంలోకి తీసుకెళ్ళాడు టుంబా.

టేప్ రికార్డర్లోంచి సన్నగా, శ్రావ్యంగా వినిపిస్తున్న వెస్టర్న్ మ్యూజిక్ కనుగుణంగా అడుగులు వేస్తూ డాన్స్ చెయ్యసాగారిద్దరూ. అరగంట తరవాత ఆమె పెదాలు చుంబించి, టేప్ రికార్డర్ ఆఫ్ చేస్తూ అన్నాడు నెమ్మదిగా, "సెక్రటరీ!"

వెంటనే పక్క గదిలోకి నడిచింది జోంజా. రిస్టు వాచీ చూసుకున్నాడు. పదిగంటలు. ఆలోచిస్తూ తన కేబిన్‌లో కెళ్ళి పేముకుర్చీలో జారగిలబడ్డాడు. ఐదు నిమిషాల్లో వచ్చేసింది జోంజా. ఇప్పుడామె ఒంటిపై అంతకుముందున్న దుస్తులేవు. నీలిరంగు జీన్స్‌పాంటులో తెల్లని టీషర్టు టక్ చేసి, నోట్ బుక్, పెన్సిల్ పట్టుకుని, పదహారణాల పర్సనల్ సెక్రెటరీలా అవతారం మార్చింది.

"డిక్టేషన్ యేమీలేదు, కేవలం ఆదేశాలు విను" అన్నాడు టుంబా.

"ఎస్ సర్!"

"సరిగ్గా పదకొండు గంటలకు మేము బైలుదేరబో తున్నాం! పని పూర్తికావడాని కెంతసేపవుతుందో చెప్ప లేను.. అంతవరకూ నువ్వు ఓడను కంట్రోల్ చెయ్యాలి. కస్టమ్స్‌వారి ఫైనల్ చెకింగ్ అయిపోయింది. ఇక రారను కుంటాను. ఒకవేళ హఠాత్తుగా వచ్చి, నా గురించి అడిగితే, నగరం చూట్టానికిప్పుడే వెళ్ళానని చెప్పు! అర్థ మైందా?"

"అలాగే సర్!"

"వాళ్ళు ఫోంచేశారా?"

"కనుక్కోనా?"

"అవసరంలేదు. చేసే వుంటారు. నువ్వెళ్ళి. పడవల ఏర్పాటు చూడు. నేనే వెళ్ళి వాళ్ళను కలుసుకుంటాను."

"అలాగే సర్!" అంటూ బైటికి నడిచింది రోంజా.

కుర్చీలోంచి లేస్తున్న కెప్టెన్ దృష్టి అనుకోకుండా ఎదురుగా వేలాడుతున్న కేలండర్ మీద పడింది. తేదీ చూశాడు. 23 - 12 - 1961. సాలోచనగా తలూపుతూ కేబిన్‌లోంచి బైటికి నడిచి అనేక గదులూ, మలుపులూ తిరిగి ఓడ చిట్టచివరి కేబిన్‌లో అడుగుపెట్టాడు.

అందులో ఓడకు సంబంధించిన పాత సామానూ, చెడిపోయిన వస్తువులూ పేర్చి వున్నాయి. జాగ్రత్తగా లోపలినించి కేబిన్ తలుపు మూసేసి, స్విచ్ వత్తి లైటు వెలిగించాడు. ఓ గోడని సమీపించి, వేళ్ళతో చెక్క మీద టపటప చప్పుడు చేశాడు.

"నేను, లుంబాని!" అని చెప్పాడు.

చిన్న శబ్దంతో వెడల్పాటి చెక్క పక్కకి జరిగి, మనిషి వెళ్ళగలిగేంతటి ద్వారం యేర్పడింది గోడలో. నెమ్మదిగా లోన అడుగుపెట్టాడు లుంబా. చిన్నసైజు

కేబిన్ అది. లోపల గుడ్డిగా వెలుగుతోంది బల్బు. కేబిన్ మధ్య మంచం!

ఆ మంచంమీద నిశ్చలంగా కూర్చునున్నాడో నీగ్రో వృద్ధుడు. అతని కిరుపక్కలా భక్తిగా చేతులు కట్టుకొని నిల్చున్నారు నలుగురు నీగ్రో యువకులు.

వృద్ధుడి తలా, పిల్లిగడ్డం, అక్కడక్కడా మొలిచిన పొట్టి మీసాలూ, కనుబొమలతోసహా అన్నీ తెల్లగా పండివున్నాయి. అతన్ని చూడగానే భక్తి ప్రపత్తులతో మోకరిల్లి "గురుదేవులకు వందనాలు" అన్నాడు కెప్టెన్ తలవంచుతూ.

"వెయ్యేళ్ళు వర్ధిల్లు నాయనా! మన జాతికోసం నువ్వు చేసిన పని చిరస్మరణీయమవుగాక!" అన్నాడు వృద్ధుడు దీవిస్తూ.

"మీరంతా భోంచేశారా?" అడిగాడు లుంబా లేచి నిల్చుంటూ.

తలూపారు యువకులు.

"ఇక బైలుదేరదామా?"

"అందుకోసమే యెదురుచూస్తున్నాను నాయనా!" అన్నాడు వృద్ధుడు ఓపిక నశించినట్టు.

"పదండి" అన్నాడు కెప్టెన్ వెనుదిరుగుతూ.

## 3

యువకుల చొక్కాలు బాగా మాసివున్నాయి. పాంట్లు పిక్కలవరకూ పైకిమడిచి వున్నాయి. వృద్ధుడి ఒంటిమీద కేవలం ఓ అంగుళీయం మాత్రమే చుట్టివుంది. బౌద్ధ సన్యాసిలా, చేతిలో చిఱుత చర్మంతో చేసిన చిన్న సంచి.

ఒకరి వెనక ఒకరు ముందు గదిలో అడుగు పెట్టారు.

కెప్టెన్ గోడలోని తలుపును యథాప్రకారం చెక్కతో మూసేసి, లైటార్పి, నెమ్మదిగా కేబిన్ తలుపు తెరిచి, అవతలకి తొంగిచూశాడు. నడవాలో యెవ్వరూ లేరు.

రమ్మన్నట్టు వాళ్ళకు సైగ జేసి, బైట అడుగు పెట్టాడు. అందరూ ఇవతలికి రాగానే తిరిగి ఆ కేబిన్ తలుపుమూసి ఓడ సిబ్బంది కంటబడకుండా కాపాడుతూ వాళ్ళని డెక్ మీదికి తీసికెళ్లాడు.

సముద్రంలో అక్కడక్కడా ఆగివున్నాయి ఇతర ఓడలు. వాటిలో వెలిగే కాంతి వారిపై పడకుండా జాగ్రత్తపడుతూ డెక్ చివర చిరుచీకటి వున్నచోటికి చేరుకున్నాడు లుంబా. అక్కడ వారికోసమే ఎదురు చూస్తూ నిల్చునుంది జోంజా!

"ఏర్పాట్లు పూర్తయ్యాయా?" అడిగాడు కెప్టెన్.

"ఎస్ సర్!"

"పడవల్ని సముద్రంలోకి దించండి" ఆజ్ఞాపించాడు యువకుల్ని.

అక్కడే హేంగర్లకు వేలాడుతున్న మూడు పడవల్ని తాళ్ళ సాయంతో నీటిలోకి జారవిడిచారు వాళ్ళు. తరువాత తాళ్ళ నిచ్చెన వదలబడింది. కెప్టెన్ వృద్ధుడి వైపు తిరిగి, "ఓడలో మోటర్ బోట్లుకూడా వున్నాయి. అందులో వెళితే మోటర్ల శబ్దం వినిపిస్తుంది. అందుకే ఈ తెడ్ల పడవల్ని యేర్పాటు చేశాను" అన్నాడు సంజాయిషీ చెప్పుకుంటూ.

"చాలా మంచి పని చేశావు నాయనా! యెంత త్వరగా మన పని ముగించుకు వస్తే అంత మంచిది" అన్నాడు వృద్ధుడు.

యువకుల వైపు చూశాడు లుంబా. "ముందు మీలో

ఇద్దరు దిగి, పడవ యెక్కండి. ఒక్కో పడవలో ఇద్దరు చొప్పున ప్రయాణించాలి. నేను గురుదేవులతో ఓ పడవ యెక్కుతాను. మీ రెండు పడవల మధ్య మా పడవ ప్రయాణిస్తుంది. ఓ.కే?"

తలలూపారు యువకులు గంగిరెద్దుల్లా.

వారు నిచ్చెన దిగి పడవలెక్కాక, జోంజావైపు తిరిగాడు కెప్టెన్, "మేము తిరిగి వచ్చేవరకూ నా ఆదేశాలను జాగ్రత్తగా అమలు చెయ్యాలి సుమా!"

"ఆల్ రైట్ సర్!"

తెడ్ల సాయంతో కదిలాయి పడవలు. అరగంట తరవాత రేవుకు యెడంగా చాలాదూరం వచ్చేశాయి.

"కాసేపు ఆపండి ఇక్కడ!" అంటూ బైనాక్యులర్స్ బైటికితీశాడు కెప్టెన్.

పడవలు ఆగాక, బైనాక్యులర్స్‌తో మసకచీకట్లో చుట్టూ కలయచూశాడు పరీక్షగా. దూరాన యూకలిప్టస్ చెట్లతో నిండిన ఒడ్డు కనిపిస్తోంది.

చేత్తో అటు సైగ చేస్తూ, "పదండి అక్కడికి" అన్నాడు.

తిరిగి ప్రారంభమైంది పడవల ప్రయాణం! ఒడ్డు చేరగానే మరోసారి బైనాక్యులర్స్‌తో చుట్టూ కలయజూసి యెవ్వరూ లేరని నిర్ధారించుకొని, అందర్నీ దిగమన్నట్టు సైగ చేశాడు కెప్టెన్. యువకులు బిలబిల దిగి, పడవల్ని ఒడ్డుమీదికి లాగి చెట్లమాటున దాచేశారు.

"ఇంతవరకూ మనకే అడ్డంకులూ యెదురుకాలేదు. క్షేమంగా ఒడ్డుచేరాం! ఇక ఇప్పుడు ప్రారంభం కాబోతోంది మన ప్రమాదకర ప్రయాణం! దట్టమైన కీకారణ్యాల్లో పుట్టి పెరిగిన జాతి మనది.

అదృష్టవశాత్తూ నేను నగరాల్లో పెద్ద చదువులు చదివి ఈనాడు ఈ స్థితికి చేరినవాణ్ని కనక, ఈ నగర వాసుల గురించీ, నగర జీవనం గురించీ మీకన్నా నాకే ఎక్కువ తెలుసు.

వీసా, పాస్‌పోర్ట్‌లాంటి అధికార పత్రాలు లేనిదే ఒక దేశవాసులు మరో దేశంలో అడుగుపెట్టడం నేరం! అందుకే మిమ్మల్ని ఓడలో రహస్యంగా ఇక్కడికి తీసుకు రావలసి వచ్చింది. అది తొలి ప్రయత్నం!

అందులో మనం సఫలీకృతులమయ్యాం! ఇప్పుడు మిగిలింది రెండో ప్రయత్నం! నగరం నడిబొడ్డున వున్న మనకావలసిన వ్యక్తి భవనాన్ని చేరడం అంత సులభ తరమైన పనికాదు.

రాత్రిపూట గస్తీ పోలీసులు తిరుగుతుంటారు. అదు గడుగునా ఇతర అధికార్లు తారసపడవచ్చు. వారికంట బడకుండా యెంతో మెలకువగా ఆ భవనాన్ని చేర వలసి వుంటుంది.

ఏ అవరోధం లేకుండా ఆ భవనంలో అడుగుపెట్ట గలిగినప్పుడే మన మూడో కార్యక్రమం అసలు జరుగు తుంది. అదృష్టం మన పక్షాన లేకుంటే మనలో ఒక రిద్దరి ప్రాణాలు పోయినా పోవచ్చు" అన్నాడు లంబా రుద్రకంఠంతో.

"ప్రాణాలుమీద మాకు తీపిలేదు. అన్నిటికీ మేము సిద్ధపడే వచ్చాం!" అన్నారు యువకులు ఆవేశంగా.

"జాతి క్షేమంకోసం గడిపోచకు సరితూగని ఈ ప్రాణాలు పోయినా, ఉన్నా ఒక్కటే కదా నాయనా! వాటిని పణంగా పెట్టడానికి ఎట్టి పరిస్థితుల్లోనూ మేము వెనక్కి తగ్గం! పద. ఇప్పటికే బాగా పొద్దుగూకింది"

అన్నాడు వృద్ధుడు ఆరాటాన్ని అపుకోలేక.

రిస్టువాచీ చూసుకున్నాడు కెప్టెన్. పన్నెండున్నర!

"ఔను. ఈపాటికి సెకండ్ షో సినిమాలు వది లుంటారు. రోడ్లు నిర్మానుష్యమై వుంటాయి, పదండి" అన్నాడు ముందుకు సాగుతూ.

మిగతా సహచరులు అతన్ని అనుసరించారు. ఇసక తిన్నెలు దాటి కొద్ది సేపట్లో రోడ్డుమీదికి వచ్చారంతా. ట్యూబ్ లైట్స్ కాంతిలో రోడ్లు దేదీప్యమానంగా వెలిగిపోతున్నాయి.

## 4

మసక చీకట్లో నిల్చుని చుట్టూ జాగ్రత్తగా కలయ చూశాడు కెప్టెన్. అప్పుడప్పుడూ అక్కడక్కడా స్పీడుగా సాగిపోతున్న కార్లు తప్ప, కాలినడకనగానీ, సైకిళ్ళమీదగానీ యెవ్వరూ కనిపించడంలేదు.

"పదండి. నడిరోడ్డుమీద నడవొద్దు. లైట్ల కాంతి మీద పడకుండా రోడ్డు చివర, మసక చీకట్లో నడ వాలి" అన్నాడు కెప్టెన్ అడుగు ముందుకు వేస్తూ.

యువకులు రోడ్డుమీద అటూ ఇటూ తిరుగుతున్న కుక్కల్ని చూస్తున్నారు కన్నార్పకుండా.

"ఇక్కడి కుక్కలు ఎంత రుచిగా వుంటాయో!" అన్నాడొకడు పెదాలు చప్పరిస్తూ.

"ష్! మాట్లాడకండి. అదుగో, ఫుట్ పాత్ మీద బికార్లు కూర్చున్నారు" అన్నాడు లంబా.

భుజాల చుట్టూ చింకిగుప్పట్లు కప్పుకొని, బీడీలు కాలుస్తూ మాట్లాడుకుంటున్న ఇద్దరు బికారీలు అదివరకు చూడని వారి విచిత్రాకృతుల్ని, రూపురేఖల్నీ నోళ్ళు వెళ్ళబెట్టి చూడసాగారు.

మౌనంగా వార్ని దాటి, రోడ్డు కుడివైపు తిరిగారంతా. అలా కొద్ది దూరం నడిచారో లేదో, దూరాన యేదో వాహనం వస్తున్నట్టు హెడ్ లైట్స్ కాంతి కనిపించి, అందర్నీ ఆగమన్నట్టు చెయ్యెత్తాడు లుంబా. ఊపిరి బిగబట్టి ఆగిపోయారంతా.

వాహనం దగ్గరవుతున్న కొద్దీ దానిముదురు నీలిరంగునూ ముందు భాగంలో కొట్టవచ్చినట్టు కనిపిస్తున్న తాటికాయంత తెల్లని అక్షరాలనూ, ఊగుతున్న వైర్లెస్ ఏరియల్ని చూడగానే, "పోలీస్!" అన్నాడు లుంబా.

గతుక్కుమన్నాయి అందరి గుండెలూ.

"ఆ సందులోకి తప్పుకోండి, అది పోలీస్ పెట్రోలింగ్ వాన్!" అన్నాడు లుంబా రోడ్డుపక్కనున్న ఓ సందు చూపుతూ.

అందరూ సందులో దూరి, గోడకు బల్లుల్లా అతుక్కు-పోయారు.

మరో క్షణంలో పోలీస్ పెట్రోలింగ్ వాన్ దూసుకుపోయింది రోడ్డుమీద.

తర్వాత కెప్టెన్ సందుచివరికెళ్ళి అటూ ఇటూ తొంగి చూసి, రోడ్డుమీద యెవ్వరూ లేరని నిర్ధారించుకొని, పదమన్నట్లు సైగ చేశాడు. చిరు చీకట్లో నడుస్తూ అనేక సందులూ గొందులూ తిరిగి, చివరికో వీధిలోకి ప్రవేశించారు.

సాధారణంగా ఆ వీధిలో నివసించేది ధనవంతులే. అధునాతన రీతిలో విశాలంగా, విడివిడిగా, వరుసక్రమంగా కట్టి వున్నాయి అనేక భవనాలు. కెప్టెన్ని అనుసరిస్తున్న వృద్ధుడు హఠాత్తుగా ఆగి, మిగతావారిని కూడా ఆగమన్నట్టు సైగ చేశాడు. కెప్టెన్ ప్రశ్నార్థ

కంగా చూశాడతన్ని.

వృద్ధుడు పలకలేదు. తలెత్తి, గాలిలో ఏదో వాసన చూడసాగాడు. మరుక్షణం మడతలుపడ్డ అతని మొహం తామరపుష్పంలా వికసించింది. "లుంబా! మన గమ్యం వచ్చేసింది. ఆ పవిత్ర సుగంధ పరిమళం ఇదుగో నా ముక్కుపుటలకు స్పష్టంగా తాకుతోంది. మాకు సరైన దారిచూపి, మనజాతి యావత్తుకూ నువ్వు చేసిన మేలు మరవరానిది."

నవ్వాడు కెప్టెన్. "మన జాతికోసం ఇప్పటికీ నేను చెప్పుకోతగ్గ సేవ చెయ్యలేదు గురుదేవా! పోతే, మన గమ్యాన్ని చేరుకున్నామన్న మీమాట అక్షరాల నిజం! అదుగో, అదే మన గమ్యం!" అన్నాడు అమడదూరంలో వున్న ఓ భవనంవైపు చూపుతూ.

అందరి కళ్ళూ జిగేల్మన్నాయి.

వృద్ధుడు సాలోచనగా తలూపుతూ, "మేము అంధకారపు అడవుల్లో పుట్టి పెరిగినవాళ్ళం! ఈ ఆధునిక వెలుగు లోకపు మాయలు మాకు తెలీవు. తెగించి గమ్యాన్నైతే చేరుకున్నాంగానీ, ఆ భవనంలో ప్రవేశించడానికెన్ని ఆడ్డంకులు అధిరోహించాలో మాకన్నా నీకే బాగా తెలుసు. ఎన్నో ఏళ్ళనించీ నువ్వీలోకంలో ఊపిరి తీసుకుంటున్నావుకదా, మా మార్గం సుగమం చెయ్యి లుంబా!" అన్నాడు.

"అలాగే గురుదేవా! రండి" అంటూ అడుగు ముందుకు వేశాడు కెప్టెన్.

## 5

రాత్రి రెండవుతోంది. ముందే చలికాలం! మనిషి మాత్రుడు లేడు వీధిలో. స్ట్రీట్ లైట్స్ గుడ్డిగా వెలుగు

తున్నాయి. ఆ నిశీధిలో చలికి తాళలేక యెక్కడో ముడుచుకొని ఆగి ఆగి రోదిస్తోంది ఓ ఊరకుక్క.

ఆ భవనాన్ని చేరగానే ఆగమన్నట్లు సైగ చేశాడు కెప్టెన్. అందరూ మర బొమ్మల్లా నిల్చుండిపోయారు. కాంపౌండ్ గోడకు నక్కి నిల్చోమన్నట్టు సైగ చేశాడు కెప్టెన్. అందరూ గోడకు అతుక్కుపోయారు బల్లుల్లా!

అడుగులో అడుగు వేసుకుంటూ కాంపౌండ్ గేటు వైపు నడిచాడు కెప్టెన్. మూసివుంది. దానికిరుపక్కలా లైట్లు. వాటి కాంతిలో గేటుపక్కన వేళ్ళాడుతున్న నేమ్ ప్లేట్ మీద నిలిచాయి కెప్టెన్ చూపులు.

మేజర్ విక్రమనాయుడు (రిటైర్డు) అని చెక్కివుంది దానిమీద.

సాలోచనగా తలూపుతూ పిల్లిలా గేటుని సమీపించాడు కెప్టెన్. కాంపౌండ్ లోపల గేటునానుకొని వుంది, గూర్ఖా కూర్చునే చెక్క కేబిన్.

"వాచ్ మెన్!" పిల్చాడు తగ్గు స్వరంతో.

మరుక్షణం దిగ్గున లేచి ఇవతలికి వచ్చాడు గూర్ఖా.

"కౌన్ హై?" అడిగాడు కెప్టెన్ని ఎగాదిగా చూస్తూ.

అప్పుడు పడింది లుంబా దృష్టి గూర్ఖా నడుంకి వేళ్ళాడుతున్న ఖుక్రీ (కత్తి)మీద. బదులివ్వకుండా గోడకు నక్కి నిల్చున్న తన సహచరులవైపు చూశాడు. నిదరమబ్బులో వున్న గూర్ఖాకు అర్థంకాక, గేటు చువ్వలగుండా తల ఇవతల పెట్టి అటు చూశాడు. అంతే!

ఉక్కు పంజాలతో మెరుపులా వాడి మెడ పుచ్చుకున్నాడు కెప్టెన్. ఐనా, బెల్టుకి వేళ్ళాడుతున్న ఒరలోంచి కత్తి లాగనే లాగాడు గూర్ఖా! అప్పటికే లుంబా

ఒంట్లోని అపారశక్తి తన పని పూర్తిచేసింది.

కోడి మెడ విరిచినట్టు విరిచి, ఒళ్ళు చల్లబడేవరకూ అలాగే పట్టుకొని, పక్కకు తోశాడు వాణ్ని. చిన్న శబ్దంతో నేలకూలింది గూర్ఖా శవం! గేటు కొక్కెంతీసి, రమ్మన్నట్టు సైగచేశాడు తనవాళ్ళని.

అందరూ బిలబిల కాంపౌండ్లోకి దూరారు. "ఇదేమిటి?" అడిగాడొకడు కిందపడ్డ గూర్ఖా శవం చేతిలోని కత్తి అందుకుంటూ.

"దాన్ని ఖుక్రీ అంటారు. నేపాలీ దేశస్థులు వాడే ఆయుధం! పనికిరావచ్చు. వుంచు" అంటూ చుట్టూ కలయచూశాడు కెప్టెన్. ఏ అలికిడీ లేదు. పైన మేడ మీద మూసి వున్న కిటికీల్లోంచి జీరోవాట్లు మసక వెలుగు కనిపిస్తోంది. ఇంట్లోకి ప్రవేశించే సింహద్వారం మూసివుంది.

"రండి" అంటూ అటు నడిచాడు కెప్టెన్.

తలుపుని సమీపించారందరూ.

"నకోనా!" పిల్చాడు వృద్ధుడు నెమ్మదిగా.

"గురుదేవా?" అన్నాడు నలుగురిలో ఒకడు.

వృద్ధుడి చూపులు మూసివున్న తలుపుమీదే వున్నాయి. "చింతపులి తింటూ పెంచుకున్న నీ కండబలాన్ని ప్రయోగించే సమయం ఆసన్నమైంది. ఊఁ ఆ తలుపుల్ని పెకలించి పక్కన పెట్టు!"

"ఆజ్ఞ గురుదేవా!" అంటూ తలుపువైపు కదిలాడు నకోనా.

గోడకున్న బటన్ వత్తి పోర్టికో లైటార్పేశాడు కెప్టెన్. మూసి వున్న తలుపుముందు నిల్చుని, కాసేపు

దాన్ని పరీక్షించి, రెండు చేతులతో బిగబట్టి, సవ్వడి కానివ్వకుండా కదపసాగాడు నకోనా!

పదినిమిషాల తరవాత కీలు కొక్కాలతోసహా ఊడి, గడపనించి వేరైంది ఓ రెక్క. "చాలు. రెండోది వుండనివ్వు" అన్నాడు కెప్టెన్.

ఊడ బెరికిన రెక్కను పక్కన పెట్టి, నెమ్మదిగా లోనికి ప్రవేశించాడు నకోనా. అతని వెనకే అందరూ అడుగు పెట్టారు. అది హాలు. హాలుమధ్య సోఫా సెట్టు. జీరో వాల్టు మసగ్గా వెలుగుతోంది.

హాలు కుడిపక్క గోడవారగా మెట్లున్నాయి పై కెళ్ళ డానికి. ఇంట్లో సూది పడితే వినిపించే నిశ్శబ్దం! కెప్టెన్ని అనుసరిస్తూ ఒకరి వెనక ఒకరు మెట్లెక్కి చేరుకున్నారు. వరసగా నాలుగ్గదులున్నాయి పైన. తలుపులు మూసు న్నాయి.

ఒక్కో గది ముందాగి, వాసన చూడసాగాడు వృద్ధుడు. మూడో గది ముందాగగానే అతని ముఖం వికసించింది. పట్టరాని ఆనందంతో నెమ్మదిగా తోశాడు తలుపుని. కిర్రుమంటూ తెరుచుకుంది. దడదడలాడే గుండెలతో అందరూ అడుగు పెట్టారు లోన.

అది బెడ్ రూం! నీలిరంగు జీరో వాల్టు మసగ్గా వెలుగు తోంది. ఆ కాంతిలో యెదురుగా కనిపించిన దృశ్యం వాళ్ళని దాదాపు శిలాప్రతిమల్ని చేసివేసింది. గోడ వారగా మంచం! పరుపుచుట్టూ సన్నని ఉల్లిపొరలాంటి దోమ తెర.

ఆ దోమ తెర లోపల ఆదమరచి హాయిగా నిద్రి స్తోంది ఓ యువతి! పుత్తడి బొమ్మలాంటి అందమైన యువతి! భక్తి ప్రపత్తులతో చేతులు జోడించి ఆ యువతి

వైపు చూస్తూ అన్నాడు వృద్ధుడు, "మువాంగా!"

మరుక్షణం అందరూ చేతులు జోడించి తలలు వంచుకున్నారు.

"ఇంతకాలం మనం వెతుకుతున్న మన ఆరాధ్య దైవం ఈమే! ఇక మన జాతికి యే అనర్థమూ వాటిల్లదు. ఏ రోగమూ దరిచేరదు. ఎవ్వరూ ఆకలిదప్పులతో అలమటించరు. మన పొలాలూ, చెట్టుచేమలూ మళ్ళీ పచ్చగా సస్యశ్యామలమౌతాయి. శత్రు తెగలతో జరిగే పోరాటాల్లో ఇక అంతిమ విజయం మనదే!" అంటున్నాడు వృద్ధుడు పారవశ్యంతో.

మిగతావారిలో నూతనోత్తేజం వెల్లివిరుస్తోంది. నిశ్శబ్దంగా వింటూ నిల్చున్నారు.

"మువాంగా తల్లి బాల్యంనించీ ఈ వెలుగు ప్రపంచంలో పెరిగింది. ఇప్పుడు మనల్ని గుర్తుపట్టక, పైగా, భయపడవచ్చు. అందుకే, ఆమె లేవకముందే వనమూలికల చూర్ణాన్ని వాసన చూపి మూర్ఛపోగొట్టి మోసుకెళ్లాలి. ఎప్పుడైతే ఆమె తిరిగి తన రాజ్యాన్ని చేరుకుంటుందో, అన్నీ ఆమెకు జ్ఞప్తికొస్తాయి. ఇన్నాళ్ళూ తనకోసం కళ్ళు కాయలు కాచేలా యెదురుచూస్తున్న తన భక్తుల్ని అప్పుడు తప్పక గుర్తుపడుతుంది., మన పూజలందుకొని, తన ఆశీర్వాదాలతో మన బ్రతుకులు పావనం చేస్తుంది" అంటూ మోకాళ్ళమీద కూర్చుని, చేతులు జోడించాడు వృద్ధుడు.

"తల్లీ! మువాంగా! వనమూలికలతో నిన్ను మూర్ఛపోగొట్టి, బలవంతంగా ఎత్తుకెళ్ళడం మహాపచారమే! కానీ, అంతకుమించి మరో మార్గం కనిపించడంలేదు తల్లీ! మమ్మల్ని క్షమించు" అంటూ శిరస్సు వంచి లేచి

నిల్చున్నాడు. సంచీలోంచి కొన్ని వనమూలికలూ, ఆకులూ తీసి, బొటనవేలితో వాటిని చూర్ణం చెయ్య సాగాడు.

అప్పుడు కదిలింది యువతి మంచంమీద!

అందరూ ఊపిరి బిగబట్టి చూడసాగారు.

కళ్ళు తెరిచింది యువతి. నెమ్మదిగా తలతిప్పి చూసింది వాళ్ళవైపు.

అంతే!

## 6

కెవ్వున కేక!

భయంతో ఒళ్ళు జలదరించేలా పెట్టిన గావుకేక!!

భవనం యావత్తూ దద్దరిల్లింది ఆ కేకతో.

ఆ హఠాత్పరిణామానికి చేష్టలుడిగి రాతిబొమ్మలై పోయారందరూ. ఒక్క ఉదుటున మంచంమీంచి లేచింది యువతి. ఎండుటాకులా వణుకుతోంది గజగజ.

“తల్లీ మువాంగా! మమ్మల్ని చూసి భయపడకమ్మా! మేము మీ శత్రువులం కాము. భక్తులం! నీ సేవకులం! నీకపకారం చెయ్యడానికి రాలేదు. నిన్ను మళ్ళీ మన జన్మభూమికి తీసికెళ్ళి ప్రతిష్ఠించుకోడానికి వచ్చాం. మా కొలువులు సేవించి, మమ్మల్ని ఆశీర్వదించి, మా బ్రతుకుల్లో పేరుకున్న చీకట్లను పారద్రోలి, మళ్ళీ నూతన వెలుగులు ప్రకాశింపజేయి తల్లీ!” అన్నాడు వృద్ధుడు చేతులు జోడిస్తూ.

వాళ్ళ విచిత్ర రూపురేఖలనూ, అర్థంకాని భాషనూ ఖంగుతిన్న ఆ యువతి మళ్ళీ గావుకేక పెట్టబోయింది. వృద్ధుడు మెరుపులా ఆమెను సమీపించి, పొదివిపట్టుకుని, చేతిలోని చూర్ణాన్ని ఆమె ముక్కు దగ్గరుంచాడు. అంతే!

మరుక్షణం యువతి సొమ్మసిల్లి, అతని బాహువుల్లో సోలిపోయింది. వృద్ధుడు జాగ్రత్తగా ఆమెను భుజాన వేసుకుని, "పదండి" అంటూ వెనుదిరిగాడు.

అందరూ అతనితో బాటు వెనుదిరిగి, తలుపువైపు అడుగు వేశారు. అంతే! వారి అడుగులు స్తంభించి పోయాయి. గుండెలు గుభిల్లుమన్నాయి. తలుపుమధ్య రెండు చేతుల్లో పిస్తోళ్ళు పట్టుకొని నిల్చున్నాడో వ్యక్తి.

సుమారు యాభై ఏళ్ళుంటాయతనికి. నెరసిన తల, కోరమీసాలు. ఆజానుబాహుడు. అంత వయసులోనూ దృఢంగా, పుష్టిగా వున్నాడు.

అతన్ని పరీక్షగా చూసి, గుర్తుపట్టి, చిన్నగా నవ్వాడు వృద్ధుడు. "మేజర్ నాయుడూ! ఇంకా గుర్తుపట్టలేదా నన్ను? ఔన్లే! అమాయకులమూ, నిరక్షరాస్యులమూ అయిన మా నమ్మకాలనీ, ప్రేమాభిమానాలనీ, వరతులనీ, తృణప్రాయంగా ఎంచి, తృణీకరించి, మమ్మల్ని నట్టేట్లో ముంచి పారిపోయి వచ్చినవాడివి. ఇన్నాళ్ళ తరవాత ఇంకెక్కడ గుర్తుంటాం నీకు?"

అప్పుడు విప్పారాయి మేజర్ నాయుడు కళ్ళు. "ఆగోసా! నువ్వా!! ఇంకా బ్రతికే వున్నావా? ఇన్నేళ్ల తరవాత ..." అన్నాడు దిగ్భ్రాంతితో.

"ఔను మేజర్! ఇంకా బ్రతికే వున్నాను. మువాంగా తల్లిని తిరిగి నా జాతి కప్పగించేవరకూ మరణించనని శపథం పూని మృత్యువును దరిజేరనివ్వకుండా యింకా బ్రతికేవున్నాను" అన్నాడు వృద్ధుడు.

"నేనిక్కడున్నానని ఎలా కనుక్కున్నారు? ఎలా రాగలిగారిక్కడికి?" అడిగాడు మేజర్ నిగ్గాంతపోతూ.

కెప్టెన్ లుంబావైపు సైగజేశాడు వృద్ధుడు. "ఇతన్ని

గుర్తుపట్టావా? లేదనుకుంటాను. ఎలా గుర్తుపడతావు? నువ్వు మమ్మల్ని విడిచి వచ్చినప్పుడు పిదు ఆరేళ్ళ పసివాడు. తరవాత వెలుగు ప్రపంచంలో పెరిగి పెద్దవాడై, బాగా చదువుకుని, సముద్ర ఓడమీద ఉద్యోగం సంపాదించాడు.

నా ఆదేశానుసారం దేశదేశాలు తిరుగుతూ నీ ఆచూకీ తియ్యసాగాడు. చివరికి ఇప్పుడు దేశంలో వున్నావని పసిగట్టి నన్నూ, నా శిష్యుల్ని రహస్యంగా ఓడలో దాచి, ఇక్కడికి చేర్చాడు.

"సంతోషం! చాలా సంతోషం! పదహారేళ్ళ తరవాత మళ్ళీ మిమ్మల్ని చూడగలిగినందుకు నాకెంతో ఆనందంగా వుంది ఆగోసా! ఐతే, మీరిలా అర్థరాత్రి దొంగచాటుగా కాక, పగలు నేరుగా వచ్చివుంటే, ఇంకా బావుండేది.

ఐనా, మీరిలా వచ్చినందుకు నాకేం కోపం లేదు. అమ్మాయిని తిరిగి మంచంమీద పడుకోబెట్టి అలా కూర్చోండి. తీరిగ్గా మాట్లాడుకుందాం!" అన్నాడు మేజర్ వచ్చీరాని ఆఫ్రికన్ భాషలో.

"మేము తీరిగ్గా కూర్చుని కబుర్లు చెప్పడానికి రాలేదు మేజర్! మా ఆరాధ్య దేవత మువాంగా తల్లిని తిరిగి మా దేశానికి తీసికెళ్ళడానికి వచ్చాం!" అన్నాడు వృద్ధుడు కటువుగా.

మేజర్ మొహం మారిపోయింది. "ఆమె మువాంగా కాదు. నా కన్న కూతురు శ్రీవిద్య! ఈ బొందిలో ప్రాణం వుండగా నా కూతుర్ని మీ పరం చేస్తాననుకున్నారా? మర్యాదగా ఆమెను మంచంమీద పడుకోబెట్టు."

నవ్వాడు వృద్ధుడు. "నీకామె శ్రీవిద్య కావచ్చు. నీ రక్తం పంచుకు పుట్టిన కూతురే కావచ్చు. కానీ ఆమె పుట్టగానే మేమామెకు పెట్టిన పేరు మువాంగా! చూడు పుట్టగానే గుర్తింపుకోసం మేమామె చేతిమీద పొడిచిన పచ్చబొట్టు గుర్తులు.

"మేజర్! నువ్వు విశ్వాసఘాతకుడివి. ద్రోహివి నీమీద మేము అల్లుకున్న అపార నమ్మకాన్ని వమ్ముచేసి, మా కళ్ళలో కారం చల్లి మమ్మల్ని మువాంగా తల్లికి దూరం చేశావు. మా జాతిని అనేక ఇక్కట్లపాలు చేశావు.

"సరే! జరిగిందేదో జరిగిపోయింది. మువాంగా తల్లి మళ్ళీ మాకు దొరికింది. ఇప్పుడు నీమీద మాకేం కోపం లేదు. మమ్మల్ని వెళ్ళనివ్వు. మా దారి కడ్డంరాకు. ఊఁ!" అంటూ అడుగు ముందుకు వేశాడు వృద్ధుడు.

"ఆగు! కాలు కదపక! నా చేతుల్లో యేమున్నాయో చూడు. నన్ను ఉద్రేకపర్చకండి. నా బిడ్డను నాకప్పగించి, మర్యాదగా వెళ్ళిపొండి. మిమ్మల్నేమీ చెయ్యను" అన్నాడు మేజర్ నాయుడు హెచ్చరిస్తూ.

పకపక నవ్వాడు వృద్ధుడు. "నీలా మమ్మల్ని పిరికి పందలకింద జమకట్టక మేజర్! ఆచారాలకూ, నమ్మకాలకూ కట్టుబడి బ్రతికే జాతి మాది. మర్యాదగా మా దారి కడ్డుతొలుగు."

"లేకుంటే ఏం చేస్తారు?"

వృద్ధుడు పలకలేదు. తన ఇద్దరు శిష్యులవైపు చూసి సైగచేశాడు. అంతే! ఆ సజ్ఞకోసమే ఎదురుచూస్తున్న వాళ్ళు అమాంతం లంఘించారు మేజర్ మీదికి.

మరుక్షణం నాయుడు చేతుల్లోని రెండు పిస్తోళ్ళూ రెండు గుళ్ళు వెళ్ళగక్కుతూ మ్రోగాయి. అంతే

ఎగిరినవాళ్ళు ఎగిరినట్టే అమాంతం నేలకూలారు. గిలగిల తన్నుకొంసా గారు.

ఆ దృశ్యం చూడగానే కెప్టెన్ కళ్ళు విప్పారాయి గానీ, వృద్ధుడు మాత్రం నిశ్చలంగా నేలమీద తన్నుకుంటూ ప్రాణాలు విడిచిన వాళ్ళను చూస్తూ, తరవాత మేజర్ వైపు తిరిగాడు.

"వాళ్ళు చనిపోయినందుకు నేను చింతించడంలేదు మేజర్! చాలా సంతోషిస్తున్నాను. వాళ్ళు చనిపోలేదు. అమరులయ్యారు. జాతి హృదయాల్లో చిరంజీవులయ్యారు. ఇలాంటి మరణం యెందరికి లభిస్తుంది? వాళ్ళను చంపినంతమాత్రాన మేము భయపడి నీకు లొంగిపోతామనుకున్నావా? లేదు. మమ్మల్ని నువ్వు ఆపలేవు మేజర్!" అంటూ అడుగు ముందుకేశాడు.

"చివరిసారి చెబుతున్నాను అగోసా! ఆగిపో" మేజర్ మాట పూర్తికాకముందే మరో ఇద్దరు యువకులు ఆయన మీదికి లంఘించారు.

మేజర్ చేతుల్లోని రివాల్వర్లు గర్జించాయి మళ్ళీ. త్రుటిలో వారి శరీరాలు నేల కరిచాయి. "అగోసా! ఇది ఆఖరి హెచ్చరిక, నీ మూర్ఖత్వంవల్ల నలుగురు నేలకొరిగారు. ఇప్పటికీ మించిపోయింది లేదు.

వ్యక్తిగతంగా మీమీద నాకెలాంటి ద్వేషంలేదు. నన్నరంచేసుకోండి. కన్నకూతుర్ని ఒక్కగానొక్క కూతుర్ని మీకెలా అప్పగించమంటారు? ఆమె లేనిదే నా జీవితం శూన్యంకాదా? శాంతంగా ఆలోచించండి. నా బిడ్డను నా కప్పగించండి" అన్నాడు నాయుడు ప్రాధేయపూర్వకంగా.

"అసంభవం! పుట్టకముందే నువ్వామెను మాకప్ప

గించావు. మా షరతుల కంగీకరించావు మేము చేస్తున్నది నీతిబాహ్యమైన పనేం కాదు. ఇక అడ్డుతొలుగు" అంటూ మరో అడుగు ముందుకేశాడు వృద్ధుడు.

"నా సహనాన్ని పరీక్షించకండి. చెప్పిన మాట వినండి."

"ఇప్పటికే చాలా ఓర్మి వహించాను మేజర్! ఇక సహించేదిలేదు. కాచుకో!" అంటూ చిఱుతలా నాయుడు మీదికి లంఘించాడు కెప్టెన్ లుంబా.

"ఢాం!" మంది రివాల్వర్.

కడుపు పట్టుకున్నాడు కెప్టెన్. తెల్లచొక్కా రక్తంతో తడవసాగింది ఎర్రగా!

మరోసారి మారుమోగింది రివాల్వర్.

మొదలు నరికిన చెట్టులా నేలకూలాడు కెప్టెన్ లుంబా!

నాయుడి కంఠం ఖంగుమంది. "ఆగోసా! ఇక మిగిలింది నువ్వే! నీ మూర్ఖత్వంవల్ల ఇందరి ప్రాణాలు బలయ్యాయి. ఇప్పటికీ మించిపోలేదు. నా బిడ్డను వాకప్పగించి నీ దారిన వెళ్ళు."

పకపక నవ్వాడు వృద్ధుడు. "పిచ్చి మేజర్! ప్రాణభీతి గలవారిమైతే తెగించి ఇంతదూరం వచ్చేవారమా? నన్ను చంపాలనుకుంటే నిస్సంకోచంగా చంపెయ్! కాదనను. కానీ, చంపేముందు ఒక విషయం మాత్రం గమనించు. మువాంగా తల్లి నా భుజంమీదుంది.

ఆమెకే అపాయం కలక్కుండా నీ ఆయుధాన్ని సరిగా నా నుదుటికి గురిపెట్టు. నాతోబాటు మువాంగా తల్లి కిందపడకముందే ఆమెను పాడవిపట్టుకో. ఇదే నా చివరి కోరిక!"

ఆ మాటలకు చలించిపోయాడు మేజర్. "నిన్ను చంపడంవల్ల నాకొరిగేదేమీ లేదు అగోసా! దయచేసి నా మాట విను. మంచిపట్టు వదులు" అన్నాడు ప్రాధేయ పడుతూ.

"ఐతే, నన్నే ఆ మృత్యుదేవతను కౌగలించుకోనివ్వు" అంటూ వెనుదిరిగాడు వృద్ధుడు.

భుజంమీద పడున్న శ్రీవిద్యను నెమ్మదిగా మంచం మీద పడుకో బెట్టి మెరుపులా వెనుదిరిగి మేజర్ మీదికి లంఘించాడు. అంతే!

"ఢాం!" మంది రివాల్వర్.

గుండు మెడలో దిగబడింది. చేత్తో గాయాన్ని అదిమి పట్టుకున్నాడు అగోసా! అతని బాధ చూడలేక రెండో వాల్వర్ని అతని గుండెకి గురిపెట్టాడు మేజర్. ట్రిగ్గర్ నొక్కాడు నెమ్మదిగా. రివ్వున దూసుకెళ్ళి అగోసా గుండెలో దిగింది గుండు.

"తల్లీ....మ్....ము....వాం....గా!" అంటూ గుండె పట్టుకొని నేలకూలాడు.

శిలాప్రతిమలా నిల్చుని, నేలపైపడున్న ఆరు శవాలని చూస్తుండిపోయాడు మేజర్ నాయుడు, ఆయన హృదయ కుహరంలో నీరు ఊరి, కళ్ళను తడిపివేస్తోంది నెమ్మదిగా.

రివాల్వర్లను జారవిడిచి, మోకాళ్ళమీద కూలబడి, చేతులు జోడించాడు. "మీ పవిత్ర హృదయాలకు ఇవే నా జోహార్లు. నమ్మినదానికోసం ప్రాణాలను కూడా పూజ్యంగా భావించిన మీరు మహనీయులు, మహో న్నతులు.

నేను పాపిని. అల్పుణ్ని. ఇచ్చిన మాటను నిలబెట్టుకో లేని, భవబంధాలను త్రెంచుకోలేని అధముణ్ని. నన్ను

క్షమించండి. కరుణించండి" అంటూ శిరస్సువంచి, కళ్లు మూసుకొని, రెండు నిమిషాల తరవాత లేచి నిల్చున్నాడు.

అడుగులో అడుగు వేసుకుంటూ టెలిఫోన్ వైపు నడిచి, ముందు డాక్టర్‌కూ, తరవాత పోలీసులకూ రింగ్ చేసి, మంచంమీద పడున్న కూతుర్ని సమీపించాడు.

## 7

"షాక్ వల్ల స్పృహ తప్పింది. మరేం ఫరవాలేదు" అన్నాడు డాక్టర్ శ్రీవిద్యని పరీక్షించి, స్టెతస్కోప్ బ్యాగ్‌లో పెట్టుకుంటూ.

అప్పుడు కుదుటపడింది మేజర్ నాయుడు మనసు.

అంతలో బైట జీపు ఆగిన చప్పుడూ, నలుగురైదుగురు గబగబ లోనికి వస్తున్న చప్పుడూ వినిపించి, బైటికి నడిచాడు నాయుడు.

పోలీసులు!

వాళ్ళని శవాలు పడున్న గదిలోకి తీసి కెళ్ళాడు నాయుడు. ఆ శవాల అవతారాలు చూడగానే ఆశ్చర్యంతో అవాక్కయిపోయాడు ఇన్స్పెక్టర్.

"నీగ్రోస్!"

తలూపాడు నాయుడు.

"ఎవరో స్థానిక దొంగలు మీ ఇంట్లో దూరి వుంటారనుకున్నాను. వీళ్ళు ఆఫ్రికన్ నీగ్రోస్. బైట గేటు దగ్గర చచ్చిపడున్న గూర్ఖానీ, ఊడ పెరికిన తలుపునీ, ఇంట్లో చచ్చిపడున్న వీళ్ళనీ చూస్తోంటే, నిస్సందేహంగా వీళ్ళు మీ కేదో అపకారం చెయ్యడానికే వచ్చుంటారనిపిస్తోంది.

అటువంటప్పుడు ఆత్మరక్షణార్థం మీరు వీళ్ళని

చంపడం చట్టరీత్యా నేరంకాదు. ఒప్పుకుంటాను. ఐతే, పరదేశీయులైన వీళ్ళు మీ ఇంట్లోకి యెందుకు జొరబడ్డారు?

అదుగో, ఆ శవంమీద దుస్తుల్ని బట్టి అతను ఓడ కెప్టెన్‌లా వున్నాడు. అంటే, వీళ్ళు తిన్నగా ఓడరేవు నించే వచ్చి వుంటారని అర్థమౌతోంది. దొంగతనమే చెయ్యాలనుకున్నప్పుడు హార్బర్ చేరువలో ఇంకా ఎంతో మంది ధనవంతులు నివసిస్తుండగా వారి భవనాలు వదిలి అనేక ఇక్కట్లుపడి ఇంతదూరం యెందుకొస్తారు? దీన్ని బట్టి వీరి ఉద్దేశం ఇంకేదో అయివుంటుందనిపిస్తోంది" అన్నాడు ఇన్‌స్పెక్టర్ తార్కికంగా.

తలూపాడు నాయుడు. "ఔను. మీ అంచనా కరెక్టే! వీళ్ళు దొంగతనానికి నా ఇంట్లో దూరలేదు."

"మరి?"

"నా కూతుర్ని కిడ్నాప్ చెయ్యడానికి వచ్చారు."

ఆశ్చర్యంతో ఇన్‌స్పెక్టర్ కళ్ళు విప్పారాయి. "ఐనా మొదటి ప్రశ్నే ఉత్పన్నమౌతుంది. ప్రత్యేకించి మీ అమ్మాయినే అపహరించడానికి ఇంతదూరం వచ్చారంటే, ఇందులో యేదో తిరకాసుందనిపించడంలేదూ?"

"ఔను, వుంది. మామూలు తిరకాసుకాదు. మహత్తరాశయం! వీరు మామూలు నేరస్థులుకారు. మహోన్నతులు. పునీతులు" అన్నాడు మేజర్ నాయుడు గద్గద స్వరంతో.

ఇన్‌స్పెక్టర్ కనుబొమలు ముడిపడ్డాయి. "కూతుర్ని అపహరించడానికి వచ్చినవాళ్ళంటారు. ఆత్మరక్షణార్థం కాల్చిచంపానంటారు. మామూలు నేరస్థులు కాదంటారు. మహత్తరాశయమంటారు. మీరంటున్నదేమిటో నాకర్థమై

చావడంలేదు. దీన్నిబట్టి వీళ్లు మొదటినించీ మీకు తెలిసిన వాళ్ళలా వున్నారు. ఔనా?"

తలూపాడు నాయుడు. "నిజమే! వీరితో నా పరిచయం ఈ నాటిది కాదు. ఎంతో పురాతనమైనది. అదొక గాధ! విషాద గాధ! చెబుతాను రండి" అంటూ కూతురు పడుకున్న గదివైపు నడిచాడు.

సిబ్బందికి పనులు పురమాయించి, ఆయనననుసరించాడు ఇన్‌స్పెక్టర్.

"స్పృహ వచ్చిందా అమ్మాయికి?" అడిగాడు నాయుడు డాక్టర్ని.

"ఇంజక్షన్ ఇచ్చాను. కాసేపట్లో వస్తుంది."

"కూర్చోండి ఇన్‌స్పెక్టర్!" అన్నాడు నాయుడు మంచం పక్కనే వున్న సోఫాలో చతికిలబడుతూ.

ఇన్‌స్పెక్టర్ కూర్చున్నాక ప్రారంభించాడు నెమ్మదిగా.

## 8

అది 1945 సంవత్సరం! రెండవ ప్రపంచ యుద్ధం చివరి దశలో భీకర స్థాయికి చేరుకున్న ఘట్టం!

అప్పుడు నేనుమన దేశాన్ని పాలిస్తున్న బ్రిటిష్ సైన్యంలో మేజర్‌గా పనిచేస్తున్నాను. జర్మన్ సైన్యం అటు యూరప్‌లో నేగాక, ఇటు మధ్య ప్రాచ్యంలోని కొన్ని కీలక దేశాలగుండా కదం తొక్కుతూ దక్షిణాఫ్రికా పొలిమేరల్ని చేరి, బ్రిటిష్ సైన్యంతో భీషణ పోరాటం కొనసాగిస్తోంది.

అందులో నేనూ వున్నాను. మా బెటాలియన్ ఓకొండ ప్రాంతంలో ముందుకు చొచ్చుకొస్తున్న జర్మన్ల కాళ్ళకు అనకట్టవేసి, వెనక్కి తరిమే ప్రయత్నంలో వుంది. ఐతే,

కొండమీద బిగించి వున్న జర్మన్ల ఆర్టిలరీ ఫిరంగుల ధాటికి తట్టుకోలేక మా ప్రయత్నాలు విఫలమవసాగాయి.

నిర్విరామంగా మావైపు గుళ్ళవర్షం కురిపిస్తున్న ఆ ఫిరంగుల నోళ్ళని శాశ్వతంగా మూయించడానికి మా పై ఆఫీసర్లు ఓ పథకం అల్లారు. ఆ పథకం ప్రకారం నా నేతృత్వంలో పదిమంది కమాండోల బృందం అర్థ రాత్రి బైలుదేరి ఆ కొండమీది శత్రుస్థావరాన్ని చేరి, చడీ చప్పుడూ కాకుండా ఆ ఫిరంగుల్నీ, శత్రు సైనికుల్నీ నాశనం చెయ్యాలి.

నిర్ణీత సమయానుసారం అర్థరాత్రి కావలసిన ఆయుధాలతో ప్రయాణమై అష్టకష్టాలుపడుతూ కొండెక్కి ఆ స్థావరాన్ని చేరాం! కమాండో శిక్షణానుసారం అర్థ నిద్రావస్థలో వున్న సైనికుల నోళ్ళు నొక్కుతూ కత్తులతో నిశబ్దంగా పొడిచి చంపసాగాం!

అలా కొద్దిసేపట్లోనే పదీ పన్నెండుమందిని చంపామనుకుంటూను. అంతలో హఠాత్తుగా ఓ బండ వెనక నించి మాపై మెషిన్ గన్ గుళ్ళ వర్షం కురవసాగింది. ఆ హఠాత్పరిణామానికి నా సైనికుల్లో నలుగురు నేల కొరిగారు.

పూర్తిగా మేల్కొనున్న శత్రుసైనికులెవరో మా కదలికలు గమనించి మాపై ఫైరింగ్ ప్రారంభించాడు. మేమూ మెరుపులా తలో బండమాటున నక్కి ఫైరింగ్ ఓపెన్ చేశాం!

ఆ శబ్దాలకు శత్రుసైనికులంతా మేల్కొని పెద్ద ఎత్తున మాపై దాడిచేశారు. ఆ కాల్పుల్లో నా సైనికులు మరో ముగ్గురు అమరులయ్యారు. గంటసేపు మా మధ్య నిర్విరామంగా జరిగింది భీషణ పోరాటం!

నేను తెచ్చుకున్న అమ్యూనిషన్ (తుపాకీగుళ్ళు) పూర్తిగా అయిపోయాయి. ఆ పోరాటంలో నా సైనికుల్లో యెంతమంది బ్రతికున్నారో తెలియని పరిస్థితి ఏర్పడింది. శత్రువులు నాలుగువైపుల్నుంచి మేమున్న ప్రదేశాన్ని చుట్టుముట్టసాగారు.

వారి చేతికి చిక్కి చిత్రహింసలుపడి కుక్క చావు చచ్చేకంటే ప్రాణాలు కాపాడుకుని, పలాయనం చిత్తగించడమే మేలనిపించింది నాకు. చీకట్లో తోచిన దిక్కు పరుగుతీశాను. శత్రుసైనికుల కర్థమైపోయింది నా దగ్గ గుళ్ళు అయిపోయాయని.

నన్ను ప్రాణాలతో పట్టుకుంటే, మా రహస్యాలు కక్కించవచ్చని నా వెంటపడ్డారు. కొండ దిగి చాలా దూరం పరిగెత్తాక గానీ నాకు తెలిసిరాలేదు. నేను దిగింది కొండ కావలివైపు అనీ, మా స్థావరంవైపు కాదనీ.

అప్పటికే ఆయాసంతో నా నరనాడులు కృంగి పోయాయి. దాంతో శత్రుసైనికులు ప్రతిక్షణం నాకు చేరువకాసాగారు. కాస్తో కూస్తో మిగిలిన సత్తువంతా కూడదీసుకుంటూ పరిగెత్తాను.

కాసేపట్లోనే మిగిలిన ఆ సత్తువ కాస్తా నశించి పోయింది. అదే క్షణంలో నా ముందు ఉరకలు వేస్తూ పారుతున్న ఓ నది కనిపించింది. శత్రువులకెలాగూ పట్టుబడక తప్పదు. దానికంటే ఆ నదిలో దూకి కొట్టుకుపోడమే నయమనిపించింది.

దూకేశాను. ఈదే శక్తిలేక మునుగుతూ, తేలుతూ సొమ్మసిల్లి పోయాను. తిరిగి కళ్ళు తెరిచి చూస్తే నదిఒడ్డు కానుకున్న వెడల్పాటి బండపై పడున్నాను. అప్పటికే బాగా పొద్దెక్కింది. నదికిరువైపులా దట్టమైన కీకారణ్యం

లేచాను. ఆకలితో కడుపు కాలుతోంది. అరణ్యంలో తినడానికేమైనా ఫలాలు దొరుకుతాయని కాళ్ళీడ్చుకుంటూ అటు నడిచాను. చెట్లూ పొదలూ చీల్చుకుంటూ కొద్దిదూరం వెళ్ళానో లేదో, ఏదో రివ్వున దూసుకువచ్చి నా పాదాల దగ్గర దిగబడింది భూమిలో. అదిరిపడి చూశాను.

బాణం! చిన్న చిన్న పక్షి ఈకలు చుట్టి వున్న బాణం!

భయంతో చుట్టూ కలయజూశాను. ఎవ్వరూ కనిపించలేదు. మరో అడుగు ముందుకేశాను. మరుక్షణం రెండోపక్కనించి మరో బాణం నా పాంటును రాసుకుంటూ వచ్చి పాదాల ముందు దిగబడింది. వెంట్రుక వాసిలో గురితప్పినా నా పక్కటెముకల్లో దిగబడేదే!

ఇక మూడో అడుగు ముందుకేసే ధైర్యం నాలో అడుగంటింది. చేష్టలుడిగి అలాగే నిల్చుండిపోయాను. అంతలో చుట్టుపక్కల చెట్లమీంచి పదీ, పదిహేనుమంది ఆఫ్రికన్ ఆటవికజాతి నీగ్రోలు కిందికి దూకి, నావైపు ఈటెలూ, బాణాలూ ఎక్కుపెట్టి రాసాగారు.

శిలాప్రతిమలా చూస్తుండిపోయాను వాళ్ళని. అందరూ నన్ను చుట్టుముట్టాక ఒకడు నన్ను తమతో రమ్మన్నట్టు హూంకరించాడు. కదిలాను వారివెంట. చెట్లూ, చేమలూ దాటి చాలాదూరం ప్రయాణించాక, అడవి మధ్య విశాలమైన పచ్చిక మైదానం కనిపించింది. మైదానం మధ్య చిన్న చిన్న గుడిసెలు.

మేమా గుడిసెల్ని సమీపించగానే యువకులూ, యువతులూ, ముసలివారూ, పసిపిల్లలూ బిలబిల బైటికి వచ్చి, నన్ను చూస్తూ పరస్పరం గుసగుసలాడుతో

సాగారు. ఒక విషయం గమనించాను. వారి చూపుల్లో నామీద ద్వేషానికి బదులు యేదో ఆత్మీయ భావన కనిపించింది.

అది నా భ్రమ కాబోలనుకున్నాను. ఐతే, ఓ విశాలమైన గుడిసెలోంచి ఇవతలికి వచ్చిన దృఢకాయుడైన వృద్ధుడు నా భ్రమ పటాపంచలు చేశాడు. అతని నడుం చుట్టూ పులి చర్మం వుంది. తలకు పొడవాటి పంచరంగుల పక్షి ఈకలు కట్టి వున్నాయి. చేతిలో లావుపాటి నీలి రంగు పూసల హారం వుంది.

అతను నవ్వుతూ నన్ను సమీపించి, ఆ హారాన్ని నా మెడలో వేసి, ఆప్తమిత్రుడిలా కౌగలించుకున్నాడు. మరుక్షణం నన్ను తీసుకువచ్చిన పురుషులతో సహా అందరూ ఆనందంతో కేరింతలు కొడుతూ, కుప్పిగంతులెయ్యసాగారు. అప్పుడర్థమైంది నాకు, ఆ వృద్ధుడు వారి నాయకుడని.

అతను నా భుజంమీద చెయ్యివేసి, ఆప్యాయంగా తన గుడిసెలోకి తీసికెళ్ళి, ఓ చెక్క దిమ్మెమీద కూర్చోబెట్టాడు. మరుక్షణం మట్టిపాత్రల్లో దోరగా కాల్చిన జింకమాంసం, ద్రాక్షరసం, పాలూ, పళ్ళూ తెచ్చిపెట్టారు సేవకులు. సుష్టుగా భోంచేశాను. అప్పుడుగానీ నా ప్రాణం ఓ కొలిక్కి రాలేదు.

అలా వారి ఆతిథ్యంలో మూడు నెలలు గడిచాయి. నాకోసం ఓ ప్రత్యేకమైన గుడిసె తయారుచేసి, అన్ని సౌకర్యాలు కల్పించారు. ఆ మూడు నెలల వ్యవధిలో నాకు సైగలతో వారి భాష నేర్పడంలో కృతకృత్యులయ్యారు.

రాత్రిళ్ళు నా గుడిసె బైటా పగలు నేను ఎక్కడికి వెళ్ళినా కాపలా వుండేది. ఐతే, అది నిర్బంధ కాపలా కాదు. ఇష్టంవచ్చినట్టు తిరగవచ్చు. కానీ వారి గూడానికి కొద్దిదూరంలో యెత్తయిన మట్టిదిబ్బమీదున్న గుడిసె దగ్గరికి మాత్రం వెళ్ళకూడదని షరతు విధించారు.

ఆ గుడిసెలో యేముందో తెలుసుకోవాలన్న జిజ్ఞాస నన్ను పీకుతుండేది. నా వెంట వుండే ఆటవికుల్ని అడిగితే ఆ రహస్యం చెప్పకూడదని నాయకుడు వారిని ఆదేశించాడట. ఎవ్వరూ చెప్పేవారుకాదు.

ధైర్యంచేసి నేనే వెళ్ళి చూద్దామనిపించేది. అలా తెగిస్తే నా ప్రాణానికే ముప్పురావచ్చు. ఆటవికులు అమాయకులు. స్నేహంచేస్తే ప్రాణం ఇస్తారు. శతృత్వం కొనితెచ్చుకుంటే నిర్దాక్షిణ్యంగా చంపేస్తారు. మరో విషయం కూడా నన్ను తికమక పెడుతుండేది. ముక్కూ మొహం తెలీని పరాయివాణ్నయినా నన్ను పట్టుకొచ్చి అంత ఆప్యాయంగా అన్ని రోజుల అతిథ్యం యెందుకిస్తున్నారు.

ఆటవికుల్లో కొన్ని భయంకర మూఢవిశ్వాసాలుంటాయనీ, వారి ఇలవేల్పుల రూపంలో కొందరు దేవతలుంటారనీ, ఒక శుభ ఘడియచూసి వారా విగ్రహాలకు మనుషుల్ని బలిస్తారని విన్నాను.

మన పల్లెవాసులిప్పటికీ బలికోసం ప్రత్యేకంగా కొన్ని మేకల్ని, గొఱ్ఱెల్ని దేవతల పేర పెంచి పోషిస్తారు. జాతరల పేర జరిగే ఉత్సవాల్లో వాటి తలలు తెగనరుకుతారు.

కొంపదీసి, నన్నూ అలా తగిన సమయంకోసం ఆప్యాయంగా పోషించడం లేదుకదా? అన్న అనుమానం పీక

సాగింది. ఐతే, ఆ చుట్టుపక్క లెక్కడా యెటువంటి దేవతా విగ్రహమూ కానరాలేదు నాకు.

ఉండబట్టలేక ఒకరోజు నాయకుణ్ని అడిగేశాను, నన్నక్కడ ఎందుకుంచారని? తగిన సమయం వచ్చాక చెబుతానన్నాడు. చివరికా సమయం రానే వచ్చింది. ఒక రోజు ఉదయం ఫలహారాలయ్యాక, నాయకుడు నన్ను తన గుడిసెకి పిలిపించి సాదరంగా కూర్చోబెట్టాడు.

అతనితో బాటు అక్కడ మరో వ్యక్తికూడా వున్నాడు. అతనే ఆగోసా! పక్క గదిలో చచ్చిపడున్న వృద్ధుడు. అతనా తెగ పూజారి. భూతవైద్యుడు. ఆ ప్రజలు తమ నాయకుని తరవాత అధిక ప్రాధాన్యం ఇచ్చేది అతనికే!

నన్ను చూడగానే అతను లేచి నా దుస్తులన్ని విడిపించి, కాసేపు పడుకోబెట్టి, కూర్చోబెట్టి, వంగోబెట్టి గంటసేపు నా శరీరావయవాలన్నీ క్షుణ్ణంగా పరిశీలించి, నాయకుడివైపు చూస్తూ సాలోచనగా తలూపాడు.

అప్పుడు నాయకుడు నన్ను కూర్చోబెట్టి, చెప్పడం ప్రారంభించాడు. 'మిత్రమా! ఆనాడు నువ్వడిగిన ప్రశ్నకు సమాధానం ఇచ్చే సమయం ఈ రోజు ఆసన్నమైంది. ఈ కీకారణ్యాల్లో అనేక జాతులూ, తెగలూ నివసిస్తున్నాయి.

అందరికీ తమవంటూ కొన్ని సాంప్రదాయాలూ, నమ్మకాలూ వున్నాయి. తరతరాలుగా వస్తున్న ఆ సాంప్రదాయాలను వారు ప్రాణపదంగా కాపాడుకుంటూ జీవిస్తున్నారు. సాధారణంగా ప్రతి తెగకూ తమదంటూ ఓ కులదైవముంటుంది.

ఆ దేవతను వారు విగ్రహరూపంలో ప్రతిష్ఠించుకుని,

బలులూ, పూజలూ జరుపుతుంటారు. అలాగే మాకూ అతి పవిత్రమైన ఓ కులదైవముంది. మువాంగా! ఆమెను మేము జీవంలేని విగ్రహరూపంలో ప్రతిష్టించుకోలేదు. ప్రాణం వున్న మనిషి రూపంలోనే కొలుస్తాము. ఐతే, ఆ మనిషి మా జాతికి చెందినదై వుండదు. వేరు వేరు జాతులకు చెందిన ఇద్దరు స్త్రీ పురుషుల్ని పట్టుకొచ్చి, మా పద్ధతిలో వారికి పెళ్ళి జరిపిస్తాము.

ఆ దంపతులకు పుట్టిన ప్రథమ పుత్రికే మువాంగా తల్లి అవుతుంది. మా జాతికి ఆరాధ్య దైవం! ఆ పిల్లను పూజాపునస్కారాలతో అపురూపంగా పెంచి పెద్ద చేస్తాము. జీవితకాలమంతా ఆమె అవివాహితగానే వుంటుంది.

మరణం అనేది అందరికీ అనివార్యంకదా! వృద్ధాప్యం వచ్చి ఆమె మరణించాక, ఆమె శవాన్ని మా ప్రత్యేక చివరి పూజానంతరం గూడెంమధ్య సమాధిచేసి, మళ్ళీ అదే పద్ధతిలో పరాయి జాతుల స్త్రీ పురుషుల్ని పట్టుకొచ్చి, వివాహం జరిపించి, వారికి పుట్టే తొలి కూతుర్ని మా దేవతగా కొలుస్తాము.

ఆమె మా మధ్య వుంటూ, మా పూజలందుకుంటూ, ఆశీర్వదిస్తున్నంత కాలం మా జాతికే కీడూ వాటిల్లదు. అందరూ సుఖసౌఖ్యాలూ, భోగ భాగ్యాలూ, ఆయురారోగ్యాలతో వర్ధిల్లుతారు.

అడపా, దడపా ఇతర తెగలకూ, మాకూ జరిగే యుద్ధాల్లో అంతిమ విజయం మాదే అవుతుంది. అందుకే ఇతర తెగలేవీ మావైపు కన్నెత్తిచూడవు. ఈ భీకర కారణ్యం మధ్య నివసిస్తున్న విషసర్పాలుగానీ, క్రూర మృగాలుగానీ మమ్మల్నేమీ చెయ్యవు.

మువాంగా తల్లి మాకు దూరమైతే మా పశువులు పాలివ్వడం మానేస్తాయి. పచ్చగా కళకళలాడే మా పొలాలు బీటలు వారతాయి. శత్రువులు మమ్మల్ని చీల్చి చెండాడుతారు. విషసర్పాలూ, క్రూరమృగాలు మా వారిని నిరాటంకంగా బలిగొంటాయి.

అందుకే సాధ్యమైనంత త్వరగా మేము మరో మువాంగా తల్లిని పుట్టించుకుంటాము. కొద్దిరోజులక్రితమే మువాంగా తల్లి మమ్మల్ని విడిచి స్వర్గానికెళ్ళిపోయింది. వెంటనే మేము శ్వేతజాతి స్త్రీ పురుషులకోసం వెతక సాగాము.

అదృష్టవశాత్తూ ఈ మధ్యే మాకో యువతి దొరికింది. ఆమెను గూడానికి దూరంగా వున్న మట్టి దిబ్బమీది గుడిసెలో ఉంచి, కఠినమైన కాపలా యేర్పాటుజేసి, పురుషుడికోసం వెతుకుతుండగా నువ్వు దొరికావు. ఇంత కాలం నీలాగే ఆమెకూ మా స్త్రీలు మా భాష, ఆచార వ్యవహారాలూ నేర్పారు. ఇక మీ ఇద్దరి వివాహం జరిపించే సమయం ఆసన్నమైంది. ఈ పెళ్ళి నీకిష్టమేనా?"

అతని మాటలు విని, నా మస్తిష్కం పని చెయ్యడం మానేసింది. చాలాసేపయ్యాక తేరుకుని అడిగాను. "మాకు మొదటి సంతానం ఆడపిల్లే పుడుతుందని ఏమిటి నమ్మకం?"

అందుకతను నవ్వి—"మేము అరణ్య జీవులం! ఈ చెట్టూ చేమల్లో ప్రకృతి యెన్నో చిత్ర విచిత్రాలు నిక్షిప్తం జేసింది. ఆడపిల్ల కావాలనుకున్నప్పుడు ఖచ్చితంగా ఆడపిల్లే పుట్టడానికి కొన్ని వనమూలికలున్నాయి మా వద్ద.

వివాహానికి ముందు మూడు నెలల కాలం ఆ మూలికల్ని

పాలల్లో కలిపి పురుషులు సేవిస్తే వివాహానంతరం వారికి మొదటి సంతానం ఆడపిల్లే పుడుతుంది. ఈ మూడు నెలలూ నీకా మూలికలు తినిపించటానికే సరిపోయింది మరి" అన్నాడు.

"అమ్మాయి పుట్టాక ఆమె తలిదండ్రుల్ని యేం చేస్తారు?" అడిగాను.

"వాళ్ళిష్టం! మాతో బాటు ఇక్కడే ఉండాలనుకుంటే నిక్షేపంగా, సుఖంగా వుండొచ్చు. ఎంతో గౌరవం ఇవ్వబడుతుంది వారికి. వెళ్ళదలచుకుంటే వారి ఇష్టం! యెక్కడికేనా వెళ్ళొచ్చు.

ఐతే, ఎట్టి పరిస్థితిలోనూ వారివెంట మువాంగా తల్లి పంపబడదు. మా కన్నుగప్పి పిల్లను తీసికెళ్ళారా, ఈ భూనభోంతరాళల్లో ఎక్కడున్నాసరే, మా తల్లిని వెతికి తెచ్చుకుంటాం! అందుకు యెన్ని సంవత్సరాలు పట్టినా వెరవం! ఆ మధ్యకాలంలో ఆమె మరణిస్తే అది వేరే విషయం!

ఆమెను వెదికే పని మా పూజారి అయిన ఈ ఆగోసా స్వయంగా పర్యవేక్షిస్తాడు. మమ్మల్ని మోసంచేసి, మా తల్లిని మాకు దూరంచేసినందుకు శిక్షగా ఆమె తల్లిదండ్రులకు మరణశిక్ష తప్పదు" అన్న అతని మాటలకు నా రోమాలు నిక్కబొడుచుకున్నాయి.

ఆ పెళ్ళికి ఒప్పుకోకున్నా నాకు మరణశిక్ష తప్పదేమో! అందుకే, అయిష్టంగానే అందుకు తల ఒగ్గాను. వెంటనే మా పెళ్ళికి ముహూర్తం నిర్ణయించాడు ఆగోసా! వచ్చే పౌర్ణమి రాత్రి!

పగలుకూడా చీకటి కమ్మే ఆ కీకారణ్యాన్ని ఆ రాత్రి పున్నమి జాబిల్లి పండువెన్నెలతో జిగేలుమని

పిస్తోంది. గూడెంవాసులంతా రకరకాల పక్షి ఈకలతో చేసిన దుస్తులు ధరించారు.

నన్నూ అలాటి దుస్తులతోనే అలంకరించి, మెడలో వజ్రాలహారంవేసి, విశాలమైన మైదానంలోకి తీసికెళ్ళారు. తరవాత మేళతాళాలతో ఆ గుడిసెలోంచి ఆడవారి గుంపు బైలుదేరి వచ్చింది. వారిమధ్య వున్న పెళ్ళి కూతుర్ని చూడగానే ఆశ్చర్యంతో అవాక్కయి పోయాను.

ఆమె ఇంగ్లీష్ యువతి! కళ్ళు చెదరగొట్టే అందగత్తె. నాలాగే ఆమె మెడలోనూ ఓ వజ్రాలహారం జిగేల్మం టోంది. దాని కాంతికి ఆ పున్నమి వెన్నెలకూడా వెల వెల బోతోంది.

ఆ నల్లజాతి ఆటవికుల మధ్య ఆసియావాసినైన నన్ను చూడగానే ఆమెకూడా క్షణకాలం చకితురాలైంది. పూజారి ఆగోసా ఆదేశానుసారం, అతను మంత్రాలు వల్లిస్తుండగా, మేళతాళాల మధ్య మేమిద్దరం మా వజ్రాల హారాలు ఒకరి మెడల్లో ఒకరం వేసుకున్నాం!

ఆ తరవాత అర్ధరాత్రివరకూ డప్పులతో, కేరింతలతో నృత్యాలలో అడవి మార్మోగింది. కాల్చిన జింకమాంసం పళ్ళ మధువుతో విందుచేసుకున్నారు. తరవాత, వివాహిత స్త్రీలు మా ఇద్దర్నీ రకరకాల అరణ్య పుష్పాలతో అలంకరించిన ఆ ఏకాంత గుడిసెలోకి తీసికెళ్ళి, లోనికి తోసి కవాటం మూసి నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.

అప్పుడు చెప్పిందా యువతి నా గుండెల్లో తలమార్చి, వెక్కి వెక్కి యేడుస్తూ తన గాథ! విషాద గాథ! బ్రిటన్‌కు చెందిన ఆ యువతి పేరు టీనాచార్లెస్. ఆమె తండ్రి ఏనుగుదంతాల వ్యాపారి. ఏనుగుల్ని వేటాడి,

వాటి దంతాలు సేకరించడానికాయన తరుచూ ఆఫ్రికా అడవులకు వస్తుంటాడు.

ఐతే, ఈసారి కాలేజీ సెలవుల్లో ఆ వేటను కళ్లారా చూసి ఆనందించాలని తండ్రి యెంత వారించినా వినకుండా ఆయన వెంట ఆఫ్రికా వచ్చింది టీనా! అడవిలో ఏనుగుల్ని వేటాడుతుండగా వారిని ఈ ఆటవికులు చుట్టుముట్టి బాణాల వర్షం కురిపించారు. ఆమె తండ్రీ, ఆయన సహచరులిద్దరూ తుపాకులతో వారిని ఎదుర్కొన్నారు. చెట్లకొమ్మల్లో, పొదల్లో దాగి బాణాలు విడుస్తున్న ఆటవికులకు ఆ తుపాకీ గుళ్ళు తగలకుండా గురితప్పసాగాయి. అలా గుళ్ళన్నీ అయిపోగానే ఆటవికుల బాణాలు ఆమె తండ్రినీ, అనుచరుల్నీ తుదముట్టించాయి.

ఏకాకిగా మిగిలిన ఆమెను వారు గూడానికి తెచ్చి, ఆ గుడిసెలో బంధించారు. ఆ భయంకర వాతావరణంలో ఊహించని విధంగా నాగరిక ప్రపంచానికి చెందిన నేను కనిపించేసరికి ఆమెలో యెక్కడలేని ధైర్యం పుంజుకుంది.

ఆ రాత్రి మా తనువులేకాదు మా మనసులూ యేకమయ్యాయి. రోజులు నిశ్చింతగా దొర్లిపోసాగాయి. ఒకరోజు తనకు నెల తప్పిందని చెప్పింది టీనా! నేనా శుభవార్తను గూడెం నాయకుడికి వెల్లడించాను. అంతే! ఆ రోజు మొదలు మూడురోజులపాటు ఉత్సవాలు జరుపుకున్నారు వాళ్ళు.

ఆనాటినించీ టీనాను కాలు కింద పెట్టనివ్వకుండా యెంతో అపురూపంగా చూసుకోసాగారు అక్కడి స్త్రీలు. తొమ్మిది మాసాల తరవాత పండంటి ఆడపిల్లను ప్రసవించిందామె.

వరసగా మూడు వారాలూ వేడుకలు జరిగాయి గూడెంలో. ఆనాటినించీ మా గౌరవమర్యాదలు ఇంకా ఇనుమడించాయి. మా చిట్టితల్లికి శ్రీవిద్య అని పేరు పెట్టుకున్నాను. వారు మాత్రం మువాంగా అనే పిల్చే వారు.

ఆ లేత వయసునించే ఆమెకు పూజాపునస్కారాలు ప్రారంభమయ్యాయి. మాలో భ రిం ప రా ని దిగులు ప్రారంభమైంది. మా ప్రేమ ఫలాన్ని, పంచప్రాణాన్ని, జీవితాంతం అవివాహితగా, ఆ ఆటవికుల మూఢవిశ్వాసాలకు బలిపెట్టాలా?

అసంభవం! నాకు తినబెట్టిన మూలికల ప్రభావంవల్ల మళ్ళీ నాకు సంతానం కలగదనికూడా చెప్పారాయె. ఏం చెయ్యాలి? తీవ్రంగా యోచించి ఓ నిర్ణయానికి వచ్చాం! పారిపోవాలి! ఆలోచించినంత సామాన్య విషయం కాదది.

తగిన సమయం కోసం యెదురుచూడసాగాం! అలా రెండు సంవత్సరాలు దొర్లిపోయాయి కాలగర్భంలో. ప్రతి సంవత్సరం మా బిడ్డ పుట్టిన రోజును ఎంతో పవిత్ర దినంగా భావించి, వైభవంగా పండగ జేసుకునేవారు వాళ్ళు. అనేక వజ్రవైఢూర్యాలను పిల్లకు కానుకలుగా సమర్పించేవారు.

ఆలోగా వారికి మామీద పూర్తి విశ్వాసం ఏర్పడింది. ఆ విశ్వాసాన్ని ఆధారం చేసుకుని, వజ్రవైఢూర్యాలన్నీ మూటగట్టుకుని, ఓ అర్ధరాత్రి పాపతో అక్కణ్ణించి పారిపోయాం! అష్టకష్టాలుపడి ఓ నగరాన్ని చేరుకో గలిగాం!

అప్పటికి యుద్ధం ముగిసింది. ప్రపంచంలో నూతన

మార్పు వచ్చింది. భారతదేశానికి స్వాతంత్ర్యం లభించింది. దక్షిణాఫ్రికా ప్రభుత్వ సహాకారంతో మేము క్షేమంగా భారతదేశం చేరుకున్నాం!

టీనా మన పౌరసత్వాన్నీ, హిందూమతాన్ని స్వీకరించి, ఆదర్శపత్నిగా సంసారం చెయ్యసాగింది. శ్రీవిద్య పదేళ్ళ ప్రాయంలో వుండగా టీనాకు కాన్సర్ సోకి, అనేక ఇక్కట్లుపడి కన్నుమూసింది.

• • •

"ఈ లోకంలో ఇక నాకు మిగిలింది నా కూతురే! అలాంటి నా పంచప్రాణాన్ని వెదుక్కుంటూ ఇన్నేళ్ళ తరవాత ఇక్కడికి చేరుకున్నారు వీళ్ళు. ఎంత నచ్చ జెప్పినా వినకుండా బలవంతంగా నా తల్లిని నానుండి దూరం చెయ్యడానికి పూనుకున్నారు. గత్యంతరం లేక చివరికి వాళ్ళను చంపక తప్పలేదు.

చట్టరీత్యా అది నేరం కాకపోవచ్చు. నేను నిరపరాధినే కావచ్చు. కానీ, నైతిక దృష్ట్యా నేను మహాపరాధిని ఇన్ స్పెక్టర్. క్షమింపరాని నేరస్తుణ్ణి! అమాయకులైన వారిని నమ్మించి, వంచించి, భవబంధాలను వదులుకోలేక, పారిపోయి వచ్చిన ద్రోహిని.

నమ్మిన ఆచారాలను విస్మరించక, తుదకు తమ ప్రాణాలనే తృణప్రాయంగా ఎంచిన వారు నిజంగా మహనీయులు! పునీతులు!" అంటూ ముగించాడు మేజర్ నాయుడు.

స్పృహ వచ్చి, అంతవరకూ తండ్రి చెప్పిన కథ విన్న శ్రీవిద్య హృదయం చలించి చేతుల్లో ముఖం కప్పుకుని ఏడవసాగింది వెక్కి వెక్కి.

—: అయిపోయింది :—

# రోజా

### టెంపోరావ్

పన్నెండు దాటింది. ఇంట్లో అందరూ గాఢనిద్రలో వున్నారు.

ముందు తలుపుమీద కొట్టిన చప్పుడు విని రామూ, తల్లీ లేచారు.

"ఏమిట్రా ఆ చప్పుడు?" అంది తల్లి.

చప్పుడు యింకా యెక్కువైంది. ఎవరో తలుపును విరగ్గొట్టడానికి ప్రయత్నిస్తున్నారు. సందేహంలేదు.

రామూ తన చెల్లెల్ని లేపాడు. ఆమె కళ్ళు తెర్చి అతడివంక చూసింది.

"రోజా, దొంగలు, లే!" అన్నాడతను.

వులిక్కిపడుతూ ఆమె లేచి కూర్చుంది.

"దగ్గరలో యిళ్ళు లేవు. వెనకవైపు నుంచి నువ్వు పరుగెత్తుకెళ్ళి రాజుగారి యింటికి. ఆయన్నీ, మరికొందర్నీ రమ్మను!" అన్నాడు రామూ.

ముందా తలుపుపై గడియ మేకులు వూడి కింద

పడ్డాయి. బలంగా అటువైపునుంచి కొడ్తున్నారు.

తలుపు పగిలింది.

“భయంగా వుంది, అన్నయ్యా” అందామె.

ఇంకా ఆలస్యం చేస్తే తలుపు పగిలి, కిందపడి వాళ్ళు లోపలకు వస్తారు. అప్పుడు తనేమీ చెయ్యలేడు. రామూ ఆలోచిస్తున్నాడు.

వెనుక గుమ్మం దగ్గరకు ఆమెను రామూ లాక్కెళ్లాడు. తటాలున తలుపు తెర్చాడు.

బయట నిలబడిన ఆకారాన్ని చూసి ఆమె తృళ్ళిపడింది.

ఖాకీ నిక్కర్, నీలం బనీనులో వున్నాడో వ్యక్తి. మాస్కు ధరించాడు. చేతిలో లావుపాటి కర్రుంది.

“మేం గుడ్డోళ్ళం కాదు!” అర్చాడతను.

రామూ అతడితో కలియబడ్డాడు. ముందు తలుపు నేలకూలిన చప్పుడు భయంకరంగా వినపడింది.

కర్రతో రామూ తలమీద గట్టిగా కొట్టాడతను. అరుస్తూ రామూ నేలమీద పడిపోయాడు. తల నుంచి రక్తం కార్తోంది.

రోజా గబగబా పరుగెడుతోంది.

“ఆగు పిల్లా!” మాస్కు ధరించిన మనిషి అర్చాడు.

ఆమె ఆగలేదు. ఆగితే అన్నయ్య గతి తనకూ పట్టొచ్చు. ఆమె యింకా వేగంగా పరుగెత్తసాగింది.

వెనుకనే పరుగెత్తాడతను. కొంతసేపట్లో ఆమెను పట్టుకున్నాడు. అతడు ఆయాసంతో ఒగురుస్తున్నాడు.

కోపంగా రెండుసార్లు చంపలమీద కొట్టాడతను. ఆమె యేడ్వసాగింది.

“నా మాట వినకుండా పరుగెత్తుకు పోతున్నావా?

నిన్నిక్కడే బలాత్కరిస్తాను!"

ఆమెను తోశాడతను. మొక్కల పక్కనే గడ్డినేల మీద పడిందామె. ఆమెమీదకు వాలాడతను.

"నన్నేమీ చెయ్యకు! కావలిస్తే నా నగలు నీకిచ్చేస్తాను" అందామె.

"వాటిని వదుల్తానా?" అన్నాడతను వ్యంగ్యంగా నవ్వుతూ.

అతడామె దుస్తులను పీకేసి పక్కపడేశాడు. ఆమె గోళ్ళతో అతడిని గీకింది. సాయశక్తులా యుద్ధం చేసింది. చివరకి నిస్సహాయంగా అతడి కామానికి బలయిపోయింది.

ఇంట్లోని లైట్లు వెల్గుతున్నాయి. రోజా తల్లిని వాళ్ళు భయపెడ్తున్నారు.

"డబ్బు, నగలు అన్నీ యిచ్చేయి!" అరిచాడు ఒకతను.

"నా భర్త లేరు. నా కూతురు పెళ్ళికుంది. మేం ధనవంతులం కాదు. మమ్మల్ని ఏంచేయకండి" అందామె కన్నీళ్ళతో.

"నీ కన్నీటి కథ వినడానికి మేం రాలేదు" అన్నాడొకడు.

ఇద్దరూ ఆమెను చితకబాదారు. రక్తం మడుగులో ఆమె కిందపడిపోయింది. పక్క గదిలోకి కొందరు దూరారు. పెట్టెలను, బీరువాను సోదా చేశారు. కావలసినదంతా ఒక సంచిలో వేసుకొని బయట కొచ్చారు.

"ఇంక పోదాం" అన్నాడు నాయకుడు.

అందరూ బయటకు నడిచారు. వరండామీద వదిలి వేసిన పంచలను కట్టుకున్నారు. చొక్కాలు తొడు

క్కున్నారు. మొక్కలను ఒక సంచిలో పడేశారు.

"నాగూ యేడీ?" అన్నాడు నాయకుడు.

"వెనకవైపు కాపలాకాస్తూ వుండుండాలి!"

"వాడిని పిలు!"

కాస్సేపట్లో నాగూ వచ్చాడక్కడికి. నిక్కరుమీద పంచకట్టుకుని, చొక్కా వేసుకున్నాడు.

"ఆ పక్కన యిళ్ళున్నాయి. కాలవవైపు నుంచి పోదాం" అన్నాడు నాయకుడు.

అందరూ కాలువవైపు వేగంగా వెళ్ళిపోయారు.

నూరు మీటర్ల దూరంలో వున్న యిళ్ళలోని వాళ్ళకు చప్పుళ్ళు వినబడ్డాయి. కొందరు లేచారు. కొందరు దుప్పట్ల కిందకు దూరి పడుకున్నారు.

రామరాజు యింట్లో లైట్లు వెలుగుతున్నాయి. అతడి ముగ్గురు కొడుకులూ హాల్లోకొచ్చారు.

"రామూ యింట్లో లైట్లు వెలుగుతున్నాయి. పదండి, యేమయిందో చూద్దాం" అన్నాడు రామరాజు.

తండ్రీ, కొడుకులూ కర్రలు పట్టుకొని రామూ యింటి వైపు నడిచారు.

## 2

చుట్టూ చీకటి. గడ్డిమీద వాళ్ళు మెల్లిగా కదులుతున్నారు.

"పామేదో యింట్లోకి దూరిందేమో!" అన్నాడు శివరాజు, రామరాజు మూడో కొడుకు.

శివరాజు, రామూ ఒక కంపెనీలో పనిచేస్తున్నారు. ఇద్దరూ పనిలో చేరి యింకా ఆరునెలలు కాలేదు.

ముందు హాల్లోకి వాళ్ళు ప్రవేశించారు. రోజా తల్లి రక్తం మడుగులో పడుంది.

"పాపం, పార్వతమ్మ!" అన్నాడు రామరాజు.

వెనుక తలుపులు తెర్చి వున్నాయి. గుర్రాజు అటు వెళ్లాడు. గుమ్మం బయట పడున్న రామూను చూసి అర్చాడు.

"రామూ యిక్కడ పడున్నాడు!"

నరసింహరాజు వెనుక వెతికాడు. గడ్డి నేలమీద నగ్నంగా పడున్న రోజాను చూసి అతడు త్రుళ్ళిపడ్డాడు. ఆమె ఒంటిమీద గుడ్డలు పడేసి, రోజాను అతడు మోసుకెళ్ళి హాల్లో పడుకోబెట్టాడు.

రామరాజు ఆమెవైపు చూశాడు. ముఖంమీద నీళ్ళు చల్లాడు. కాస్సేపట్లో ఆమె కళ్ళు తెర్చింది.

"ఏమైంది?" అడిగాడు రామరాజు.

జవాబిచ్చే స్థితిలో లేదామె.

రామరాజు తన కొడుకులవంక చూశాడు.

"గుర్రాజూ, నువ్వు మోటర్ బైక్ మీద వెళ్ళి ఆటోనో, టాక్సీనో తీసుకురా. వీళ్ళను హాస్పిటల్లో చేర్చాలి" అన్నాడు రామరాజు.

"నేను పోలీసు రిపోర్టిస్తాను, నాన్నా" అన్నాడు నరసింహరాజు.

దాహం వేస్తోందని రోజా సంజ్ఞ చేసింది. కుండలోని నీళ్ళను ఆమెకు యిచ్చాడు శివరాజు.

గుర్రాజు, నరసింహరాజు వెళ్ళిపోయారు. రెండు గ్లాసుల నీళ్ళు తాగి రోజా హాల్లోని వాళ్ళవైపు చూసింది. ఆమె చూపును గమనించి తండ్రీ, కొడుకూ బయటకు నడిచారు.

పైన కప్పిన దుస్తులను ఆమె సరిగ్గా కట్టుకుంది. హాల్లో పడున్న తల్లివైపు చూసి యేడ్వసాగింది.

రామరాజూ, కొడుకూ లోపలకు వచ్చారు.

"ధైర్యం తెచ్చుకోవమ్మా! ఏడ్చి ఏం లాభం!" అన్నాడు రామరాజు.

ఇంటిముందు టాక్సీ ఆగింది. పార్వతమ్మనీ, రామూనూ మోసుకెళ్ళి టాక్సీలో పడుకోబెట్టారు.

"హాస్పిటల్‌కూ నువ్వూ వెళ్ళడం మంచిదమ్మా!" అన్నాడు రామరాజు.

"ప్రస్తుతం వెళ్ళక్కర్లేదు" అందామె.

టాక్సీ కదిలింది. గుర్రాజు మోటర్ బైక్ మీద టాక్సీ వెనకనే వెళ్ళాడు.

సైకిల్ మీద వెళ్ళిన నరసింహరాజు తిరిగివచ్చాడు.

"పోలీస్ స్టేషన్‌లో రిపోర్టు యిచ్చాను. వాళ్ళు వస్తామన్నారు" అన్నాడతను.

రామరాజు సూటిగా రోజావంక చూశాడు.

"ఏం జరిగిందమ్మా?"

"బందిపోటు దొంగలు యింటిమీద దాడిచేశారు. అంతా ఊడ్చుకు పట్టుకుపోయారు" అందామె.

"నువ్వు వెనక ఎందుకు పడున్నావు?"

"వెళ్ళి మిమ్మల్ని పిలవమన్నాడు అన్నయ్య. కాని ఒక బందిపోటు నాకు అడ్డుపడ్డాడు. నన్ను బలాత్కరించి, నా నగలు ఒల్చుకుని పట్టుకుపోయాడతను. లేవలేక నేనలాగే పడివున్నాను. చల్లటి గాలిలో నిద్రబట్టేసింది" అందామె.

"ఈ యింట్లోకి వెళ్ళొద్దని నేనెంత చెప్పినా నీ అన్న వినలేదు. తక్కువ అద్దె అని మీరు దిగారు. యిలా ఏకాంతంగా వున్న యిళ్ళమీదకే విరుచుకుపడ్తారు బందిపోటు దొంగలు" అన్నాడు రామరాజు.

రోజా పక్క గదిలోకి వెళ్ళింది. అన్నీ చిందర వందరగా పడున్నాయి.

"రాజుగారూ అంతా యెత్తుకుపోయారు. అమ్మ బంగారం నగలులేవు. రొఖ్ఖంగా దాచినదంతా పోయింది" అందామె.

పోలీస్ జీప్ బయట ఆగింది. ఇన్ స్పెక్టర్ నాయర్, నలుగురు కాన్ స్టేబుళ్ళు కిందకు దిగారు.

ఇన్ స్పెక్టర్ కి యెదురుగా వెళ్ళాడు రామరాజు.

"నమస్కారం సార్" అన్నాడతను.

"ఏమైంది మీ యింట్లో?" అడిగాడు యిన్ స్పెక్టర్.

"ఈ యిల్లు నాది కాదు సార్. రామూది. వీళ్ళిద్దరూ నా కొడుకులు. మేమే పోలీసు రిపోర్టిచ్చాం" అన్నాడు రామరాజు.

ఇన్ స్పెక్టర్ నాయర్ హాల్లో యిటూ అటూ తిరిగాడు. గచ్చు నేలమీదున్న రక్తం మరకలను అతడు గుర్తించాడు.

"ఎవరికైనా దెబ్బలు తగిలాయా?" అడిగాడు యిన్ స్పెక్టర్.

"రామూకీ, అతడి తల్లికీ బాగా దెబ్బలు తగిలాయి. వాళ్ళను సమీపంలో వున్న హాస్పిటల్ కీ టాక్సీలో పంపాను. రామూ చెల్లెలు రోజామాత్రం వుందిక్కడ" అన్నాడు రామరాజు.

ఇన్ స్పెక్టర్ గోడవారగా నిలబడిన రోజావంక చూశాడు. ఆమె వయస్సు యిరవై యేళ్ళు వుండొచ్చు. చాలా అందమైన యువతి. బి.ఎ. ఫైనలియర్ లో వుంది.

"మిస్ రోజా! జరిగినదంతా చెప్పండి?"

"నేను నిద్రలో వున్నాను. అన్నయ్య నన్ను లేపాడు. వెనకవైపు నుంచి పరుగెత్తికెళ్ళి రామరాజు గారితో చెప్పమన్నాడు. కాని అంతవరకూ నేను వెళ్ళ లేకపోయాను. ఒక బందిపోటు నా వెనకబడ్డాడు. నన్ను చెరచి, నా నగలు పట్టుకుపోయాడు. అటుపైన నేనీ హాల్లో మేల్కొన్నాను" అందామె.

"ఎంతమంది వచ్చారు?"

"చాలామంది వచ్చుండాలి. నే నొకడి చేతుల్లో యిరుక్కుపోయాను. వాళ్ళందర్నీ చూసే అవకాశం నాకు లేదు" అందామె.

"ఎంత పోయివుంటుందో చెప్పగలరా?"

"నా ఒంటిమీద వుండే నగలు పోయాయి. మొత్తం నాలుగుకాసుల విలువైన నగలు నావి. నా పెళ్ళికోసం అమ్మ తన నగలు దాచింది. ఇరవై కాసులు పైన వుంటుంది విలువ. అన్న రొఖ్ఖంగా ఐదారువేలు దాచాడు. అంతా పోయింది" అందామె విచారాన్ని ప్రకటిస్తూ.

"మారుమూల నున్న యీ యింట్లో మీరు వుండడం విచిత్రంగా వుంది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అన్నయ్యకు తక్కువ అద్దెలో యిల్లు కావాలి. ఈ యిల్లు మాకు దొరికింది. అన్నయ్యకు పోలీసు డిపార్టు మెంట్ మీద నమ్మకం యెక్కువ. ఏ దొంగల్నీ యిటు వైపు పోలీసులు రానివ్వరని అన్నయ్య నమ్మకం" అందామె.

"సాధారణంగా యిటువైపున బందిపోటు దొంగల దాడులు లేవు. ఇదే మొదటిసారి. ఇటుపైన యీ ప్రాంతంలో పోలీసులు గస్తీతిరిగేటట్లు నేను చూస్తాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

రామరాజు టైమ్ చూశాడు. రెండు కావస్తోంది. ఒక కానిస్టేబుల్ని దగ్గరకు రమ్మన్నాడు ఇన్స్పెక్టర్.

"బీరువా, పెట్టెలమీద వేలిముద్రలు వుండొచ్చు, చూడమని లతీఫ్‌తో చెప్పు" అన్నాడు ఇన్స్పెక్టర్.

నలువైపులా తిరిగి అంతా పరీక్షించాడు ఇన్స్పెక్టర్ నాయర్.

"ఇంకా ఏమైనా చెప్పాలా?" అడిగాడు రోజా వంక చూస్తూ.

"నల్లతాడుకు కట్టిన యీ రాగిబిళ్ళను అతడి నుంచి నేను లాక్కున్నాను. దాన్ని గురించి అతడు మర్చిపోయాడు. ఇది మీకు వుపయోగపడుతుందేమో, చూడండి" అందామె.

రోజా యిచ్చిన రాగిబిళ్ళను తీసుకుని అతడు పరీక్షగా చూశాడు. బిళ్ళ మధ్యలో కొంగ బొమ్ముంది.

ఇన్స్పెక్టర్ నాయర్ విజిల్ వేశాడు.

"ఇది చాలా వుపయోగం—మరాఠీ బందిపోటు ముఠాకు చెందినవాళ్ళు యిటువంటి బిళ్ళలను మెళ్ళో కట్టుకుంటారు. ఆ ముఠా నాయకుడు సదోకర్. వాళ్ళ కోసం వెతుకుతాం" అన్నాడు ఇన్స్పెక్టర్ వుషారుగా.

ఇన్స్పెక్టర్ నాయర్ జీపువైపు నడిచాడు. ఇంటి ముందు నిలబడి నలువైపులా చూశాడు. ఎడం వైపున కొంత దూరంలో ఎన్నో యిళ్ళు వున్నాయి.

"అదే అబ్బాయి నగర్, నేనుండే కాలనీ" అన్నాడు రామరాజు.

ఇన్స్పెక్టర్ కుడివైపుకు చూశాడు. ఎత్తుగా గడ్డి మొక్కలున్నాయి.

"అటువైపు మురికికాలువ వుంది, సార్!" అన్నాడు

రామరాజు.

"వాళ్ళు అటే పోయి వుండాలి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఇన్‌స్పెక్టర్ జీపులో కూర్చున్నాడు.

"మీరక్కడే వుండండి. హాస్పిటల్‌కి వెళ్ళి వాళ్ళను చూసివస్తాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"క్రిల్పాక్ హాస్పిటల్లో చేర్చమన్నాను వాళ్ళను" అన్నాడు రామరాజు.

జీపు కదిలింది. రామరాజు, కొడుకులు హాల్లోకి నడిచారు.

# 3

రాత్రి కరిగిపోతోంది. లతీఫ్, మరో కానిస్టేబుల్ పడగ్గదిలో వేలిముద్రలకోసం వెతుకుతున్నారు.

రామరాజు చాపమీద కూర్చున్నాడు. కోజామీద చెయ్యి వేశాడు.

"మరేం గాభరాపడకమ్మా! అన్నయ్యా, అమ్మ వచ్చేస్తారు" అన్నాడతను.

ఇంటి బయట ఒక కానిస్టేబుల్ పచార్లు చేస్తున్నాడు.

"తిరిగొచ్చిందాకా యేమవుతుందో చెప్పలేం," అందామె.

"గుర్రాజు వస్తే పరిస్థితి మనకు తెలుస్తుంది. ఇంత సేపు యేం చేస్తున్నాడో!" అన్నాడు రామరాజు.

"నేను ఫోన్ చేసి కనుక్కొని వస్తా నాన్నా" అన్నాడు నరసింహరాజు.

"ఇంత రాత్రివేళ ఎవరూ రిసీవర్ ఎత్తరు" అన్నాడు రామరాజు.

"మనం రాత్రంతా యిలాగే వుండాలిగా! నాకో టీ కొట్టు తెలుసు. రాత్రీ పగలూ అది తెరిచే వుంటుంది. నే నక్కడికి వెళ్ళి హాట్ టీ తెస్తాను" అన్నాడు నరసింహరాజు.

"వెంటనే పట్రా" అన్నాడు తండ్రి.

నరసింహరాజు తన సైకిల్ మీద ఉషారుగా వెళ్ళిపోయాడు.

బయటనున్న కానిస్టేబుల్ ఒక కర్రను హాల్లోకి తెచ్చాడు.

"ఇది గడ్డిమొక్కల మధ్య పడుంది" అన్నాడు కానిస్టేబుల్.

"నన్ను పట్టుకున్నతని చేతిలో అటువంటి కర్ర వుంది" అంది రోజా.

ఆ కర్రను కానిస్టేబుల్ లతీఫ్‌కి యిచ్చి బయటకు పోయి మళ్ళా పచార్లు చేయసాగాడు.

సైకిల్ బెల్ మ్రోగింది. నరసింహరాజు రెండు ఫ్లాస్కులలో టీ తెచ్చాడు. అందరికీ గ్లాసుల్లో పోసి యిచ్చాడు.

"నువ్వు తాగరా!" అన్నాడు తండ్రి.

"నే నక్కడ వేడిగా రెండు కప్పుల టీ తాగేసి వచ్చాను" అన్నాడతను.

"కల్వర్ ఫెలో!" అన్నాడు శివరాజు.

ఇన్‌స్పెక్టర్ జీపు యింటిముందు ఆగింది. వెనుకనే వచ్చింది గురురాజు మోటర్ బైక్.

అందరూ బయటకు పరుగెత్తారు. రోజా ఇన్‌స్పెక్టర్ వంక ఆత్రంగా చూసింది.

"అమ్మా, అన్నయ్యా యెలా వున్నారు?" అర్చిం

దామె.

ఇన్‌స్పెక్టర్ నాయర్ ఆమె ముందుకు నడిచాడు.

"సారీ, మిస్ రోజా. ఐ హేవ్ బాడ్ న్యూస్!" అన్నాడతను.

"ఎంత బాడ్?"

"వెరీ వెరీ బాడ్! అన్నయ్య టాక్సీలోనే మరణించాడు. మీ అమ్మ హాస్పిటల్లో మరణించింది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

రోజా ఏడ్వలేదు. ఏడ్వడానికి ఆమె కళ్ళల్లో నీళ్ళు లేవు. డబ్బుకోసం మనిషి మరో మనిషికి చేసే అన్యాయాన్ని ఆమె కళ్ళారా చూసింది. ఆమె హృదయం పాషాణం అయిపోయింది.

ముందు వరండామీద ఆమె అలాగే కూర్చుండి పోయింది.

"మిస్ రోజా, బి బ్రేవ్!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఈ లోకంలో తను ఒంటరిదై పోయింది. అమ్మ, అన్నయ్య క్షణంలో మరో లోకానికి యెగిరిపోయారు.

అదే రాత్రి ఎనిమిదింటికి భోజనాలు చేస్తూన్న సన్నివేశం ఆమెకు గుర్తుకొచ్చింది.

"బి.ఎ. పూర్తవగానే ఆమె ప్రేమించిన సాగర్‌కి యిచ్చి చెల్లి పెళ్ళి చేసేస్తానమ్మా. అందుకు కావలసిన డబ్బు కూడ బెడుతున్నాను. త్వరలో నా జాబ్ కన్‌ఫర్మ్ అవుతుంది. ఆటుపైన మనకు బెంగలేదు" అన్నాడు అన్నయ్య రామూ.

అన్నయ్య కలలన్నీ మట్టిలో కల్సిపోయాయి!

రామరాజు ఆమెను లేవదీసి చాపమీద కూర్చో బెట్టాడు.

"మిస్ రోజా, మేం వెళుతున్నాం. రేపు మళ్ళా వస్తాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

పోలీస్ జీపు వెళ్ళిపోయింది. మరోగంటలో తెల్లారుతుంది. మరో రోజు ఉదయిస్తుంది. బందిపోటు దొంగలు మళ్ళా యే యింటిమీదకో దాడి చేస్తారు!

ఇటువంటి ఆలోచనలు ఆమె మెదడులో తిరుగుతున్నాయి.

రామరాజు ఆమె చెయ్యి పట్టుకున్నాడు. "రోజా, మా యింట్లో వుండు. వెళ్దాం పద!" అన్నాడతను.

ఆమె నవ్వింది.

"రాజుగారూ, ఇటుపైన నాకే భయమూ లేదు. పోకూడనివన్నీ పోయాయి. ఇటుపైన దోచుకోడానికి నాలో యేమీ లేదు. చీకూచింతా లేకుండా యిటుపైన నేను యిక్కడే వుండగలను" అందామె.

"మేం వెళ్తాం. పొద్దుటే నేను కాఫీ పంపుతాను" అన్నాడతను.

"వెళ్ళండి. పొద్దుటే కాఫీ పంపకండి. నేను మెలకువగా లేకపోవచ్చు. ప్రశాంతంగా నిద్ర పోవాలనిపిస్తోంది, యీ లోకానికి దూరంగా!" అందామె.

రామరాజు, కొడుకులు వెళ్ళిపోయారు.

"తలుపు మూసుకో!" అన్నాడు రామరాజు అలవాటుమీద.

ముందు తలుపు ముక్కలై పడుంది. తలుపులు తెచ్చి వుండవలసిందే. మూయడం సాధ్యం కాదు.

ఆమె చాపమీద హాల్లో పడుకుంది.

కాస్సేపట్లో ఆమె గాఢ నిద్రలోకి జారిపోయింది.

వెనక తలుపులు తెరిచివున్నాయి. ఆమెకు భయం లేదు. రోజా హాయిగా నిద్రపోతోంది.

## 4

పత్రికలు లేకపోతే ప్రభుత్వం యెన్నో సంఘటనలను తుడిచిపారేస్తుంది. పత్రికల మూలంగా ప్రభుత్వం కళ్ళు తెరుచుకోవలసిన అవసరం ఏర్పడుతుంది.

బందిపోటు దొంగల దాడి గురించి "ఇండియన్ ఎక్స్ప్రెస్" మొదటి పేజీలో వివరంగా రాయబడింది. ఏకాంతంగా వున్న ఆ యింటి ఫోటో కూడా ముద్రించబడింది.

తమిళ దినపత్రికలు, తదితర పత్రికలు యీ దాడిని గురించి విశేషంగా రాశాయి.

తమిళనాడు రాష్ట్రమంతటా యీ దాడి గురించి ప్రజలకు తెలిసిపోయింది.

డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ నుంచి డి.ఎస్.పీల వరకూ అందరూ అక్కడకు వెళ్ళి మిస్ రోజాను కల్సుకున్నారు.

టి. వి. లో కూడా యీ దాడి గురించి న్యూస్‌లో చెప్పారు.

ప్రజలందరుకూ మిస్ రోజామీద సానుభూతి విశేషంగా యేర్పడింది.

రోజా హాల్లో చాపమీద కూర్చుని వుంది. అనేక పత్రికల విలేఖర్లు ఆమెను కల్సుకుని, మాట్లాడి పోతున్నారు.

ఆ రోజు శనివారం పొద్దుటే నాలుగు పోలీసువాన్లు అక్కడికొచ్చాయి. రెండువందలమంది సాయుధ పోలీసులు మిస్ రోజా యింటి సమీపంలో దిగారు.

"ఇదంతా యెందుకో?" అన్నాడు రామరాజు.

"పత్రికల్లో నా గురించి యెంతో రాశారుగా! చూడ లేనా వస్తున్నారేమో!" అంది మిస్ రోజా.

సరిగ్గా పదింటికి అంబాసిడర్ కారు యింటి ముందు ఆగింది. ముఖ్యమంత్రి ఎమ్.జి.ఆర్, ఆయన భార్య జానకి కారులోంచి దిగారు.

మిస్ రోజా ముందు వరండామీద నిలబడి వాళ్ళకు నమస్కరించింది.

ఎమ్.జి.ఆర్. ఆమెను ఆప్యాయంగా కౌగలించుకున్నారు.

"నీ దగ్గరవాళ్ళందర్నీ కోల్పోయినందుకు నేను చాలా విచారిస్తున్నాను" అన్నాడాయన.

ఆమె ఏడ్వలేదు. శూన్యంలోకి చూస్తున్నట్లు వాళ్ళ వంక చూసింది.

"ముఖ్యమంత్రి ఫండ్ లోంచి నీకు పదివేలు యిస్తాను. పైసా ఖర్చు లేకుండా నిన్ను ఎమ్.ఎ.దాకా చదివిస్తాను" అన్నారు ఎమ్.జి.ఆర్.

ఆయనవైపు ఆమె ప్రేమతో చూసింది. "చాలా థాంక్స్, సార్!" అందామె.

"ఇక్కడికి దగ్గరగా ఒక కొత్త పోలీసుస్టేషన్ పెడుతున్నాం. ఇటుపైన యిలాంటి దాడులు జరగవు" అన్నారు ఎం.జి.ఆర్.

"మీ ఆరోగ్యం యింకా బాగాలేదు. మీరు యింత దూరం నా కోసం వచ్చినందుకు నేను చాలా విచారిస్తున్నాను" అందామె.

"అలా అనకమ్మా! ఈ రాష్ట్రంలో అందరూ నాకు ఆప్తులే!" అన్నారు ఎమ్.జి.ఆర్.

"మీకు నా ధన్యవాదాలు, సార్!" అందామె.

ముఖ్యమంత్రి ఎం.జి.ఆర్, ఆయన భార్య జానకి అంబాసిడర్ కార్లో కూర్చున్నారు. పోలీసు ఆఫీసర్ తలుపు మూశాడు.

ముఖ్యమంత్రి కారు వెళ్ళిపోయింది. వేలాది ప్రజలు తమ యిళ్ళకు తరలిపోయారు.

రామరాజు ఆమెవైపు చూశాడు.

"ఇటుపైన నువ్వు యేం చేయదల్చారమ్మా?" అడిగాడు రామరాజు.

"నాకే తెలియదు సార్!" అందామె.

"ముఖ్యమంత్రి ఎం.జి.ఆర్. నీకు యెంతో చేస్తానన్నారు!"

మిస్ రోజా వ్యంగ్యంగా నవ్వింది.

"రోజా, అయిందేదో అయిపోయింది. అదంతా విధి. ఎవ్వరూ ఆపలేరు. నువ్వు యిప్పుడు నీ భవిష్యత్తు కోసం పాటుపడాలి" అన్నాడు రామరాజు.

"చూద్దాం" అంది రోజా.

"నువ్వు క్షేమంగా వుండాలమ్మా, యెల్లప్పుడూ" అన్నాడు రామరాజు.

# 5

రోజా పార్కులో సాగర్ని కల్సుకుంది. ఇద్దరూ సిమెంట్ సోఫామీద పక్క పక్కనే కూర్చున్నారు.

"జరిగిన దానికి నేను చాలా విచారిస్తున్నాను" అన్నాడు సాగర్.

ఆమె కళ్ళమ్మట నీళ్ళు జలజల కారాయి.

"సాగర్! మన పెళ్ళి విషయం ఏమంటావు?" అడిగిందామె.

ఆమెవంక సాగర్ నవ్వుతూ చూశాడు.

"ఆ బందిపోటు దొంగ యెవరో నిన్ను రేప్ చేశాడని పత్రిక లన్నిటిలో వచ్చింది. అమ్మా, నాన్నా పత్రికలన్నీ చదువుతారు. ఇంత జరిగాక వాళ్ళు మన పెళ్ళికి ఒప్పుకోరు" అన్నాడతను.

"వాళ్ళ విషయం వదిలేయి. నువ్వు ఒప్పుకుంటావా?" ప్రశ్నించిందామె.

సాగర్ జవాబివ్వలేదు. ఇటూ, అటూ చూస్తూ వుండిపోయాడు.

"చెప్పు సాగర్!" అందామె.

"ఏం చెప్పమంటావు?" అడిగాడతను.

"నన్ను ప్రేమిస్తున్నావా? నన్ను పెళ్ళాడ్తావా?" అడిగిందామె.

సాగర్ సిగరెట్ వెలిగించాడు. పొగను పీల్చి ఆమెవైపు వదిలాడు.

"రోజా, నీ శీలం పోయింది. నిన్ను నేనెలా పెళ్ళాడగలను?" అన్నాడతను.

"నన్ను బంధించి యెవరో నా శీలాన్ని దోచుకుపోతే బాధ్యత నా దెలా అవుతుంది, సాగర్?" అందామె.

సాగర్ వ్యంగ్యంగా నవ్వాడు.

"పాడయిపోయిన యువతికి భర్త అవడం నా కిష్టం లేదు" అన్నాడతను.

ఆమె సోఫాలోంచి లేచి నిలబడింది.

"సాగర్, యీ లోకంలో నా కెవ్వరూ లేరు. నువ్వే నన్ను అర్థం చేసుకుని, నా వాడిగా వుంటావని ఆశించాను. అదంతా కల్ల అయింది" అందామె.

"మనం అనుకున్నవిధంగా జీవితం సాగదు, రోజా!" అన్నాడతను.

"అది యిప్పుడే తెల్సుకున్నాను. జీవితం యెలా వెళ్తుందో అలాగే వెళ్దాం" అందామె.

అక్కడినించి ఆమె వడివడిగా నడిచి వెళ్ళిపోయింది. సాగర్ ఆమె వెనక నే వచ్చాడు. "రోజా నీ తల్లి నీ కోసం దాచిన బంగారం పోయింది. నీకు బాగా నగలు ఉంటే గాని నా తలిదండ్రులు ఒప్పుకోరు" అన్నాడతను.

ఆమె అతడివైపు హీనంగా చూసింది. "సాగర్! నీకు వెన్నెముక లేదు. ఏదీ నువ్వు ధైర్యంగా చెయ్య లేవు! ఫో! నీ ముఖాన్ని నాకు మళ్ళా చూపించకు!" అర్చిందామె.

సాగర్ అలాగే నిలబడిపోయాడు. ఆమె వేగంగా బయటకు వెళ్ళిపోయింది. ఆమె ఆటోలో యెక్కింది. మరుక్షణంలో ఆటో కదిలింది,

సాగర్ మెల్లిగా పార్కులోంచి బయటకు నడిచాడు.

# 6

వారం గడిచిపోయింది. రోజా మెల్లిగా ఇన్ స్పెక్టర్ నాయర్ ఆఫీసు గదిలోకి నడిచింది.

"మిస్ రోజా, కూర్చోండి!" అన్నాడతను.

ముఖ్యమంత్రి ఆమెను యింటికెళ్ళి ఓదార్చడం మూలంగా, పత్రికల ప్రచారం వలన ఆమెను చూడగానే ప్రభుత్వ వుద్యోగులు గౌరవించడం ప్రారంభించారు.

"ఇన్ స్పెక్టర్, యేదేనా తెలిసిందా?" అడిగిందామె.

"వాళ్ళు మద్రాసు పట్నంలో యెక్కడో దాక్కుని

వుండాలి. బయటకు పోవడం సాధ్యం కాదు. రైల్వే స్టేషన్లలో, బస్సు డిపోల దగ్గర మా పోలీసులు వున్నారు."

"టూరిస్టు టాక్సీలలో వాళ్ళు పోవచ్చుగా?" ప్రశ్నించిందామె.

"వాటిని కూడా మేం సోదా చేస్తున్నాం."

ఒక కానిస్టేబుల్ టీ తెచ్చి కప్పులను టేబుల్ మీద పెట్టాడు.

"తీసుకోండి" అన్నాడు ఇన్స్పెక్టర్.

"ఆ నగలు యింకా యెక్కడా అమ్ముబడలేదా?"

"మిస్ రోజా, పాన్ షాపులలోకి రాలేదు. అన్ని పాను షాపులకూ హెచ్చరిక పంపాం. నగల వ్యాపారస్థు లందర్నీ హెచ్చరించాము. కొంతకాలంపాటు వాళ్ళు గమ్మున వుంటారు. తర్వాత మరో యింటిమీదకు దాడి చేస్తారు" అన్నాడు ఇన్స్పెక్టర్.

ఆమె తృళ్ళిపడింది.

"మళ్ళా మరో యువతి రేప్ చేయబడ్తుందా? ఇన్స్పెక్టర్, మీరు అది జరగకుండా ఆపాలి!" అందామె.

"మిస్ రోజా, ఈ ఫైల్లో మరాఠీ ముఠా గురించి యెన్నో వివరాలు వున్నాయి. ఇప్పటికప్పుడే వాళ్ళు అనేక రాష్ట్రాల్లో నూరుదోపిడీలకు పైన సాగించారు. ఆ ముఠాలో 24 మంది వున్నారని తెలుస్తోంది. కాని దాడి చేసినపుడు పదిమంది లోపున వెళ్తారని రిపోర్టుల్లో వుంది. ఈ ముఠాకు నాయకుడు సుబోకర్. అతడు పూనా జైలు లోంచి పారిపోయిన నేరస్థుడు. అతడి ఫోటో మాత్రం వుంది. చూస్తారా?"

ఫైలులోంచి ఒక ఫోటోను తీసి ఇన్‌స్పెక్టర్ ఆమె కిచ్చాడు.

సుఖోకర్ మనిషిలా లేడు. కిరాతకుడిలా వున్నాడు. చిన్న కళ్ళు, గుబురుగా పెరిగిన మీసాలు, వెడల్పయిన పెదిమలు.

ఆమె ఫోటోను ఇన్‌స్పెక్టర్‌కి యిచ్చేసింది.

"పూనా జైలు రికార్డులనుంచి యీ ఫోటో మాకు అందింది. ఈ ముఠా మనుషులు యిళ్ళమీదకు దాడి చేసినపుడు తెలుగు, అరవం, హిందీ భాషల్లో మాట్లాడుతారు. వాళ్ళు మరాఠీ భాషలో యెప్పుడూ మాట్లాడరు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

"మీరు నాకు చాలా విషయాలు చెప్పారు" అని లేచిందామె.

ఇన్‌స్పెక్టర్ నాయర్ ఆమెకేసి సానుభూతితో చూశాడు.

"ఇటుపైన మీరు యేం చేయదల్చారు?"

"చెప్పలేను. అంతా అగమ్యగోచరంగా వుంది" అందామె.

"బి.ఏ. పూర్తిచేయండి."

"ప్రస్తుత పరిస్థితుల్లో చదవలేను. కాలేజికి వెళ్ళడం వృధా అనిపిస్తోంది."

"బి.ఏ. పూర్తిచేశాక ప్రభుత్వం మీకు యేదో ఉద్యోగం యిస్తుంది" అన్నాడు నాయర్.

ఆమె తీయగా నవ్వింది. బుగ్గలమీద సొట్టలు పడి అదృశ్యమయ్యాయి.

ఇంత అందమైన యువతి జీవితాన్ని ఆ బందిపోటు నాశనం చేశాడు, అనుకున్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్

తనలో తాను.

"ప్రభుత్వం సానుభూతిమీద శాశ్వతంగా బతకడం నా కిష్టంలేదు. విధి నన్ను ఒంటరిదాన్ని చేసింది. అయినా నేను చదువుకున్న యువతిని. ఏదో పని చేసుకొంటూ బతికితే బాగుంటుంది" అందామె.

"గుడ్ లక్!"

అతడికి నమస్కరించి రోజా బయటకు నడిచింది. శేవ మొంటమ్మట వేగంగా అడుగులేసి బస్టేండులో నిల బడింది. పదినిమిషాలు దాటినా బస్సు రాలేదు.

రోడ్డమ్మట పోతున్న కారు ఆగి వెనక్కి వచ్చింది. ఒక యువకుడు ఆమెవంక నవ్వుతూ చూశాడు.

"ఎక్కండి. కావలసినచోట దింపుతాను" అన్నా డతను.

"నేను చాలాదూరం వెళ్ళాలి" అందామె.

"టాంక్‌లో కావలసినంత పెట్రోలు వుంది!"

తలుపు తెర్చి ముందుసీటుమీద కూర్చుంది.

తలుపును మూసింది. అతను కారును ముందుకు పోనిచ్చాడు.

రోడ్డమ్మట కారు కదుల్తోంది. ఓరగా అతడు ఆమె వైపు చూశాడు.

"మిమ్మల్ని యెక్కడో చూసినట్లు అనిపిస్తోంది" అన్నాడతను.

"బస్టేండ్లో నిలబడి వున్నప్పుడు చూశారేమో!" అందామె.

"కాదు. మరెక్కడో!"

"జ్ఞాపకం తెచ్చుకోండి."

"మీరు సినిమా స్టారా?"

"అలా కనిపిస్తున్నానా?" యెదురు ప్రశ్న వేసిందామె.

"యూ ఆర్ బ్యూటిఫుల్" అన్నాడతను.

"థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్."

"హోటల్ కెళ్ళి కాఫీ తాగుదామా?"

అతడివైపు ఆమె సూటిగా చూసింది. నల్లగా వున్నాడు. ఖరీదైన దుస్తులు ధరించాడు. చేతికి ఆటోమేటిక్ సీకో వాచ్ వుంది. అతడి వయస్సు 27 లోపున వుండొచ్చు.

"నన్ను హోటల్ కి రమ్మనడంలో మీ ఉద్దేశం యేమిటి?" అడిగిందామె.

"కాఫీ తాగుతూ మీతో కాస్సేపు కబుర్లు చెపొచ్చు" అన్నాడతను.

"ఆ కబుర్లు యిక్కడే చెప్పండి వింటాను" అందామె.

అతడు కింగ్ సైజు సిగరెట్ వెలిగించాడు.

పొగ పీల్చివదిలి ఆమెకేసి ఓరగా చూశాడు.

"ఇప్పుడు గుర్తొచ్చింది. మీ ఫోటో పత్రికల్లో చూశాను. వెరీ శాడ్ స్టోరీ! వెంటనే వెళ్ళి ఆ బందిపోటు దొంగలను షూట్ చేయాలనిపించింది" అన్నాడతను.

"ఆ కథ చదివి మీలా యెందరో అలా అనుకొని వుంటారు. కాని వాళ్ళను చంపడం అంత సులువైన పని కాదు. వారం రోజులనుంచి పోలీసులు వాళ్ళకోసం వెతుకుతున్నారు. యెక్కడా వాళ్ళు కనబడలేదు" అందామె.

"దొంగలు సహజంగా జాగ్రత్తబడ్తారు" అన్నా

టతను.

మెల్లిగా అతడామె చెయ్యి పట్టుకున్నాడు.

"ఆ బందిపోటు రాస్కెల్ మీతో అమానుషంగా ప్రవర్తించి వుండాలి. మీరు నాతో స్నేహంగా వుండండి. మనం మహాబలిపురం వెళ్దాం. హాయిగా అక్కడ మనం కాలం గడపొచ్చు. మిమ్మల్ని కాశ్మీర్ కూడా తీసుకు వెళ్తాను. నాన్నకు ఎన్నో ఫాక్టరీలు వున్నాయి. చాలా డబ్బుంది."

అతడు ఆగాడు. ఆమె చెయ్యిని మెల్లిగా నిమిరాడు.

"మీకు పెళ్ళయిందా?"

"ఎప్పుడో అయింది. నా భార్య యిల్లు విడిచి బయటకు రాదు. అది చదువుకోలేదు. ఆమె మనకు అడ్డురాదు" అన్నాడతను.

"కారు ఆపండి" అరిచిందామె.

టక్కున బ్రేకు నొక్కాడతను. కిందకు దిగి ఆమె తలుపు మూసింది.

"మీ కోర్కెకు అడ్డువచ్చేది నేను! వెళ్ళండి" అని ఆమె వేగంగా వెళ్ళిపోయింది.

## 7

ముఖ్యమంత్రి డబ్బు ఆమెకు అందింది. అన్నయ్యరామూ పనిచేసే కంపెనీ ఆమెకు ఐదు వేలు యిచ్చింది. దానధర్మాలు చేసే కొన్ని సంస్థలనుంచి ఆమెకు యిరవై వేలు వచ్చింది.

రాజాజీ నగర్‌లో వున్న ఒక ఫ్లాట్‌కి రోజా మారిపోయింది. కొంత డబ్బును తన సేవింగ్స్ బ్యాంక్ అకౌంటులో వుంచుకుని తలిమ్మా డబ్బును బ్యాంక్‌లో వడ్డీకి

డిపాజిట్ చేసింది.

రామ్‌లాల్ బట్టల షాపులో ఆమె ఉద్యోగానికి చేరింది. నాలుగు రోజులు పనిచేసి ఆ ఉద్యోగం మానేసింది. మరో ఇంజనీరింగ్ కంపెనీలో గుమస్తాగా చేరింది.

వారానికి ఐదు రోజులు మాత్రం ఆమె పనిచేయాలి. శని, ఆదివారాలు శెలవు రోజులు. ఈ ఉద్యోగం ఆమెకు నచ్చింది. కంపెనీ యజమాని కేమ్‌చంద్ 60 యేళ్ళ వృద్ధుడు,

తనకంతగా పనివుండేదికాదు. బిల్లులు రాయడం, వాటిని లెడ్జరులో యెక్కించడం!

పొద్దుటే వెళ్ళి రోజా కరాటే నేర్చుకోడం ప్రారంభించింది. శనివారం నాడు రైఫిల్ క్లబ్‌కి వెళ్ళి ఆమె షూటింగ్ నేర్చుకునేది.

ఈనాటి ప్రపంచంలో బ్రతకడానికి యీ విద్యలన్నీ రావాలి. షూటింగ్ నేర్చుకునే సమయంలో ఆమెకు రామ్‌తో పరిచయమైంది.

రామ్ వయస్సు యిరవై ఆరు వుంటుంది. పొడుగ్గా, సన్నగా వుంటాడతను. మోటర్ బైక్ మీద క్లబ్‌కి వచ్చి వెళ్తూవుంటాడు.

ఒకరోజున రామ్, రోజా పక్కపక్కనే నిలబడి టార్గెట్ వైపు షూట్ చేశారు. అతడి షూటింగ్ చూసి ఆమె నవ్వాపుకోలేకపోయింది.

ఆమెను యేమీ అనలేక అతడు షూటింగ్ మాని దూరంగా వెళ్ళి ఒక చెట్టుకింద నిలబడ్డాడు.

అలా అతడు వెళ్ళిపోయినందుకు ఆమె లోలోపల బాధపడింది. తర్వాత చెట్టుకిందకు ఆమె నడిచింది.

"నవ్వినందుకు మీరు నన్ను క్షమించండి!" అందామె.

"ఆడవాళ్ళకు నేను చులకనై పోయాను!" అన్నాడతను.

"మీరు అలా అనుకోకండి. నేనెవర్నీ చులకనగా చూడను. షూట్ చేయగానే మీరు వెనక్కి వంగడం చూస్తే నాకు నవ్వొచ్చింది. వయస్సులో చిన్నదాన్ని అవడంవలన నవ్వును ఆపుకోలేక పోయాను!"

"మీరు నవ్వితే బాగుంటుందిలెండి!" అన్నాడతను.

అతడివంక ఆమె నవ్వుతూ చూసింది. రామ్‌లో ఏదో అమాయకత్వం వుంది. అది ఎదుటి వాళ్ళను బాగా ఆకర్షిస్తుంది.

"నా రహస్యం మీకు తెలిసి నవ్వుతున్నారనుకున్నాను" అన్నాడు రామ్.

"ఏమిటా రహస్యం?"

"తెలుసుకోడం మంచిదికాదులెండి!"

"అదేదో తెలిస్తేగాని నాకు నిద్రపట్టదు. చెప్పండి. నేనెవ్వరికీ చెప్పను" అందామె.

"దాన్ని గురించి మీరు వినకూడదు."

"చెవులు మూసుకున్నాను చెప్పండి" అందామె నవ్వుతూ.

"మీ దగ్గర రహస్యాలు దాచడం కష్టం. ఆరునెలల క్రితం నాకు పెళ్ళయింది. పెళ్ళయిన మూడునెలలకు నా భార్య నన్ను వదిలేసి వెళ్ళిపోయింది."

ఆశ్చర్యంగా అతడివైపు చూసింది రోజా.

"ఎందువలన?"

"నాలో యే లోపం లేదు. నేనామెను ఎంతో బాగా చూసేవాడిని. ఆమె మరెవర్నో ప్రేమించిందట. అతడు

లేకుండా ఆమె జీవించలేదట!"

"ఎవరతను?"

"లేడీస్ టైలర్ కామరాజు. అతడామెకు జాకెట్లు కుట్టేవాడు. కొలతలు స్వయంగా తీసుకోనిచ్చేదామె. అలా యిద్దరికీ స్నేహమయింది. పెళ్ళికిముందే ఆమె కామరాజుకు తన సర్వస్వాన్నీ ఇచ్చేసిందట."

"ఆమె మిమ్మల్ని యెందుకు పెళ్ళాడింది?"

"తల్లిదండ్రులు కోరి కోరి పెళ్ళిచేశారంటుంది. కామరాజు శరీరం తనకిచ్చే ఆనందాన్ని మరెవరూ తనకు యివ్వలేరంటుంది."

"మీరు ఏం చేయదల్చారు?"

"డైవర్సుకోసం అప్లయిచేయాలి. అదే మంచిదని ఆమె సలహా. ఆమె కామరాజును పెళ్లాడుతుంది."

"మీరు మరేమీ అనుకోకపోతే ఆమె ఎక్కడుందో చెప్పండి. నేనొకసారి ఆమెతో మాట్లాడతాను" అంది రోజా.

"ఆమె పుట్టింట్లో వుంటోంది. వెళ్ళి కామరాజును కల్సుకుంటూ వుంటుంది. ఆమెతో మీరు మాట్లాడ్డం వేస్టు ఆఫ్ టైమ్. మీరు ఏం చెప్పినా ఆమె వినే స్థితిలో లేదు. కామరాజు తప్ప మరెవ్వరూ ఆమె కళ్ళకు కనబడ్డంలేదు" అన్నాడతను.

కొంతసేపు యిద్దరూ మౌనంగా వున్నారు.

"కాంటీన్‌కి వెళ్ళి కాఫీ తాగుదాం, రండి" అన్నాడతను.

ఇద్దరూ క్లబ్ కాంటీన్‌కు వెళ్ళారు. పక్క పక్కనే కుర్చీలో కూర్చున్నారు. రామ్ స్వీట్స్, దోసెలు కాఫీ ఆర్డరిచ్చాడు.

ఇద్దరూ జాంగ్రీ తిన్నారు. వేడిగా వచ్చిన దోసెలుతిని కాఫీ తాగారు.

"మీరు ఏం చేస్తున్నారు?" అడిగిందామె.

"నేను బి.యీ. పాసయ్యాను. ఒక కంపెనీలో ఇంజనీర్ గా వున్నాను."

రామ్ బిల్లు చెల్లించాడు. ఇద్దరూ బయటకు నడిచారు. చీకటిపడింది. లైట్లు వెల్గుతున్నాయి.

"మీరు నాతో రండి. మీ యింటిముందు దింపేస్తాను" అన్నాడతను.

అతడు మోటర్ బైక్ని స్టార్టుచేసి ఎక్కాడు. ఆమె వెనక నే కూర్చుంది. అతడు మోటర్ బైక్ని పోనిచ్చాడు.

రామ్ జాగ్రత్తగా మోటర్ బైక్ని నడుపుతాడని ఆమె గ్రహించింది.

"బీచ్ కి వెళ్దామా?" అడిగాడతను.

"ఎక్కువసేపు కూర్చోవద్దు" అందామె.

"మీ యిష్టప్రకారం చేద్దాం" అన్నాడు రామ్.

# 8

మోటర్ బైక్ను అతడు బీచ్ లోపల రోడ్డుమీద ఆపాడు. ఇద్దరూ కిందకు దిగారు.

ఇసుకలో యిద్దరూ సముద్రంవైపు నడిచారు. సముద్ర కెరటాలు హోరు చేస్తూ ముందుకొచ్చి, నురగలు కక్కుతూ, వెనక్కుపోతున్నాయి.

ఒక పడవ పక్కనే యిద్దరూ కూర్చున్నారు. రామ్ ఆమె వంక నవ్వుతూ చూశాడు.

"మిమ్మల్ని చూస్తూంటే నాకు ఆనందంగా వుంది. నాకు సంభవించిన అనుభవం మూలంగా నాలో నాకు నమ్మకం పోయింది. గత మూడు నెలల నుంచీ పిచ్చాడిలా

మోటర్ సైకిల్ మీద తిరుగుతున్నాను. ఒక సైలర్ కోసం నా భార్య నన్ను వదిలి వెళ్ళిపోడం మానని గాయంగా పరిణమించింది. నాలో యేదో లోపం వుందని కొట్టుకు చచ్చేవాడిని."

అతడు ఆగాడు. సముద్రంవైపు చూశాడు. పెద్ద కెరటం దూసుకువచ్చింది. వాళ్ళు కూర్చున్న చోటుకు నీళ్ళు పాకుతూ వచ్చాయి. ఇద్దరూ కొంచెం వెనక్కి జరిగారు.

"మీ మూలంగా నామీద నాకు నమ్మకం ఏర్పడుతోంది" అన్నాడతను అమాయకంగా.

"మీలో యే లోపమూ లేదు. ఏదో లోపముందని వూహించుకోకండి. ధైర్యంగా వుండండి. మీ జీవితం బాగుపడుతుంది" అందామె.

"నా ఫ్లాట్ లో ఒంటరిగా వుండలేకపోతున్నాను."

"మీ కెవ్వరూ లేరా?"

"ఇద్దరు అన్నలున్నారు. పెద్దన్నయ్య నాగ్ పూర్ లో వున్నాడు. రెండో అన్నయ్య హైద్రాబాద్ లో వున్నాడు. అక్కయ్య కలకత్తాలో వుంది. అమ్మ యిక్కడకూ అక్కడకూ తిరుగుతూ వుంటుంది. నేను యిక్కడ ఒంటరిగా వుంటున్నాను."

"మీరు షూటింగ్ ఎందుకు నేర్చుకుంటున్నారు?" ప్రశ్నించిందామె.

"నిజం చెప్పనా?"

"చెప్పండి."

"జీవితంలో నాకు విరక్తి పుట్టుకొచ్చింది. నాకు మంచి జీతం వస్తోంది. అన్నీ వున్నాయి. కాని జీవితంలో నాకు ఆనందం లేదు. షూటింగ్ నేర్చుకున్నాక

యెప్పుడో ఒకనాడు పిస్టల్ని నా నుదురుపైపు తిప్పి కాల్చి నన్ను నేను చంపుకోవాలని నా ఆశ!"

"నా కథవింటే నేనెలా యింకా బతికున్నానా అని మీరు అంటారేమో!" అందామె.

"చెప్పండి! మీరు యేదీ నానుంచి దాచకూడదు!" అన్నాడతను.

"కొన్ని వారాలక్రితం బందిపోటు దొంగలు అక్బాయి నగర్ సమీపంలో వున్న ఒక యింటిమీదకు దాడి చేశారు. ఆ దాడిలో తల్లీ, కొడుకూ మరణించారు. చెల్లెల్ని ఒక బందిపోటు చెరచి వదిలేశాడు గుర్తుందా?"

"బాగా గుర్తుంది."

"ఆ చెల్లెల్ని నేనే. పేరు రోజా."

"నా పేరు రామ్" అన్నాడతను.

"ఇంతవరకూ మన పేర్లు తెలియకుండా యెన్నో విషయాలు మాట్లాడుకున్నాం" అందామె.

"మిస్ రోజా, మీరు బాగా నష్టబోయారు. మీ కథ విని నేను చాలా బాధపడుతున్నాను. మీరు ధైర్యం తెచ్చుకోండి. ఏ యువకుడినో పెళ్లాడితే మీ జీవితం బాగుపడుతుంది" అన్నాడతను.

ఆమె నవ్వింది.

"శీలం చెడిన యువతిని యెవరు పెళ్ళాడ్తారు?" అందామె.

"ఈ లోకంలో మరెందరు వున్నారో చెప్పలేను, కాని నేను పెళ్లాడ్తాను."

"ఒక బందిపోటు నన్ను చెరచిన విషయం మిమ్మల్ని బాధిస్తూ వుంటుంది!" అందామె.

"నేనలా బాధపడను. బలవంతంగా ఓ వ్యక్తి మీ

నుంచి యేదో తీసుకోటానికీ, యిష్టంగా మీరివ్వడానికీ తేడా వుంది. మొదటి దానిలో మీ బాధ్యత లేదు మీ తప్పు లేదు!" అన్నాడతను.

"చెప్పడం సులువు, చేసి చూపించడం కష్టం!" అందామె.

"నేను చేసి చూపించగలను" అన్నాడు రామ్.

తటాలున ఆమె అతడి చెయ్యి పట్టుకుని నిమిరింది.

"మీలో ఒక గొప్ప మనిషిని నేను చూస్తున్నాను" అందామె.

"మిస్ రోజా, క్రూరమృగాల మధ్య మసలి ప్రాణంతో మీరు బయటపడ్డారు. బందిపోటు దొంగలు అడవి జంతువుల్లాంటివారు. మీ ధైర్యాన్ని మెచ్చుకుంటున్నాను" అన్నాడతను.

# 9

ఇన్‌స్పెక్టర్ నాయర్ వైపు ఆమె నవ్వుతూ చూసింది.

"సుభోకర్ ఫోటోకి కాపీలు తీయించాను. మీ ఫైల్లో వున్నదంతా జాగ్రత్తగా చదివాను. సుభోకర్ రోజూ రమ్ తాగుతాడన్న విషయం నాకు వుపయోగపడ్తుంది" అందామె.

ఇన్‌స్పెక్టర్ నాయర్ ఆమెకేసి చూశాడు.

"మిస్ రోజా, వాళ్ళకోసం మీరు వేటాడ్డం ప్రమాదకరం. సుభోకర్ కిరాతకుడు. ఇద్దర్ని చంపి, హంతకుడిగా అతడు పూనా జైల్లో పడ్డాడు. ఎలాగో బయటపడగలిగాడు. శత్రువులను అతడు నాశనం చేస్తాడు!"

"ఇన్‌స్పెక్టర్, ఒకప్పుడు యింటిపట్టున పడుండే యువతిని. అనుభవం నన్ను మార్చింది. నా కంటో

ధైర్యాన్ని చేకూర్చింది. నేను కరాటే నేర్చుకున్నాను. నా దగ్గర పిస్టల్ వుంది. నన్ను నేను కాపాడుకో గలను. ఏదేనా అవసరమైతే మీరున్నారు" అందామె.

"గుడ్ లక్!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

ఆమె బయటకు నడిచింది. మోటర్ బైక్ పక్కనే నిలబడి వున్నాడు రామ్.

"పద" అందామె.

"ఎక్కడి కెళ్దాం?"

"ప్రతి వైన్ షాపుకీ మనం వెళ్ళాలి."

"థ్రిల్లింగ్!" అన్నాడతను.

అతడు మోటార్ బైక్‌ని పోనిచ్చాడు. వెనకనే రోజా కూర్చుని వుంది.

రాధికా వైన్స్ ముందు మోటారు బైక్ ఆగింది.

రోజా షాపు ముందుకు నడిచింది. షాపు మేనేజర్కి ఒక ఫోటోను యిచ్చింది.

"ఇతను రోజూ రమ్ తాగుతాడు. రమ్ కొనడానికి యిక్కడకు రావచ్చు. వస్తే గుర్తించండి. నేను రోజూ వస్తాను. నాతో మీరు చెప్పొచ్చు" అందామె.

"ఎవరితను? నేరస్తుడా?" అడిగాడు మేనేజర్.

"ఇతను నా బావ. అక్కయ్యను వదిలి యిక్కడకు వచ్చేశాడు. నాకు సహాయపడండి" అందామె.

"అలాగే చేస్తానమ్మా" అన్నాడు మేనేజర్.

అదే విధంగా 200 వందల షాపులకు వెళ్ళి ఆమె ఫోటోలు యిచ్చింది.

రాత్రి పదింటికి ఆమె గదిముందు రామ్ మోటర్ బైక్‌ని ఆపాడు. ఆమె దిగింది. అలసటతో కిందకు ఒరిగి పోయింది.

రామ్ తాళం తెరిచాడు. ఆమెను తీసుకెళ్ళి పరుపు మీద పడుకోబెట్టాడు.

ఆమె నీరసంగా అతడివైపు చూసింది.

ఫ్లాస్కు తీసుకుని అతడు బయటకు పరుగెత్తాడు. కాస్సేపట్లో తిరిగివచ్చాడు.

వేడి మాల్టోవా గ్లాసులో ఆమె కిచ్చాడు. ఆమె మెల్లిగా తాగింది.

"రామ్ నీకు చాలా శ్రమ కలిగిస్తున్నాను" అందామె.

"నీకోసం యేం చేసినా నాకు శ్రమగా కనిపించదు!" అన్నాడతను.

"వంట చేస్తాను. నువ్వు యిక్కడే భోజనం చేయాలి" అందామె.

"ఇద్దరం వంట చేద్దాం" అన్నాడతను.

"నీకు వంట తెలుసా?" అడిగిందామె.

"చిన్నప్పుడే నేర్చుకున్నాను. రోజూ నేను వండుకు తింటున్నాను" అన్నాడతను.

"యూ ఆర్ గ్రేట్" అందామె.

# 10

నుంగంబాకంలో వున్న మురుగన్ వైన్స్‌షాపు ముందు మోటర్ బైక్ ఆగింది.

ఆమె మేనేజర్‌తో మాట్లాడింది. "నిన్న ఒకతను వచ్చి ఐదు ఫుల్ బాటిల్స్ రమ్ కొన్నాడు. అతడు మీరిచ్చిన ఫోటోలోని మనిషిలాగే వున్నాడు" అన్నాడు మేనేజర్.

"అతడు మళ్ళా రావచ్చు" అందామె.

"రోజు విడిచి రోజు వస్తూ వుంటాడతను."

"రేపు యిక్కడ వుంటాను నేను" అందామె.

"అతడికి అనుమానం రాకుండా చూడండి. అనుమానం వస్తే మా వ్యాపారం దెబ్బతింటుంది" అన్నాడు మేనేజర్.

"డోంట్ బాదర్" అందామె.

మర్నాడు పొద్దుటే యెనిమిదింటికి వైన్ షాపు తెరిచారు. రామ్, రోజా అక్కడకు వెళ్ళారు. వైన్ షాపు సమీపంలో వాళ్ళు నిలబడ్డారు.

గంటలు దొర్లిపోయాయి. పన్నెండు దాటింది. యెవ్వరూ రాలేదు. మూడు దాటింది. టీ తాగి బన్నులు తిని వాళ్ళిద్దరూ అక్కడే కాపలా వున్నారు.

నాలుగున్నరకు ఒక ఆటో షాపుముందు ఆగింది. అతడు దిగాడు. ఐదు రమ్ బాటిల్స్ కొన్నాడు.

సందేహంలేదు. అతడే సుధాకర్!

అతడి పక్కన మరెవరో వున్నారు.

సధాకర్ పంచ కట్టుకున్నాడు. చొక్కామీద కోటు ధరించాడు.

రోజా పక్కనున్న రామ్ వైపు చూసింది.

"ఆ ఆటో యెక్కడికెళ్తుందో నువ్వు కనుక్కో!" అందామె.

సుధాకర్ కూడా వున్న మనిషి పెద్ద పాకెట్‌ను ఆటోలో పెట్టాడు. ఇద్దరూ కూర్చున్నారు. ఆటో వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది.

రామ్ ఆటో వెనకనే తన మోటర్ బైక్ మీద వెళ్ళాడు.

రోజా వైన్ షాపు ప్రాంతంలో తిరుగుతూ వుండిపోయింది. గంట తర్వాత రామ్ తిరిగివచ్చాడు.

"ఇల్లును చూశాను" అన్నాడతను.

"ఇల్లు ఎక్కడుంది?"

"రామకృష్ణ నగర్ లో."

"చాలా దూరం" అందామె.

"ఇంత దూరం వచ్చి అతడు రమ్ బాటిల్సు కొంటు న్నాడు" అన్నాడు రామ్.

"రామ్, మనం రేపు ఆ యింటికి వెళ్ళాలి" అందామె.

"వెళ్ళి ఏం చెయ్యాలి?"

"ప్రస్తుతం నేను చెప్పలేను. నేను ఆలోచించాలి. తర్వాత చెప్తాను" అందామె.

రామ్ ఆమె చెయ్యి పట్టుకొన్నాడు.

"మళ్ళా నీకు యేదేనా ప్రమాదం సంభవిస్తే నేను బతికుండను" అన్నాడతను.

"ఆలోచించే చేద్దాం" అందామె.

# 11

చిన్న యింటిముందు మారుతీ కారు ఆగింది. ఒక యువతి కార్లోంచి దిగింది. ఒక యువకుడు స్టీరింగ్ వీల్ వెనక కూర్చుని వున్నాడు.

ఆమె యింటి ముందుకు వెళ్ళి తలుపును తట్టింది. తలుపు తెరవబడింది.

సుబోకర్ ఆమెవైపు సూటిగా చూశాడు. ఆమె అందంగా వుంది. ఆమె మెళ్ళో వున్న నగలను చూసి అతడు ఆశ్చర్యపోయాడు.

వాటి విలువ కొన్ని లక్షలు వుండొచ్చు!

"ఏం కావాలి?" అడిగాడతను మరాఠీలో.

"రామలింగంగారి యిల్లు యిదేనా?" అందామె.

"ఆ పేరుతో యిక్కడెవరూ లేరు" అన్నాడతను.

"సారీ!" అని ఆమె వెళ్ళిపోయింది.

సుభాకర్ వెనుక నున్న తన సహచరుడు వంక చూశాడు.

"ఆమెను వెంటాడు. ఆమె యిల్లు యెక్కడుందో కనుక్కో" అన్నాడతను.

"యస్, బాస్!" అని అతడు బయటకు పరుగెత్తాడు.

మారుతీ కారు అప్పుడే కదుల్తోంది. మోపెడ్ మీద అతడు కారు వెనకనే వెళ్ళాడు. అరగంటపైన కారు వెళ్తూనే వుంది.

రామానగర్ కి సమీపంలో ఏకాంతంగా వున్న ఒక యింటి ముందు కారు ఆగింది.

మోపెడ్ లో వెంటాడే వ్యక్తి అంతా గుర్తించాడు. మోపెడ్ ని కారు పక్కనుంచి స్పీడుగా పోనిచ్చాడు.

అరగంటలో మోపెడ్ యిల్లు చేరుకుంది.

అతడు లోపలకు వెళ్ళాడు.

సుభాకర్ రమ్ తాగుతున్నాడు.

"బాస్, ఆమె యిల్లు మారుమూల నుంది. సమీపంలో యిళ్ళు లేవు" అన్నాడతను.

"గుడ్!" అన్నాడు సుభాకర్.

"అంత డబున్నవాళ్ళు ఆ మారుమూలన వుండడం విచిత్రంగా వుంది" అన్నాడతను.

"పెద్ద యిళ్ళలో వుంటే ఇన్ కమ్టాక్సువాళ్ళు దాడి చేస్తారు. అందుకని అటువంటి చిన్న యిళ్ళలో వాళ్ళు వుంటారు" అన్నాడు సుభాకర్.

సుభాకర్ కి యెదురుగా యిరవై మంది కూర్చుని వున్నారు. గ్లాసులోని రమ్ ని తాగి అతడు వాళ్ళవంక

చూశాడు.

"ఇంతవరకూ విశ్రాంతి తీసుకున్నాం. రేపు మనం ఆ యింటిమీద దాడి చేద్దాం. ఆ నగలన్నీ తీసుకొని మరో రాష్ట్రానికి వెళ్ళిపోదాం" అన్నాడతను.

"రెడీ బాస్!" అన్నాడొక యువకుడు.

"నాగూ, అమ్మాయిల వెనకపడొద్దని నిన్ను హెచ్చరిస్తున్నాను. క్రితంసారి ఆ అమ్మాయిని రేప్ చేశావు. అలా వద్దు జరగకూడదు. మనకు కావలసింది డబ్బు, ఆడవాళ్ళ శరీరాలు కాదు" అన్నాడతను.

"ఇటువైన చెయ్యను" అన్నాడు నాగూ.

"ఏం చెయ్యాలో రేపు మీకు వివరంగా చెప్తాను" అన్నాడు సుభోకర్.

# 12

రాత్రి పన్నెండు దాటింది. ముందు తలుపును కర్రలతో ఎవరో గట్టిగా కొడుతున్నారు.

ఆమె లేచింది. పక్కనున్న రామ్‌ని లేపింది. పరుగెత్తుకెళ్ళి టెలిఫోన్ రిసీవర్ ఎత్తింది. వైరు కత్తిరించబడ్డాయని ఆమె గ్రహించింది.

కిటికీలోంచి సమీపంలో వున్న రామానగర్ వైపు చూసింది. ఎదురుగా వున్న యింటి గదిలో లైటు వెల్గుతోంది!

డాక్టర్ కిషన్ యింకా నిద్రపోలేదు. తను కోరినట్లు మెలుకువగానే వున్నాడు.

టార్చి ఆన్ చేసి ఆమె డాక్టర్ కిషన్‌కి లైట్ సిగ్నల్ పంపింది. అటువైపు నుంచి లైట్ సిగ్నల్ ఆమెకొచ్చింది.

డాక్టర్ కిషన్ తన సిగ్నల్‌ను అందుకొన్నాడు.

తర్వాత చేయవలసినదంతా అతడు చేస్తాడు.

తలుపు పగులుతోంది. రామ్ శోభా పిస్టల్సు చేతి లోకి తీసుకొన్నారు.

"వెనక తలుపు తెరువు!" అందామె.

రామ్ తెరచాడు. ఎదురుగా ఒక మాస్కు మనిషి నిలబడి వున్నాడు.

అతడివైపు ఆమె రెండుసార్లు షూట్ చేసింది.

మాస్కు మనిషి భయపడుతూ వెనక్కు పడ్డాడు.

"చేతులెత్తు!" అరిచిందామె.

చేతులు యెత్తి అతడు నిలబడ్డాడు.

"మాస్కు తీసేయి!" అందామె.

అతను మాస్కును తీసేశాడు.

అతడి ముఖంవైపు ఆమె లైటు కాంతిలో చూసింది.

అతడే! ఆ నాడు తనని రేప్ చేసింది అతనే! ఆ నాడు అర చీకటిలో చూసిన అతడిముఖం ఆమెకు బాగా గుర్తుంది.

"ఎంతమంది యువతులను పాడుచేశావు?" అరిచిందామె.

అతను మాట్లాడలేదు.

"డర్టీ రాస్కెల్, నా అన్నను చంపావు! నన్ను బలాత్కరించావు అందుకు శిక్ష అనుభవించు!" అరిచిందామె.

ఆరుసార్లు అతడివంక షూట్ చేసింది. బుల్లెట్లు అతడి శరీరంలోకి జొచ్చుకుపోయాయి. రక్తంమడుగులో అతడు కిందపడ్డాడు.

రామ్, శోభా ముందు తలుపువైపు వెళ్ళారు. తలుపు విరిగి కిందపడింది.

అటువైపున్న వాళ్ళవైపు ఆమె రెండుసార్లు షూట్ చేసింది.

గాయపడి యిద్దరు నేలకూలారు. తతిమ్మావాళ్ళు వెనక్కు పరుగుత్తారు.

రామ్, రోజా బయటకు దూకారు.

ఇంటి ముందున్న ఐదారుగురు మనుషులు పారిపోవ డానికి ప్రయత్నిస్తున్నారు.

రామ్ పిస్టల్ భయంకరంగా మ్రోగింది.

"కదిలితే చస్తారు! చేతులెత్తి నిలబడండి!" అర్చింది రోజా.

ఐదుగురూ మాస్కులు ధరించారు.

"మాస్కులు తీసేయండి" అర్చిందామె. వాళ్ళు కద లేదు. రోజా పిస్టల్ పేలింది. భయంతో వాళ్ళు మాస్కు లను తీసేశారు.

వాళ్ళ మధ్యనున్న సుభోకర్ వంక ఆమె సూటిగా చూసింది.

"నువ్వు యిక్కడికొస్తావని నాకు తెలుసు. నిన్ను యిక్కడకు రప్పించడానికే అన్ని నగలతో నీ యింటి కొచ్చాను. మారుమూల నున్న ఈ యిల్లు తీసుకున్నాను. నిన్ను బోనులోకి నడిపించాను" అర్చిందామె.

తటాలున పోలీసుజీపు వచ్చి యింటిముందు ఆగింది. ఇన్‌స్పెక్టర్ నాయర్, కానిస్టేబుల్స్‌తో కిందకు దిగాడు.

"ఇన్‌స్పెక్టర్, సుభోకర్‌నీ, అతడి సహచరులనూ అరెస్టు చేయండి! మా ప్రాణాలు రక్షించుకోవడం కోసం కొందర్ని మేం షూట్ చేసి చంపవలసి వచ్చింది" అంది రోజా.

"మిస్ రోజా, డోంట్ బాదర్! వాళ్ళను చంపక పోతే, వాళ్ళు మిమ్మల్ని చంపుతారు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

"యూ ఆర్ రైట్" అన్నాడు రామ్.

బందిపోటు దొంగల చేతులకు ఇన్‌స్పెక్టర్ నాయర్ బేడీలు వేశాడు.

ముందు గుమ్మం ముందు పడున్న యిద్దర్నీ ఇన్‌స్పెక్టర్ పరీక్షించి వెనక్కి వెళ్ళాడు. అక్కడ పడున్న మనిషిని చూశాడు.

"మిస్ రోజా, కంగ్రాట్యులేషన్స్! మీ మూలంగా సుబోకర్ మరాఠీ ముఠా మాకు పట్టుబడింది" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయర్.

రామ్, రోజా నిద్ర పోయేసరికి మూడు దాటింది.

"ఇంకా యిక్కడెందుకు? పోదాం నా ఫ్లాట్ కి" అన్నాడు రామ్.

"ఇవాళ యిక్కడే పడుకుని పొద్దుటే పోదాం" అందామె.

"నీ కోర్కెలు తీర్చడమంటే నా కెంతో సరదా" అన్నాడు రామ్ ఆప్యాయంగా.

—:అ యి పో యిం ది:—

# రాధిక ప్రియుడు

మిస్ కె. మధుబాల

అడ్యార్ గేటు హోటల్లో అతడు గది తీసుకున్నాడు.

మేనేజర్ స్వయంగా వచ్చి అతడిని రూమ్ నంబరు 30 కి తీసుకు వెళ్ళాడు.

"గవర్రాజుగారూ, మా హోటల్లో మీకు అన్ని సౌకర్యాలూ లభిస్తాయి. ఏమైనా లోటుపాట్లుంటే నాతో ఫోన్లో చెప్పండి" అన్నాడు మేనేజర్.

గవర్రాజు నవ్వుతూ మేనేజర్ వంక చూశాడు.

"నీదాకా రావలసిన అవసరం వుండదు. నాకు కావలసింది నా కెప్పుడూ దొరుకుతుంది!" అన్నాడు గవర్రాజు సగర్వంగా.

తెల్లటి మీసాలు, తెల్లబడిన కనుబొమ్మలు, బుర్ర పై భాగంలో గుండ్రటి బట్టతల, కిందకు వేళ్ళాడుతున్న తెల్లటి వెంట్రుకలు, గవర్రాజును చూడగానే అతడిలో యేదో హోదా గోచరిస్తుంది.

60 ఏళ్ళ గవర్రాజు కోటీశ్వరుడు. అతనికి యెన్నో

కంపెనీలు వున్నాయి.

అతని వద్ద సెలవు తీసుకుని హోటల్ మేనేజర్ వెళ్ళి పోయాడు.

గవర్రాజు బటన్ నొక్కాడు. హోటల్ బేరర్ గదిలోకి వొచ్చాడు.

"డింపుల్ స్కాచ్ విస్కీ, సోడా పట్రా!" అన్నాడు గవర్రాజు.

బేరర్ వెళ్ళిపోయాడు. గవర్రాజు టైమ్ చూశాడు. ఐదు కావస్తోంది.

కాస్సేపట్లో బేరర్ వచ్చాడు. సోఫా ముందున్న చిన్న బల్లమీద విస్కీ బాటిల్నీ, గ్లాసులనూ పెట్టాడు. సోడాబుడ్లను కింద వుంచాడు.

"గ్లాసులో ఒక బడా పెగ్ పోసి, పైదాకా సోడా పొయ్యి" అన్నాడు గవర్రాజు.

అతడు చెప్పినట్టే చేశాడు బేరర్.

"ఐస్ క్యూబ్స్."

గదిలో వున్న రిఫ్రిజిరేటర్లోంచి ఐస్ క్యూబ్స్ తెచ్చి గ్లాసులో పడేశాడు.

"నీ పేరు?"

"ఆనందం, సార్."

"టు యువర్ హెల్తు!" అని గవర్రాజు తాగడం ప్రారంభించాడు.

"నేను వెళ్ళనా సార్?"

"వెళ్ళు!" అన్నాడతను.

గవర్రాజు ఆలోచిస్తూ విస్కీ సేవిస్తున్నాడు. హైద్రాబాద్ నుంచి అతడు ప్లేన్లో మద్రాసుకు వచ్చాడు. మద్రాసులో తను చేయవలసినవి యెన్నో పనులున్నాయి.

డబ్బుమీదకు అతడి ఆలోచనలు వెళ్ళాయి. ఎంత డబ్బున్నా మనిషికి యింకా డబ్బు కావాలి! ఈ డబ్బు చాలు, నా కొద్దు అనే మనిషి యీ లోకంలో వుండడు!

తలుపు బయట యేదో చప్పుడయింది.

"కమిన్!" అన్నాడు గవర్రాజు.

తలుపును తోసి ఒక యువతి నవ్వుతూ లోపలకు చూసింది.

"క్షమించండి. ఇది నా గదనుకొని పొరబడ్డాను. నాది పక్కగది!" అందామె.

"ప్లీజ్ కమిన్" అన్నాడతను.

ఆమె లోపలకు వచ్చింది. ఆమెవైపు అతడాశ్చర్యంగా చూశాడు. ఆమె అందాన్ని కవులు కూడా వర్ణించలేరు. మెళ్ళో చాలా ఖరీదైన నగలు, వజ్రాల కమ్మలు కనిపిస్తున్నాయి, ధనవంతురాల్లా వుంది.

"హలో! నా పేరు ఎం. జి. రాజు" అన్నాడతను.

"ఐ యామ్ మిస్ కుసుమ" అందామె.

"నీ నాన్నగారు బిజినెస్‌లో వున్నారనుకుంటాను...."

ఆమె తీయగా నవ్వింది.

"నేను బిజినెస్‌లో వున్నాను" అందామె.

"నువ్వు చేసే బిజినెస్ యేమిటి?"

ఆమె టైం చూసింది. తటాలున సోఫాలోంచి లేచింది.

"నన్ను క్షమించండి. ఒక ఫ్రెండ్ వస్తాడు. నేను నా గదికి వెళ్ళాలి. యూ ఆర్ ఆల్వేస్ వెల్‌కమ్ టు మై రూమ్!" అందామె.

"పక్క గదేగా, వస్తాను" అన్నాడతను.

ఆమె వయ్యారంగా నడుస్తూ వెళ్ళిపోయింది. ఆమె కట్టిన పట్టుచీర, ధరించిన నగలు, వాటి విలువ అంచనా వేస్తూ విస్కీ గ్లాసును అందుకున్నాడతను.

## 2

ఏర్ కండిషండ్ డైనింగ్ హాల్లో ఫ్లోరసెంట్ లైట్లు వెలుగుతున్నాయి. గవర్రాజు ఒంటరిగా ఒక కుర్చీలో కూర్చున్నాడు.

అతిడి టేబుల్ పక్కనుంచి ఆమె వెళ్తోంది. ఆమె వైపు నవ్వుతూ చూశాడు.

"నీతో స్నేహితులు లేకపోతే నువ్వు యిక్కడే కూర్చోవచ్చు" అన్నాడతను.

"ఐ విల్ బి డిలైటెడ్" అందామె.

ఎదురుగా కుర్చీలో కూర్చుంది. బేరర్ వచ్చాడు. మెనుకార్డు చూసి ఆమె ఆర్డరిచ్చింది.

"మరేమైనా మీకు కావలిస్తే చెప్పండి" అందామె.

"నువ్వు సరిగ్గా ఆర్డరిచ్చావు" అన్నాడు గవర్రాజు.

బేరర్ వెళ్ళిపోయాడు. హాల్లో వందమంది పైన డిన్నర్ సేవిస్తున్నారు.

"నీ బిజినెస్ గురించి చెప్పలేదు" గవర్రాజు ఆమెకు జ్ఞాపకం చేశాడు.

"అదంతా యిక్కడ చెప్పలేను."

"దగ్గరలో ఎవ్వరూ లేరు!"

"తర్వాత చెప్తాను" అందామె.

"నీదే వూరు?"

"బొంబే."

బేరర్ పదార్థాలు తెచ్చి టేబుల్ మీద పెట్టాడు. ఇద్దరూ తినడం ప్రారంభించారు. గవర్రాజు బాగా విస్కీ

సేవించి వుంటాడని ఆమె గ్రహించింది. అతడు నిషాలో వున్నట్లు ఆమె కనిపెట్టింది.

"మీ బిజినెస్ గురించి చెప్పండి" అందామె.

"ఈ ప్రాంతంలో ఎమ్.జి. రాజు పేరు తెలియని వాళ్ళుండరు. ఆంధ్రాలో నాకు షుగర్ మిల్సు, సిమెంట్ ఫ్యాక్టరీలు వున్నాయి. కోటీశ్వరుల లిస్టులో నా పేరు యెప్పుడో యెక్కింది" అన్నాడతను.

"కోటీశ్వరుడితో డిన్నర్ సేవిస్తున్నందుకు నేను సంతోషించాలి" అందామె.

"నీ అంత అందమైన యువతి నా ఎదురుగా కూర్చున్నందుకు నేను సంబరపడుతున్నాను" అన్నాడతను.

డిన్నర్ ముగిసింది. ఇద్దరూ డైనింగ్ హాల్లోంచి బయటకు నడిచారు. నడకమ్మాట నడుస్తున్నారు.

"బిల్ విషయం మర్చిపోయాను" అన్నాడు గజరాజు.

"డోంట్ బాదర్, నా అకౌంటులో వేయమని మొదటే చెప్పాను" అందామె.

30 గదిముందు అతడు ఆగాడు.

"రండి, నా గదికి వెళ్దాం" అందామె.

"పద" అన్నాడతను.

31 గది తాళం చెవిని ఆమె తిప్పింది. తలుపునుతోసి లోపలకు నడిచింది.

"ప్లీజ్, కమిన్!" అందామె.

గజరాజు లోపలకు వెళ్ళాడు. సోఫాలో కూర్చున్నాడు. సోఫాముందున్న టీపాయి మీద నోట్లకట్టలున్నాయి. పడివైపునున్న మంచంమీద నోట్లకట్టలున్నాయి. అన్నీ నూరురూపాయిలనోట్లు.

ఎక్కడబట్టే అక్కడ నోట్ల కట్టలు పడుండడం అతడికి ఆశ్చర్యంగా అనుపించింది.

"పక్కగదికూడా నాదే" అందామె.

"ఆ గదిలో ఎవరుంటారు?"

"ఈ గదిలోంచి ఆ గదిలోకి వెళ్ళొచ్చు. ఆ గదిని నా బిజినెస్‌కి వుపయోగపడుంది."

"నీ బిజినెస్ ఏమిటి?" అడిగాడతను మళ్ళా.

కుసుమ విచిత్రంగా నవ్వింది.

"మీలా నాకు ఫ్యాక్టరీలు లేవు. మిల్సు లేవు."

"అయితే యింత డబ్బు నీకెలా వస్తోంది?"

"కొన్ని కిటుకులు తెల్సుకుంటే ఎంత డబ్బైనా మన చేతుల్లో వుంటుంది."

"ఆ కిటుకులను గురించి చెప్తే వింటాను" అన్నాడు గవ్రాజు.

"ఎవ్వరితోటీ చెప్పనంటే, చెప్పనని హామీ యిస్తే మీకంతా విన్నవిస్తాను."

"నేనెవ్వరికీ చెప్పను" అన్నాడతను.

"నాతో రండి" అంది కుసుమ.

తలుపు తెర్చి పక్కగదిలోకి తీసుకువెళ్ళింది. ఆ గదిలో ఎవ్వరూ లేరు. ఒక గోడనుంచి మరో గోడకు తాళ్ళు కట్టబడి వున్నాయి. తాళ్ళమీద తడిగా వున్న నూరు రూపాయిల నోట్లు వేళ్ళాడుతున్నాయి. పైన ఫాన్ తిరుగుతోంది. గాలికి కిందపడకుండా ప్రతి నోట్‌కి క్లిప్ పెట్టబడి వుంది.

"ఈ నోట్లు ఎందుకు తడిసిపోయాయి?"

"ఒక ద్రవంలో ముంచి వాటిని ఆరేశాను. ఆరేక కట్టకట్టేయొచ్చు" అందామె.

"ఈ నోట్లు ఎలా వచ్చాయి?"

టైప్ మిషన్ లాంటి యంత్రం వైపు ఆమె చూపించింది.

"ఇది పోర్టబుల్ ప్రింటింగ్ యూనిట్. జపాన్‌లో తయారైంది. లోపల నూరు రూపాయిల నోటు షీట్లు వున్నాయి. ఈ బటన్ నొక్కితే ముద్రించబడిన నోట్లు బయటకు వస్తాయి. వాటిని ద్రవంలో ముంచి యిలా ఎండ బెట్టాలి" అందామె.

"ఇవన్నీ నకిలీ నోట్లా?"

ఆమె తలాడించింది.

"కాని ఎవ్వరూ నకిలీ అని తెల్సుకోలేరు."అందామె.

"ఇదంతా నువ్వు ఒంటరిగా చేస్తున్నావా?"

"నాతో పార్టనర్ వున్నాడు. అతడి సమర్థతవల నే నోట్లు యింత బాగా ముద్రించబడుతున్నాయి."

"ఎవరతను?"

"ప్రభుత్వం సెక్యూరిటీ ప్రెస్‌లో ఒకప్పుడు అతడు పనిచేసేవాడు. నోట్లను ముద్రించడమే అతడి పని. అతడికి రావలసిన ప్రమోషన్ రాలేదు. విసుగెత్తి అతడు రిజైన్ చేసేశాడు. కక్షతో అతడు ఈ నోట్లను ముద్రించడంలో నాకు సహాయపడుతున్నాడు" అందామె.

"ఈ మిషన్ మీద గంటకు యెన్ని నోట్లు ముద్రించ వచ్చు?"

"గంటకు వెయ్యినోట్లు ముద్రించవచ్చు" అందామె.

గవర్రాజు మెదడులో లెక్కలు రేసుగుర్రాల్లా పరు గెత్తాయి. గంటకు లక్ష! ఇరవై నాలుగ్గంటలు మిషన్ నడిస్తే 24 లక్షలు. నాలుగు రోజులు దాటి, మరో నాలు గ్గంటలు మిషన్ని నడిపితే కోటిరూపాయలు!

గవర్రాజు సిగరెట్ వెలిగించబోయాడు.

"ప్లీజ్, ఈ గదిలో కాల్చొద్దు. డేంజరస్" అందామె.

అతడు సిగరెట్‌ను కేసులో దాచేశాడు.

ఒక తాడుమీదున్న రెండు నోట్లను అతడు తీసుకున్నాడు. వాటిని ముట్టుకు చూసిందామె.

"ఆరిపోయాయి" అందామె.

"వీటిని నేను వుంచుకుంటాను" అన్నాడతను.

"వుంచుకోండి."

జేబులోంచి రెండువందరూపాయిల నోట్లనుతీసి అతడామె కిచ్చాడు.

"థాంక్స్. మీరు నాకిచ్చిన హామీ మర్చిపోకండి. ఆ చిన్న యంత్రం మూలంగా నేనూ, నా పార్ట్నరూ చేరో ఐదులోట్లు గడించేశాం."

గవ్రాజు తృప్తిపడ్డాడు.

"ఈ నోట్లు నాకు యే రేటున అమ్ముతారు?"

"మొదట్లో అమ్మాలనుకున్నాం. ఇప్పుడా అవసరం లేదు. బాంకివాళ్ళు యీ నోట్లను సందేహించకుండా తీసుకుంటున్నారు" అందామె.

తన చేతిలో వున్న నోట్లను అతడు మరోసారి పరీక్షించాడు.

"అసలు నోట్లలా ముద్రించబడ్డాయి" అన్నాడతను.

"అదంతా ఆ మిషన్ ప్రభావం. మిషన్‌లో నా పార్ట్నర్ తయారుచేసిన ప్లేట్లు వున్నాయి" అందామె.

అతడామె వంక నవ్వుతూ చూశాడు.

"రేపు రాత్రి యిదే టైములో నిన్ను కాల్చుకుంటాను" అన్నాడు గవ్రాజు.

"వెల్‌కమ్" అందామె.

# 3

మర్నాడు గవర్రాజు చాలా బిజీగా వున్నాడు.

బెల్ నొక్కాడు. బేరర్ రాగానే తన జేబులోని నకిలీ వందరూపాయల నోటు యిచ్చి ఒక గోల్డ్‌ఫ్లేక్ కింగ్స్ పాకెట్ తెమ్మన్నాడు.

బేరర్ నోటును తీసుకొని వెళ్ళిపోయాడు. కాసేపట్లో తిరిగి వచ్చాడు. ఒక్క పాకెట్‌ను అతడికిచ్చి, తతిమ్మా డబ్బంతా యిచ్చాడు.

నకిలీ నోటు వెంటనే చెల్లిపోయింది. ఆమె చెప్పినది నిజమే!

పది దాటాక అతడు మరో నోటును బ్యాంకికి పంపాడు, హోటల్ గుమస్తా ద్వారా.

"ఈ నోటు మా హోటల్‌కి వచ్చింది. తీసుకో వచ్చా?" అడిగాడు గుమస్తా.

బ్యాంకి ఆఫీసర్ నవ్వాడు.

"ఈ నోటు తీసుకోడానికి నువ్వు సంశయిస్తే నువ్వు హోటల్ మూసేయాలి. ప్రభుత్వం నోట్లన్నీ యిలాగే వుంటాయి" అన్నాడతను.

వెనక్కి తిరిగొచ్చి అదంతా హోటల్ గుమస్తా గవర్రాజుకు చెప్పాడు.

గవర్రాజు ఆనందంగా సిగరెట్ వెలిగించాడు. పొగ వదుల్తూ ఆలోచించసాగాడు. ఆ మిషన్ తను కొనాలి. ఏ నూరుకోట్లో ముద్రించి తను అందరికంటె ధనవంతుడు కావాలి!

ఆమె అమ్ముతుందో లేదో! అమ్మనంటే ఆమెను భయపెట్టాలి! తనకు డబ్బు కావాలి!

రాత్రి పదింటికి గవర్రాజు ఆమె గదికి వెళ్ళాడు.

నడవలో ఎవ్వరూ లేరు. మెల్లి గా తలుపుమీద తట్టాడు.

ఆమె తలుపు తెర్చింది. లోపలకు వెళ్ళి అతను సోఫాలో కూర్చున్నాడు. తలుపు మూసి ఆమె లాక్ చేసింది.

"చెప్పండి" అందామె నవ్వుతూ.

"ఆ మిషన్ జపాన్‌లో దొరుకుతుందా?"

ఆమె నవ్వింది.

"నా పార్ట్నర్ జపాన్ వెళ్ళి ఆ మిషన్ చేయించాడు. అటువంటి మిషన్ యీ లోకంలో ఒక్కటే వుంది.

ఆమెవంక సూటిగా చూశాడతను.

"అది నాకు అమ్ము" అన్నాడతను.

"సారీ" అందామె.

అతడు స్కాచ్ విస్కీ బాగా సేవించి డిన్నర్ పూర్తి చేశాడు.

"కుసుమా, నేను తల్చుకుంటే నీ బిజినస్ నాశనమవుతుంది" బెదిరించాడతను.

"ప్లీజ్ అటువంటిదేదీ చెయ్యకండి. మీరు హామీ యిచ్చారు. మర్చిపోకండి!" అందామె.

"ఆ మిషన్ నా కమ్మెయి. నీ గురించి ఎక్కడా చెప్పను" అన్నాడతను.

"ఆ మిషన్ పోతే నాకు బతకడానికి ఆధారం వుండదు. మీరు 50 లక్షలు యిస్తే ఆ మిషన్ యిచ్చేస్తాను" అందామె.

"ఎక్కువ అడుగుతున్నావు!"

"రెండు రోజుల్లో మీరా డబ్బు ముద్రించుకోవచ్చు" అందామె.

"ఆ డబ్బు నీకెలా కావాలి?"

"రొక్కంగా" అందామె.

"రేపు రాత్రి యిదే టైముకు నేను వస్తాను. రొక్కంతో" అన్నాడు గవర్రాజు.

"రండి" అందామె.

"మిషన్ని పాక్ చేసి వుంచు. నేను హైద్రాబాద్ కు పట్టుకుపోతాను. నాకక్కడ చాలా పెద్ద భవనం వుంది" అన్నాడతను.

"పాకింగ్ మీరే చేసుకోవాలి" అందామె.

"రేపు మాట్లాడుదాం" అన్నాడతను.

తలుపుదాకా వెళ్ళి ఆమె అతడికి సెండాఫ్ ఇచ్చింది.

"ఇవాళ రాత్రి నాకు నిద్రపట్టదు. ఆ మిషన్ గురించే ఆలోచిస్తూ వుంటాను" అన్నాడతను.

"ఇటుపైన నాకు యే బెంగా వుండదు. నేను ముద్రించిన డబ్బుతో, మీరిచ్చే డబ్బుతో హాయిగా యెక్కడో జీవించవచ్చు" అందామె.

తూలూతూ గవర్రాజు తన గదికి చేరుకున్నాడు. తన యింటికి ఎస్.టి.డి. కాల్ చేశాడు. అటువైపున అతడి మూడో భార్య రిసీవర్ ఎత్తింది.

"గవర్రాజు!" అన్నాడతను.

"చెప్పండి" అంది భార్య.

"యాభై లక్షలు రొక్కంగా యిచ్చి రేపటి విమానంలో మూర్తిని ఇక్కడకు పంపించు. చాలా అర్జంట్" అన్నాడతను.

"పంపిస్తాను" అందామె.

"నువ్వెలా వున్నావు?"

"మీ రాకకోసం ఎదురుచూస్తున్నాను" అందామె.

"వస్తాను తొందరగా" అని రిసీవర్ పెట్టేశాడతను.

# 4

మర్నాడు రాత్రి గవర్రాజు ఆమెను కల్సుకున్నాడు.

పెద్ద లెదర్ బాగ్ ను ఆమెముందు పెట్టాడు.

"యాభై లక్షలు!" అన్నాడతను విజయవంతంగా.

జిప్పర్ తెర్చి ఆమె నోట్లకట్టలవైపు చూసింది. జిప్పర్ని మూసేసింది.

"ఆ మిషన్ని యెలా ఆపరేట్ చెయ్యాలో నాకు క్షుణ్ణంగా చెప్పాలి" అన్నాడతను.

"మీకు అంతా చెప్తాను. కొన్ని నోట్లు ప్రింటుచేసి చూపిస్తాను. మీకు ఏ సమస్యా వుండదు. హైద్రాబాద్ వెళ్ళాక మీరే స్వయంగా ముద్రించవచ్చు" అందామె.

"అదే నాకు కావాలి" అన్నాడతను.

"రేపు పొద్దుట పదింటికి మనం కల్సుకుందాం. అప్పుడు అంతా మీకు నేర్పుతాను" అందామె.

"అలాగే చేద్దాం. వెళ్ళనా?"

"నాకోసం ఒక ఫ్రెండు రాబోతున్నాడు."

ఆమెకు గుడ్ నైట్ చెప్పి గవర్రాజు తన గదికి వెళ్ళిపోయాడు.

హైద్రాబాద్ నుంచి ప్లేన్ లో డబ్బు తెచ్చిన మూర్తి గదిలో వున్నాడు. గవర్రాజు సోఫాలో కూర్చున్నాడు.

"మూర్తీ, డిన్నర్ గదికి తెప్పించు యిద్దరికీ!"

"మరెవరేనా వస్తారా సార్?" అడిగాడు మూర్తి.

"నువ్వూ, నేనూ కలిస్తే యిద్దరం అవుతాంగా!" అన్నాడు గవర్రాజు.

"అవును, సార్" అన్నాడు మూర్తి.

"మొదట స్కాచ్ విస్కీ ఒక పెగ్ పోసి తర్వాత డిన్నర్ తెమ్మను" అన్నాడు గవర్రాజు.

గ్లాసులో విస్కీ పోసి, ఐస్ క్యూబ్స్ వేసి, సోడా కలిపి మూర్తి అతడిముందు పెట్టాడు.

"ఇవాళ జాగారం చేద్దాం" అన్నాడతను.

"ఇవాళ శివరాత్రి కాదు, సార్."

"ఇవాళ గవర్రాజు రాత్రి!" అన్నాడతను గంభీరంగా నవ్వుతూ.

మూర్తి బయటకు వెళ్ళిపోయాడు. టెలిఫోన్ మ్రోగింది.

"ట్రంకాల్ ఫ్రమ్ మారీషస్ సార్" అంది హోటల్ ఆపరేటర్.

"కనెక్ట్ మి!" అన్నాడతను.

కాసేపట్లో కనెక్షన్ వచ్చింది.

"ఎమ్. జి. రాజుగారా?" అందో పురుష కంఠం అటువైపునుంచి.

"యస్, ఎమ్.జి. రాజునే" అన్నాడతను.

"నేను జగనాథ్‌ని, సార్" అన్నాడతను.

"హలో, ఎలా వున్నావు?"

"క్షేమంగా వున్నాను. మా ప్రభుత్వానికి మీతో చిన్న సహాయం చెయ్యాలి!"

"చెప్పు!"

"ఇండియన్ కరెన్సీలో మా ప్రభుత్వానికి పది కోట్లు అప్పుకావాలి" అన్నాడు జగన్నాథ్.

"ఉష్, అంతేనా!" అన్నాడు గవర్రాజు, తనకొన్న మిషన్ని గురించి ఆలోచిస్తూ.

"అక్కడి బ్రోకర్సుతో మాట్లాడి ఆ అప్పు మాకు వచ్చేటట్లు మీరు చూడాలి. పదికోట్లూ యిండియన్ కరెన్సీలో యిస్తే చాలు. మా దేశం ఆ డబ్బును

ఇండియాలోనే ఖర్చుపెడ్తుంది. కొన్ని మిషన్లు మేం కొనాలి" అన్నాడతను.

"ఎంతకాలంలో మీకు పదికోట్లు కావాలి?"

"రెండు నెలల్లోపల."

"ఆ మాత్రం దానికి బ్రోకర్లు ఎందుకు? మీ ప్రభుత్వానికి నేనే పదికోట్లు అప్పుగా యిస్తాను" అన్నాడు గజరాజు.

"అది మీరుచేస్తే మా ప్రభుత్వం మిమ్మల్ని పూజిస్తుంది. మారిషస్ ప్రధానమంత్రి మీకు స్పెషల్ రిసెప్షన్ యిస్తారు పోర్టు లూయిూలో" అన్నాడు జగన్నాథ్.

"మిస్టర్ జగన్నాథ్, రెండు నెలల లోపల పదికోట్లు నా దగ్గర రెడీగా మీకోసం వుంటుందని మీ ప్రధాన మంత్రితో చెప్పు! నాకు కావలసింది పన్నెండు పర్సెంట్ వడ్డీ!"

"వడ్డీ యిస్తారు సార్. మా ప్రధానమంత్రితో చెప్తాను. అవసరమైతే మీరు యిక్కడకు రావచ్చు."

"మీ ప్రధానమంత్రి యెప్పుడు రమ్మన్నా వస్తాను" అన్నాడు గజరాజు.

"ఆయనతో అంతా మాట్లాడి మీకు నేను మళ్ళీ ఫోన్ చేస్తాను. గుడ్ నైట్ సార్!" అన్నాడు జగన్నాథ్.

## 5

తను చెప్పిన ప్రకారం పదింటికి గజరాజు 31-వ నంబరు గదిముందుకు నడిచి, తలుపును తట్టాడు. ఏ జవాబూ లేదు.

గట్టిగా నాలుగుసార్లు తట్టాడు. ఎవ్వరూ పల్కలేదు. విసుగెత్తి తన గదికి వెళ్ళి టెలిఫోన్ రిసీవర్ని యెత్తాడు.

"హాలో!" అందొక యువతి, రిసెప్షన్ కౌంటరు నుంచి.

"రూమ్ నంబరు 31 కి కనెక్షన్ యివ్వు" అన్నా డతను.

"ఆ గదిలో యెవ్వరూ లేరు, సార్!" అందామె.

"రూమ్ నంబరు 31 లో వుండే కుసుమ ఏమైంది?"

"నిన్న రాత్రి పదకొండింటికి ఆమె గది ఖాళీ చేసి వెళ్ళిపోయింది సార్!"

అతడు క్షణకాలం ఆలోచించాడు.

"హాలో! 31, 32 నంబరు గదులు నేను తీసుకుం టాను. గది తాళంచెవి నాకు పంపండి" అన్నాడు గవ్రాజు.

"పంపుతాను సార్!" అందామె.

కాస్సేపట్లో బేరర్ ఒక తాళంచెవిని తెచ్చి అతడి కిచ్చాడు.

గవ్రాజు 3-వ నంబరు గదితలుపు తెర్చి లోపలకు వెళ్ళాడు. 31-వ గది నుంచి తలుపు తెర్చుకుని 32-వ నంబరు గదిలోకి వెళ్ళాడు. గోడలకు కట్టిన తాళ్ళు మాయమయ్యాయి. తను చూసిన మిషన్ టేబుల్ మీద వుంది.

గవ్రాజు మిషన్ బటన్ నొక్కాడు. ఏమీ కదల లేదు. రెండు మూడుసార్లు బటన్ని నొక్కి చూశాడు. ఏ విధంగానూ వుపయోగపడలేదు.

మిషన్ని యెలా నడపాలో ఆమె తనకు చెప్తానంది. ఏదీ చెప్పకుండానే ఆమె మాయమైంది. గవ్రాజు కోపంగా మిషన్ వైపు చూశాడు.

తన్ని మోసంచేసి పారిపోలేదు. అతడు తన గదికి నడి

చాడు. డైరక్టరీలో ఒక నంబరు చూశాడు. రిసీవర్ యెత్తి ఆ నంబరుకు ఫోన్ చేశాడు.

"ఇన్‌స్పెక్టర్ రామన్ హియర్" అందో కంఠం.

"మీరు వెంటనే 31-వ నంబరుకి వచ్చి చూడండి. కుసుమ అనే యువతి నకిలీ నోట్లను 32-వ గదిలో ముద్రిస్తోంది" అన్నాడతను.

"మీ రెవరు?"

"నేను ఎమ్. జి. రాజుని. నాకు అనుమానం వచ్చి మీకు ఫోన్ చేస్తున్నాను" అన్నాడతను.

"చాలా థాంక్స్ రాజుగారూ! వెంటనే వస్తున్నాం" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఇన్‌స్పెక్టర్ రామన్‌తో గవర్రాజు 32-వ నంబరు గదిలోకి వెళ్ళాడు. ఇన్‌స్పెక్టర్ రామన్ అక్కడున్న మిషన్ వైపు చూశాడు.

"ఈ మిషన్ మీద ఆమె నకిలీ నోట్లు యెలా ముద్రించింది?" అడిగాడతను.

"ఆ నోట్లను నాకు అమ్మడానికి ప్రయత్నించింది" అన్నాడు గవర్రాజు.

"రాజుగారూ, ఇంపాసిబుల్. ఇది పాతబడిన టైపు రైటర్. నకిలీ నోట్లు దీనితో ముద్రించలేరు. మీరు పొరబడ్డారు" అన్నాడు రామన్.

అదే మిషన్ కోసం తను యాభై లక్షలు యిచ్చినట్లు అతడు చెప్పలేకపోయాడు.

"ఆమె ముద్రించిన నోటు ఒకటి నా దగ్గర వుంది" అన్నాడు గవర్రాజు.

"ఇవ్వండి, చూస్తాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

తన జేబులో వున్న నూరురూపాయల నోటును గజ
రాజు ఇన్‌స్పెక్టర్‌కి యిచ్చాడు.

నోటు వంక యిన్‌స్పెక్టర్ రామన్ పరీక్షగా
చూశాడు.

"ఇది నకిలీనోటు కాదు. మన ప్రభుత్వం ముద్రించిన
నోటు" అన్నాడతను.

కాస్సేపు గజరాజు నోటమ్మట మాట పెగలేదు.

"ఇన్‌స్పెక్టర్, నేను పొరబడి వుండొచ్చు. ఐ యామ్
వెరీ సారీ!" అన్నాడు గజరాజు.

కాన్‌స్టేబుల్స్‌తో సహా ఇన్‌స్పెక్టర్ రామన్ వెళ్ళి
పోయాడు. గజరాజు విచారవదనంతో తన గదికి చేరు
కున్నాడు.

"స్కాచ్ విస్కీ యివ్వనా?" అన్నాడు మూర్తి.

"వద్దు! అది తాగడంవలనే ఆమె నన్ను యింతగా
ఫూల్ చేయగల్గింది" అన్నాడు గజరాజు.

"ఎవరు సార్?" అన్నాడు మూర్తి.

"నన్ను ఎవ్వరూ మోసగించలేరు. పోయి నీ పని
చూసుకో!" అన్నాడు గజరాజు.

## 6

గేటు దాటి టాక్సీ కాంపౌండ్‌లో ఆగింది. ఆమె
కిందకు దిగింది.

పోర్టికోలో ఉన్న నౌఖరు ఆమెకు నమస్కరిం
చాడు.

"సరస్వతీదేవిగారున్నారా?" అడిగిందామె.

"హాల్లో వున్నారు, వెళ్ళండమ్మా," అన్నాడు
నౌఖరు.

ఆమె హాల్లోకి నడిచింది. పెద్ద హాలు. పెద్ద సోఫాలో

కూర్చున్న యాభై యేళ్ళ స్త్రీ ఆమెవంక పరిశీలనగా చూసింది.

"ఎవరు నువ్వు?" అడిగింది సరస్వతీదేవి.

ఆమె తీయగా నవ్వింది.

"నా పేరు కుసుమ. అమెరికా వెళ్ళాక నా పేరు పద్మగా మారింది. న్యూయార్కు నుంచి వస్తున్నాను" అందామె.

"న్యూయార్కులో నా చెల్లెలు కూతురుంది, సరళ" అందామె.

"మీ గురించి సరళ చెప్పడంవల నే యిలా వచ్చాను" అందామె.

"సరళ ఎలా వుంది?"

"ఆమె, భర్త సుఖంగా వున్నారు. ఈ డిశంబరులో ఆమె ఇండియాకు వస్తుంది. మిమ్మల్ని అందర్నీ చూడాలని ఆమె కెంతగానో వుంది"

"చెల్లెలు కూతురైనా సరళ నా దగ్గరే పెరిగింది."

హేండ్ బాగ్ లోంచి ఒక కూలింగ్ గ్లాసెస్ తీసి ఆమె సరస్వతీదేవి కిచ్చింది.

"ఈ గ్లాసెస్‌ను మీ కివ్వమంది సరళ."

ఆత్రంగా సరస్వతీదేవి గ్లాసెస్‌ను అందుకుంది.

పెట్టుకు చూసింది. నీలం రంగులో లోకం విచిత్రంగా కనిపిస్తోంది.

"నువ్వు యిక్కడ భోజనం చేయాలి" అంది సరస్వతీ దేవి.

పద్మ నవ్వింది.

"నేనీ దేశంలో వుండేది నెలగోజాలు. ఎందరోన్నో చూడాలి. ఇంకా అమ్మనీ నాన్ననీ చూడలేదు. వాళ్ళు

విజయవాడలో వున్నారు. భోజనం వద్దు. కాఫీ తాగి
వెళ్తాను" అందామె.

"అమెరికా నుంచి వచ్చినవాళ్ళ మనస్సు యెప్పుడూ టైంమీదే వుంటుంది. సరళ ఇలా వచ్చి గంట కూర్చొని వెళ్ళిపోయేది" అందామె.

"అమెరికాలో జీవితాలు టైం ప్రకారం సాగుతాయి" అంది పద్మ.

సరస్వతీదేవి వంటామెను పిల్చింది.

"ఇడ్లీ ఆమె కియ్యి. తర్వాత కాఫీ" అందామె.

ఇడ్లీ తిని ఆమె కాఫీ తాగింది.

"పద, యిల్లు చూపిస్తాను" అని సరస్వతీదేవి లేచింది.

కుసుమ వురఫ్ పద్మ ఆమెతో పైకి వెళ్ళింది. ఆమె అంతా గమనిస్తోంది. యాభై యేళ్ళు వచ్చినా సరస్వతీదేవి బలంగా, ఆరోగ్యంగా వుంది.

విశాలమైన పడగ్గదిలోకి వాళ్ళు నడిచారు. గదిలో రెండు గాడ్రజ్ బీరువాలు వున్నాయి. ఒక బీరువాను ఆమె తెర్చింది. తళతళ మెరుస్తూన్న నగలు కనిపించాయి. ఒక స్విచ్‌ను ఆమె ఆఫ్ చేసింది.

"ఇవి నా నగలు. నా భర్త జమీందారు," అందామె.

"సరళ చెప్పింది, మీ దగ్గర చాలా ఖరీదయిన, అందమైన నగలు వున్నాయి, వీలైతే చూడ ంది. చూసే అవకాశాన్ని మీరే కల్పించారు" అంది పద్మ.

"నా భర్త ప్లేను యాక్సిడెంట్‌లో మరణించారు. ఆయన ప్లేను అట్లాంటిక్ సముద్రంలో కూలిపోయింది. శవాన్ని సముద్రంలోని షార్కులు తినేశాయి. ఆయన

శవాన్ని దహనంచేసే అదృష్టం కూడా మాకు లేక పోయింది."

"వెరీ ట్రాజిక్!" అంది పద్మ.

సరస్వతీదేవి కొంచెంసేపు మాట్లాడలేదు.

"ఈ యింట్లో మీరు ఒక్కరే వుంటున్నారా?"

"నేనూ, నా నౌఖర్లూ. నాకు పిల్లలు లేరు."

అమాంతంగా పద్మ ఆమెను కౌగలించుకుంది.

"మీరు చాలా గొప్పవారు. మళ్ళీ పెళ్ళి చేసుకోకుండా జీవిస్తున్నారు. మీ అంత ఆస్తి వున్నవాళ్ళు అమెరికాలో మళ్ళీ మళ్ళీ పెళ్ళిళ్ళు చేసుకుంటారు" అంది పద్మ.

"ఇది భారతదేశం. అనసూయ, సుమతి, సావిత్రి లాంటి మహాపతివ్రతలు యిక్కడే పుట్టారు" అంది సరస్వతీదేవి.

నగల బీరువాని మూసేముందు ఆమె ఒక స్విచ్‌ని ఆన్ చేసింది.

"ఆ స్విచ్ యేమిటి?"

"అది ఆన్ చేసి వుంటే, యే దొంగయినా నగల్ని తాకితే చాలు సమీపంలో వున్న పోలీసు స్టేషన్‌లో అలారమ్ బజరు మ్రోగుతుంది. వెంటనే పోలీసులు యిక్కడికి వస్తారు."

"మంచి పద్ధతి!" అంది పద్మ.

"ఈ నగల విలువ కోట్లలో వుంటుందమ్మా. తర తరాల నుంచీ వచ్చిన నగలివి. అందువలన జాగ్రత్త పడాలి" అందామె.

ఇద్దరూ పై హాల్లో కూర్చున్నారు. గోడకు వేళ్ళాడు తున్న పెద్ద ఫోటోవైపు ఆమె చూపించింది,

"ఆయన నా భర్త" అందామె.

పొడుగాటి కోటు, జలతారు కండువా, పంచ, తల పాగాలో అతడు బ్రహ్మాండంగా వున్నాడు.

"పద్మా! నేను రేపు ఊటీకి వెళ్తున్నాను. అక్కడ పెద్ద భవనం వుంది మాకు. మళ్ళా నెల తర్వాత తిరిగి వస్తాను. సరళను మరీ మరీ అడిగానని చెప్పు" అందామె.

"నౌఖర్లు యిక్కడే వుంటారా?"

"నౌఖర్లు నాతోనే వస్తారు. గూర్ఖా వాచ్‌మన్ మాత్రం యిక్కడ వుంటాడు."

పద్మ నవ్వుతూ ఆమెదగ్గర సెలవు తీసుకుంది. ఇద్దరూ కిందకు నడిచారు. పద్మ ఆమెను కౌగలించుకొని వెళ్ళి టాక్సీలో కూర్చుంది.

రోడ్డమ్మట టాక్సీ దూసుకుపోయింది. తన హోటల్ గదికి చేరుకొందామె.

తలుపు మూసి సోఫాలో వాలిపోయింది. కుసుమ పురఫ్ పద్మ తన కర్తవ్యాన్ని గురించి తీవ్రంగా ఆలోచిస్తోంది. చాలా సులభంగా అంతా చేయొచ్చు అనుకుందామె తనలో తాను.

## 7

కొంచెం దూరంలో టాక్సీ దిగి ఆమె సరస్వతీదేవి యింటివైపు నడిచింది.

గేటుముందు గూర్ఖా పచార్లుచేస్తున్నాడు. అతడివైపు చూసి ఆమె నవ్వింది.

"నేనొక టూరిస్టుని. మంచి పూల మొక్కలంటే నా కిష్టం. ఈ కాంపౌండ్‌లో చాలా మొక్కలున్నాయి. ఫోటోలు తీసుకోవచ్చా?" అడిగిందామె.

అతడు వేలితో మీసాన్ని దువ్వాడు.

"అమ్మ యింట్లో లేరు. ఊరికి వెళ్ళారు" అన్నాడతను.

"ఆ పనికి అమ్మ అక్కరలేదు. నువ్వు నాతో తోటలోకి రా. ఫోటోలు తీసి వెళ్ళిపోతాను" అందామె.

అతడు కాస్సేపు ఆలోచించాడు.

"లోపలకు పదండి!"

ఆమె లోపలకు నడిచింది. వెనక నే వచ్చాడతను. ఆమె కెమరాతో ఫోటోలు తీస్తూ పోర్టికో కిందకు నడిచింది.

నలువైపులా చూసింది. ఎవ్వరూ యెక్కడా లేరు. వరండా మెట్టుమీద ఆమె కూర్చుంది. ఫ్లాస్కును తెర్చి గ్లాసులో టీ పోసి అతడి కిచ్చింది.

"మీరు తాగండమ్మా."

"నే నింతకు ముందు తాగాను" అందామె.

గ్లాసును అందుకొని అతడు గడగడ తాగేశాడు. గ్లాసులో మళ్ళా టీ పోసిందామె. అది కూడా తాగి అతడు మెట్టుమీద కూర్చున్నాడు. గ్లాసు అతడి చేతిలోంచి కింద పడింది.

వరండామీద అతడు వాలిపోయాడు. మరుక్షణంలో అతడు నిద్రపోయాడు.

కిందపడిన గ్లాసును ఆమె ఫ్లాస్కు మూతగా పెట్టి బిగించింది.

కొంతసేపు ఆమె అక్కడ నిలబడి, అన్నివైపులా చూసింది.

గూర్ఖా మరో గంటదాకా లేవడు. ఈలోపల తన పని పూర్తిచేయాలి!

వరండామీదకు ఆమె నడిచింది. ముందు గుమ్మం తలు

పుకు రెండు తాళాలు వేయబడినాయి. ఆమె స్కెలిటన్ కీని బయటకు తీసింది. రెండు నిమిషాల్లో రెండు తాళాలనూ తెర్చింది.

లోపలకు వెళ్ళి తలుపు మూసుకుంది. మేడ మెట్లెక్కి పైకి వెళ్ళింది.

పడగ్గది తలుపుకు తాళం వేయబడింది.

కాస్సేపు పాటుబడి ఆమె తాళాన్ని తెర్చింది.

లోపలకు వెళ్ళింది. గాడ్రెజ్ బీరువాకు తాళం వేయబడి వుంది. పరుపు కిందనుంచి సరస్వతీదేవి తాళం చెవులగుత్తి తీయడం ఆమెకు గుర్తొచ్చింది.

పరుపుకింద వెతికిందామె. అక్కడ. తాళం చెవులగుత్తి దొరికింది.

వేగంగా ఆమె గాడ్రెజ్ బీరువాను తెర్చింది. పైనున్న అలారమ్ స్విచ్‌ని ఆఫ్ చేసింది.

అక్కడున్న నగలవైపు ఆశ్చర్యంతో చూసింది. తన బాగ్‌లో నగలను పడేసుకుంది. బీరువా ఖాళీ అయింది. అడుగు అరలో వున్న నోట్లకట్టలను ఆమె బాగ్‌లో పడేసుకుని జిప్పర్స్ మూసేసింది. ఆన్ చేసి అలారమ్ స్విచ్‌ని ఆమె గుడ్డతో తుడిచేసింది. గాడ్రెజ్ బీరువాను మూసి తాళం వేసింది. తాళంచెవుల గుత్తిని పరుపుకింద పెట్టేసింది.

పడగ్గదికి తాళంవేసి ఆమె బాగ్‌తో కిందకు దిగింది. కెమెరా, ఫ్లాస్కు, బాగ్ ఆమె టూరిస్టులా కనిపిస్తోంది.

ముందు తలుపు తెర్చి ఆమె వరండామీదకు జరిగింది. ఉలిక్కిపడింది. గుండె శరంవేగంగా కొట్టుకోసాగింది.

వరండామీదకు వాలి పడుకున్న గూర్ఖావైపు ఒక

పోలీసు సార్జంటు వంగి చూస్తున్నాడు.

"హలో! అతడిని లేపొద్దు!" అరిచిందామె.

"ఏమైందితనికి?"

"పదిహేను నిమిషాల క్రితం డాక్టర్ ఇంజక్షన్ యిచ్చి వెళ్ళాడు. గంటసేపు అలా పడుకోమన్నాడు. లేచాక హాట్ కాఫీ యిమ్మన్నాడు. అందుకే ఫ్లాస్కు పట్టుకెళ్తున్నాను" అందామె.

"ప్రతిరోజూ యీ యింటివైపు ఓసారి చూడమని నాకు ఆర్డర్లు వచ్చాయి. అందుకని వచ్చాను" అన్నాడతను.

"తప్పక చూడండి. వెళ్ళేవరకూ అత్తయ్య రాదు. ఇవాళ సాయంత్రం నేను కూడా వూటీకి వెళ్ళిపోతున్నాను" అందామె.

"ఊటీ వెళ్ళాక మీ అత్తయ్యతో చెప్పండి, సార్జంట్ సుందరం యింటిని బాగా చూస్తున్నాడని" అన్నాడతను.

"అలాగే చెప్తాను" అందామె.

సార్జంటు సుందరం ఆమెకు నమస్కరించి వెళ్ళిపోయాడు.

అతడు పోయిన కొంతసేపటికి ఆమె వడి వడిగా గేటువైపు నడిచింది. గేటు దాటి రోడ్డమ్మట వెళ్ళిపోయింది.

నాలుగుసార్లు వాహనాలుమారి ఆమె తన హోటల్‌కు చేరుకుంది.

## 8

కుసుమ తన కారును వేగంగా రోడ్డమ్మట పోనిస్తోంది. లైటు సిగ్నల్ కోసం జంక్షన్‌లో కారు

ఆపింది.

ఎడంవైపున పేవ్‌మెంటుమీద నిలబడిన వ్యక్తి కేసి తంక చూసింది. మాసిన పాంటు. కాలి జోళ్ళు తెగు న్నాయి.

"గోపాల్!" అందామె.

అతడు తటాలున కారువైపు పరుగెత్తుకొచ్చాడు.

"నువ్వా, రాధికా!" అన్నాడు.

ఆమె అసలు పేరు రాధికని కొందరికే తెలుసు!

"ఎక్కు!" అందామె.

అతడు ముందు సీటుమీద కూర్చోబోయాడు.

"వెనక కూర్చో" అందామె.

అతను వెనక సీటుమీద కూర్చున్నాడు.

ఆమె కారును పోనిచ్చింది.

"ఏమిటలా వున్నావు?" అడిగిందామె.

"నా వుద్యోగం పోయింది" అన్నాడతను.

"ఎందుకు పోయింది?"

"కంపెనీ డబ్బు పదివేలు నేను రేసుల్లో పోగొట్టుకున్నాను. అది తెలిసిపోయింది. నన్ను పొమ్మన్నారు."

"ఇటీస్ ఎ పిటిఫుల్ థింగ్!" అందామె.

"నువ్వేం చేస్తున్నావు?"

"ఇంకా పెళ్ళి చేసుకోలేదు!" అందామె.

అతడు మాట్లాడలేదు.

"నీ కెంతమంది పిల్లలు?"

"ముగ్గురు. ముగ్గురూ ఆడపిల్లలే."

"ఎలా బతుకుతున్నావు?" అందామె.

"చాలా కష్టంగా వుంది" అన్నాడతను.

గేటు ముందున్న గూర్ఖా ఆమెకు సలామ్ చేశాడు.

కారును లోపలకు పోనిచ్చి పోర్టికోలో ఆమె ఆపింది.

ఆమె కిందకు దిగింది. గోపాల్ దిగి కారు పక్కనే నిలబడ్డాడు.

"కాస్సేపు ఇక్కడే వుండు. నేను రమ్మన్నాక రా!" అని ఆమె లోపలకు వెళ్ళిపోయింది.

పడగ్గదిలోకి వెళ్ళి ఆమె పరుపుమీద వెల్లకిలా వాలింది. గోపాల్ ఆమెకు జ్ఞప్తికొస్తున్నాడు. ఆ నాటి గోపాల్.

అతడు తనతో తిరిగాడు. తనని ముద్దాడాడు. చివరకి పెళ్ళి చేసుకోడానికి నిరాకరించాడు.

"నీది తక్కువ కులం!" అన్నాడతను.

"అది నీకు మొదటినుంచీ తెలుసుగా?" అందామె.

"అమ్మా, నాన్నా ఒప్పుకోరు!"

"నీకు నచ్చకపోతే తలిదండ్రులకు నచ్చదంటావు? ఈ నాడు చాలామంది చేసేది అదే."

"రాధికా! నన్ను మర్చిపో!" అన్నాడతను.

అతడిని మర్చిపోయింది. ఐదేళ్ళ తర్వాత గోపాల్ తనకు కనిపించాడు.

ఒకప్పుడు అతను మోటర్ బైక్ మీద హుషారుగా పోతూవుండేవాడు. ఇప్పుడు అదంతా ఎగిరిపోయింది.

"లీలా!" పిల్చిందామె.

పనిమనిషి వచ్చింది.

"పోర్టికోలో గోపాల్ అనే వ్యక్తి వుంటాడు. అతడిని ఇక్కడకు రమ్మను" అందామె.

"ఈ గదిలోకా?"

ఆమె తలాడించింది.

లీలా మెట్లు దిగి కిందకు వెళ్ళింది.

కాస్సేపట్లో గోపాల్ పైకి వచ్చాడు.

పడగ్గది గుమ్మంలో నిలబడ్డాడు.

"లోపలకు రా!" అందామె.

అతడు లోపలకు వెళ్ళాడు. మంచానికి దూరంగా నిలబడి వుండిపోయాడు.

ఆమె లేచి పరుపుమీద కూర్చుంది.

"మరో ఉద్యోగం కోసం వెతుకు!" అందామె.

"ఎవ్వరూ ఉద్యోగం యివ్వడం లేదు," అన్నాడతను.

"ఒకప్పుడు నువ్వు చాలా గర్వంగా మాట్లాడే వాడవు" అందామె.

ఆమెవంక అతడు బాధతో చూశాడు.

"అదంతా నాకు జ్ఞాపకం చేయకు!"

"నేను ఉద్యోగం యిస్తాను, చేస్తావా?" ప్రశ్నించిందామె.

"ఎందుకు చేయను?"

"జీతం ఎంత కావాలి?"

"జీతం ఇంత కావాలని అడిగే స్థితిలో నేను లేను. ఎంతిచ్చినా చేస్తాను" అన్నాడతను.

"నెలకు నీకు వెయ్యి రూపాయలు ఇస్తాను."

"చాలా థాంక్స్! నా భార్యా, పిల్లలు యిటుపైన బతుకుతారు" అన్నాడు గోపాల్.

ఆమె అతడివైపు చూసింది.

"నువ్వు నా పెర్సనల్ నౌఖరుగా వుంటావు. సెక్రటరీ అని లోకానికి చెప్పుకోవచ్చు."

అతను తలాడించాడు.

"అక్కడ నా బాత్ రూమ్ స్లిప్పర్సు వుంటాయి

పట్రా" అందామె.

అతడు వెళ్ళి స్లిప్పర్స్ తెచ్చి ఆమె ముందు పెట్టాడు.

స్లిప్పర్లను ఆమె ధరించింది.

"ఈ జోళ్ళు పట్టుకెళ్ళి అక్కడ పెట్టు" అందామె.

ఆమె విడిచిన లెదర్ జోళ్ళను అతడు పట్టుకెళ్ళి అలమారు కింద అరలో పెట్టాడు.

"నేను గది బయట వుంటాను. కావలిస్తే పిలవండి" అన్నాడతను వినయంగా.

"వెళ్ళు" అందామె.

ఒకప్పుడు అతడు తనని హీనంగా చూశాడు. తనది తక్కువ కులం! తను విసిరే మెతుకులు ఏరుకుతినే స్థితిలో వున్నాడు గోపాల్. చెత్త పనులన్నీ అతడిచేత చేయించి అతడి కులం పెద్దదికాదని తను రుజువు చేయాలి!

"గోపాల్" పిల్చిందామె.

అతడు గదిలోకొచ్చాడు.

"చెప్పండమ్మా" అన్నాడతను.

"అమ్మా గిమ్మా అని నాతో మాట్లాడొద్దు. మునపటి లాగే మాట్లాడు" అందామె.

"నాకు జీతం ఇచ్చే వ్యక్తికి నేను మర్యాద ఇవ్వాలి. 'నువ్వ' అని సంబోధిస్తే బాగోదు" అన్నాడతను.

"ఎవరికెలా వున్నా, నాకు బాగానే వుంటుంది."

"అయితే చెప్పు ఏం కావాలో."

"బాత్‌రూమ్‌లో గుడ్డలున్నాయి. అవన్నీ మూటగట్టి స్టార్ లాండ్రీలో ఇచ్చిరా."

అతడు బాత్‌రూమ్‌లోకి వెళ్లాడు. కాస్సేపట్లో మూట బట్టుకొని బయటకు నడిచాడు.

బయటకు పోతున్న అతడిని చూసి ఆమె వ్యంగ్యంగా నవ్వింది.

# 9

కరుపయ్య చెట్టియార్ లైన్స్ క్లబ్ మీటింగులో రాధికను కలుసుకున్నాడు. ఆమె అందం, సంస్కారం, మాట్లాడే తీరు అతడిని బాగా ఆకర్షించాయి.

తన పేరు సుమిత్రని ఆమె అతడితో చెప్పింది. తన ఫోన్ నంబరిచ్చింది.

వారం రోజులు తిరిగేలోపల కరుపయ్య చెట్టియార్ ఆమెకు ఫోన్ చేశాడు.

"రేపు మీరు ఫ్రీగా వుంటారా?"

"ఎన్నింటికి?"

"రాత్రి ఎనిమిదింటికి!"

"ఏమిటి సంగతి?"

"నా బర్త్ డే పార్టీ రాత్రంతా వుంటుంది. మీరు వస్తే సంతోషిస్తాను. మీకు కావలసినపుడు మీరు వెళ్ళిపోవచ్చు" అన్నాడతను.

"తప్పక వస్తాను."

"ఒక్క విషయం మీరు ప్రెజెంట్లు పట్రాకూడదు. నాకు కావలసింది మీ స్నేహం, బహుమతులు కావు."

"అలాగే లెండి" అని ఆమె తీయగా నవ్వింది.

మర్నాడు ఎనిమిదింటికి ఆమె కరుపయ్య చెట్టియార్ భవనానికి చేరుకుంది. తెల్లటి భవనం రంగు రంగుల ఎలక్ట్రిక్ లైట్లతో ప్రకాశిస్తోంది.

కేలాది అతిథులు అక్కడ గుమిగూడారు. ఎవ్వరూ ప్రెజెంట్లు పట్రాలేదని ఆమె చూసింది.

కారు దిగగానే కరుపయ్య చెట్టియార్ స్వయంగా

ఆమెను ఆహ్వానించాడు. హాల్లోకి తీసుకెళ్ళి కూర్చో బెట్టాడు.

ఆమె యిటూ అటూ చూసింది. పేరు పొందిన ప్రముఖులు ఎందరో తను కూర్చున్న వరుసలో వున్నారు.

తన ముందు నుంచి వెళ్తూన్న గజరాజును చూసి ఆమె ముఖాన్ని మరోవైపుకు తిప్పుకుంది. ఆమెకేసి చూసి అతడు ఆగాడు.

"హలో, మిస్ కుసుమ్!" అన్నాడతను.

అతడివైపు ఆమె ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ చూసింది.

"మిస్ కుసుమ!" అన్నాడతను మళ్ళా.

"ఆమె ఎక్కడుందో నాకు తెలియదు" అందామె.

ఆమె వేషం బాగా మారింది. మాటకూడా మారింది. ఆమె పక్క కుర్చీలో అతడు కూర్చున్నాడు.

"నన్ను తెలియనట్లు నటించకు. నీ కోసమే నేను వెతుకున్నాను. నన్ను మోసగించినవాళ్ళు పారిపోలేరు. నా కబంద హస్తాల్లో వాళ్ళు యిరుక్కుపోతారు" అన్నాడతను.

హేండ్ బాగ్ లోని అద్దంతీసి లిప్ స్టిక్ పులుముకుంటూ ఆమె వుండిపోయింది.

"నీకే నేను చెప్తూంట" అన్నాడతను.

అప్పుడే కరుపయ్య అటువచ్చాడు.

"ఎమ్.జి. రాజుగారూ, మిసెస్ సుమిత్రను కల్సుకోండి! ఫైన్ లేడీ" అన్నాడు కరుపయ్య.

గజరాజుకు ఆమె నమస్కరించింది.

"మీ సీట్ నంబరు 80" అన్నాడు కరుపయ్య.

గజరాజు అటువైపు నడిచి వెళ్ళిపోయాడు.

సుమిత్రకూ, కుసుమకూ ఎంత పోలిక! కాని కరుపయ్య

ఆమె సుమిత్ర అన్నాడు. ఆమె కుసుమ కాదు. తను పొరబడి వుండొచ్చు, అనుకున్నాడు గజేంద్ర రాజా.

పెద్ద చాండిలియర్స్ ప్రకాశవంతంగా హాల్లో వెల్లుతున్నాయి.

డయాస్ మీద నిలబడి పెద్ద కేక్ను కరుపయ్యా చెట్టియార్ కోశాడు. అతడి భార్య పక్కనే వుంది. కుటుంబ సభ్యులు కొందరు డయాస్ మీద నిలబడ్డారు.

ఎదురుగా కూర్చున్న వాళ్ళందరూ "హేపీ బర్త్ డే!" "మెనీ హేపీ రిటర్న్స్ ఆఫ్ ది డే" అని అరిచారు.

హాల్లో యూనిఫామ్స్‌లో వున్న బట్లర్లు తిరుగుతున్నారు. అతిథులకు స్వీట్స్, హాట్స్, కూల్ డ్రింక్స్, బీర్, విస్కీ వగైరా యిస్తున్నారు.

సుమిత్ర డయాస్ మీదున్న కరుపయ్యా భార్యవైపు చూసింది. ఆమె ధరించిన డైమండ్ నెక్లేసు తళతళ మెరుస్తోంది. దాని విలువ కోటి రూపాయలు పైన వుంటుంది.

డయాస్ మీదనుంచి కరుపయ్యా చెట్టియార్ కిందకు దిగాడు. అతడి భార్య పైకి వెళ్ళిపోయింది. ఆమె చదువుకున్న స్త్రీ కాదు. కేక్ కోసేటప్పుడు మాత్రం భర్త పక్కనుండి, అది పూర్తవగానే ఆమె తన గదికి వెళ్ళిపోయింది.

విశాలమైన హాల్లో అతిథులు చిన్న గ్రూప్స్‌లో కూర్చుని తాగుతున్నారు, తింటున్నారు.

పదింటికల్లా చాలామంది వెళ్ళిపోయారు. తాగుడు మీద ఆసక్తి వున్న వాళ్ళు మాత్రం హాల్లో వున్నారు. కరుపయ్యా బర్త్‌డే నాడు స్కాచ్ విస్కీ గంగానదిలా రాత్రంతా ప్రవహిస్తూనే వుంటుంది. అయిపోయిందన్న

మాట యెక్కడా వినబడదు.

కరుపయ్య చెట్టియార్ ఆ రోజున తప్ప తాగుతూ వుంటాడు.

నిషాలో గవర్రాజు సుమిత్ర కూర్చున్న చోటకు వచ్చాడు. కరుపయ్య సుమిత్ర పక్కనే వున్నాడు.

"ఈమె పేరు కుసుమ, సుమిత్ర కాదు" అన్నాడు గవర్రాజు.

"మీ బర్త్ డే పార్టీలో ఎక్కువ తాగి ఎవరు ఎవరో తెలుసుకోలేని స్థితిలో వుంటారు అతిథులు" అంది సుమిత్ర నవ్వుతూ.

ఆమె జోక్‌కు కరుపయ్య నవ్వాడు. మరి కొందరు పక్కన నవ్వారు. స్కాచ్ విస్కీ ప్రభావంలో అతి సామాన్యమైన జోక్ కూడా అటంబాంబులా పేల్తుంది!

గవర్రాజు తూలుతున్నాడు. గిర్రున తిరిగి అతడు ఒక కుర్చీలో పడ్డాడు.

"ఎవరు ఎవరో నాకు తెలుసు!" అన్నాడతను.

"నేనెవరు?" అన్నాడు కరుపయ్య చెట్టియార్.

"అవర్ డియర్ హోస్టు! నేను యెక్కువగా తాగలేదు. ఇంకా యెంతో తాగాలి!" అన్నాడు గవర్రాజు.

కరుపయ్య బట్లర్ని పిల్చాడు.

"ఆయనకు యింకా విస్కీ పొయ్యి. పడుకుంటాడు" అన్నాడతను.

"యస్సార్" అని బట్లర్ వెళ్ళిపోయాడు.

కరుపయ్య మెల్లిగా సుమిత్ర చెయ్యిని పట్టుకున్నాడు. ఆమె కళ్ళలోకి ఆశతో చూశాడు.

"మీ కళ్ళు చాలా అందంగా వున్నాయి" అన్నా

డతను.

ఆమె నవ్వింది. తేనె కురుస్తున్నట్లుంది ఆమె నవ్వు.

"మీతో యేకాంతంగా మాట్లాడాలి. పైకి వెళ్దాం పదండి" అన్నాడు కరుపయ్యా చెట్టియార్.

కరుపయ్యా పొట్టిగా, నల్లగా, లావుగా వున్నాడు. అతడు వేసుకున్న షార్క్ స్కిన్ సూటు లైట్ల కాంతిలో మెరిసిపోతోంది.

"పదండి" అందామె.

## 10

విశాలమైన హాల్లో యెవ్వరూ లేరు. లైట్లు షాండిలియర్స్ వెలుగుతున్నాయి. ఎన్నో కిటికీలు వున్నాయి.

కరుపయ్యా చెట్టియార్ ఆమెను ఒక కిటికీ దగ్గరకు తీసుకెళ్ళాడు. ఎదురుగా వుంది అడ్యార్ నది. చంద్ర కాంతిలో నదిని చూస్తూంటే హాయిగా వుంది. నది సముద్రంలో కలవడానికి తొందరపడుతున్నట్లు ప్రవహిస్తోంది.

నది అవతల ఒడ్డున అశోకా చెట్లు పొడుగ్గా కనిపిస్తున్నాయి.

"సుమిత్రా, ఇట్లువైన మీరు మీరని మీతో మాట్లాడను" అన్నాడతను.

"ఏకవచనంతో మాట్లాడితే నేనెంతో సంతోషిస్తాను" అందామె.

అమాంతంగా అతడామెను కౌగలించుకుని, పెదిమల మీద ముద్దెట్టుకున్నాడు.

"నీమీద నాకుందే ప్రేమను మరో విధంగా నేను చూపించలేను" అన్నాడతను ఉద్రేకంతో.

"మీరు మీ భార్యకు అన్యాయం చేయడం మంచిది కాదు" అందామె.

"క్షయ రోగంతో ఆమె బాధపడ్తోంది. నాకెందుకూ ఉపయోగపడదు. ఎక్కువ కాలం బతకదని డాక్టర్లు అంటున్నారు" అన్నాడతను.

ఆమె విని వూరుకుంది.

"సుమిత్రా, తాతగారి డైమండ్ నెక్లెసును నువ్వు చూశావా?" అడిగాడతను.

"చూపిస్తే చూస్తాను" అందామె.

అద్దాల అలమారా వైపు అతడామెను తీసుకెళ్ళాడు. లైట్లు వెల్గుతున్నాయి. లైట్ల కాంతిలో డైమండ్ నెక్లెసు అఖండంగా ప్రకాశిస్తోంది.

"దాని వెల ప్రస్తుతం కోటిరూపాయిలు పైన వుంటుంది. తాతగారు దీన్ని యిరవై ఐదు వేలిచ్చి ఆ రోజుల్లో కొన్నారు. ఇప్పుడు విలువ పెరిగింది" అన్నాడతను.

"ఇంత ఖరీదైన నెక్లెసు వున్నప్పుడు మీరు జాగ్రత్తగా వుండాలి" అందామె.

అతడు వ్యంగ్యంగా నవ్వాడు.

"నా దగ్గర యిద్దరు గూర్ఖాలు యిరవై యేళ్ళనుంచి పని చేస్తున్నారు. వాళ్ళు రాత్రిళ్ళు కాపలా కాస్తూ వుంటారు. ఎవరేనా కాంపౌండులోకి అడుగు పెడ్తే వాళ్ళ చేతుల్లో చావవలసిందే" అన్నాడు కరుపయ్యా చెట్టియార్.

"గూర్ఖాలున్నంతకాలం మీకు భయం లేదు" అందామె.

ఇద్దరూ వుయ్యాలలో కూర్చున్నారు.

వుయ్యాల మెల్లిగా వూగుతోంది.

"సుమిత్రా, రేపు నేను కాశ్మీర్ వెళ్తున్నాను. పదిహేను రోజులు అక్కడుండి వస్తాను" అన్నాడతను.

"ఇంట్లో యెవ్వరూ వుండరా?"

"నా చుట్టాలు కింద భాగంలో వుంటారు. పైన యెవ్వరూ వుండరు" అన్నాడతను.

"మీ భార్య?"

"ఆమెకోసమే నేను కాశ్మీర్ వెళ్తూంట. అక్కడ ఆమె ఆరోగ్యం బాగుపడొచ్చని డాక్టర్లు అంటున్నారు" అన్నాడతను.

"భార్యకు ఆ మాత్రం సేవచేస్తున్నందుకు మిమ్మల్ని నేను మెచ్చుకుంటున్నాను" అందామె.

అతడామె చెయ్యిని పట్టుకున్నాడు.

"సుమిత్రా, నా భార్య పోయాక నేను నిన్ను పెళ్ళాడదల్చాను" అన్నాడతను.

"ఆ పరిస్థితి ఆసన్నమయినపుడు చూద్దాం" అందామె.

# 11

ఆమె కారును పోనిస్తోంది. పక్కనే కూర్చుని వున్నాడు గోపాల్. అతడు విచారవదనంతో వున్నాడు.

"ఎందుకలా వున్నావు?" అడిగింది రాధిక.

"నా భార్య, పిల్లలు మరణించారు" అన్నాడతను.

"అదెలా జరిగింది?"

"నాకు ఉద్యోగం వచ్చిందని ఆమెకు తెలియదు. నేను యింటికి వెళ్ళేసరికి వాళ్ళు మరణించి వున్నారు. ఈ చీటీని ఆమె నాకోసం రాసిపెట్టింది" అని ఒక చీటీని అతడామెకిచ్చాడు.

రాధిక చీటీని చదివింది.

"వెరీ ట్రాజిక్! ఎన్నిరోజులనుంచో నీకూ, నీ పిల్లలకూ తిండిలేదు" అందామె.

"అందుకే నీ చెప్పులు మోయడానికి నేను సిద్ధపడ్డాను" అన్నాడతను.

"ఇప్పుడు ఏం చేస్తావు?" అడిగిందామె.

"నాకే తెలియదు" అన్నాడతను.

అతడి చేయిని ఆమె పట్టుకుంది.

"గోపాల్, నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను. నీకోసం పెళ్ళికూడా మానేశాను. నువ్వు నన్ను ప్రేమించగలవా?" అందామె.

"నీకు జవాబు కావాలా?" అన్నాడతను.

"కావాలి" అందామె.

"అయితే కారును వెంటనే ఆపు!"

ఒక చెట్టుకింద ఆమె కారును ఆపింది.

"రాధికా, నిన్ను పెళ్ళాడలేకపోయినందుకు నేను చాలా బాధపడ్డాను. నా తలిదండ్రులను నేను ఎదిరించలేకపోయాను. అది నా బలహీనత. కాని నిన్ను నేను ప్రేమిస్తూనే వున్నాను" అన్నాడతను.

ఇద్దరూ బలంగా కౌగలించుకున్నారు. ఆమె ఎర్రటి పెదిమలను అతను ముద్దాడాడు. వేళ్ళతో ఆప్యాయంగా ఆమె జుత్తును నిమిరాడు.

"రాధికా, ఐ లవ్ యూ" అన్నాడతను.

"నిన్ను తప్ప మరెవర్నీ నేను ప్రేమించలేను" అందామె.

"మనం పెళ్ళి చేసుకుందాం" అన్నాడతడు.

"ఆటుపైన కాశ్మీర్ పోదాం. ఒక యిల్లు కొనుక్కొని అక్కడే వుండిపోదాం" అందామె.

"నీ యిష్టం" అన్నాడతను.

ఆమె ఆప్యాయంగా అతడి ఒళ్ళోకి ఒరిగిపోయింది.

"లవ్ మి గోపాల్, లవ్ మి!" అందామె.

# 12

కాంపౌండ్ వాల్ పక్కనే ఆమె జీప్‌ను ఆపింది. కిందకు దిగింది. వెనుక కూర్చున్న యిద్దరు యువతులు కిందకు దిగారు.

సుమిత్ర వాళ్ళ వంక చూసింది.

“కాంపౌండులోకి వచ్చిన వాళ్ళను ఆ గూర్ఖాలు చంపేస్తారు. గోడదూకి అటువైపు వెళ్ళండి. మీరిద్దరూ వాళ్ళకు లొంగిపోండి. వాళ్ళను కదలకుండా చేయండి” అందామె.

“వాళ్ళు మమ్మల్ని చంపుతారేమో!” అందో యువతి.

“వాళ్ళు మిమ్మల్ని చంపరు. నేపాల్ నుంచి ఆ గూర్ఖాలు యిక్కడకు వచ్చారు. మూడేళ్ళు దాటినా వాళ్ళింకా నేపాల్‌కు పోలేదు. ఆడదాన్ని చూడగానే వాళ్ళు లొంగిపోతారు” అందామె.

ఇద్దరు యువతులూ కాంపౌండ్ వాల్ యెక్కారు. అటువైపుకు దూకారు.

రెండు టార్చిలైట్ల కాంతి వాళ్ళ మీద పడింది. గూర్ఖాలు పరుగెత్తుకొచ్చారు యువతులవైపు.

“ఎవరు మీరు?”

“ఒక కుక్క మమ్మల్ని తరుముకొస్తోంది. దిక్కులేక గోడదూకి యిక్కడ పడ్డాం” అందో యువతి.

యువతులిద్దరూ అందంగా వున్నారు.

“మీరు భోజనం చేశారా?” అడిగాడు ఒక గూర్ఖా.

“లేదు” అంది ఒక యువతి.

“పదండి, మా ఇంటికెళ్ళి భోజనం చేద్దాం” అన్నాడు రెండో గూర్ఖా.

ఇద్దరు వనితలూ గూర్ఖాలతో వెళ్ళిపోయారు.

గోడమీద కూర్చున్న సుమిత్ర యిదంతా గమనించింది.

కాంపౌండులో ఎవ్వరూ లేరు. భవనం కిందభాగంలో లైట్లు లేవు. అక్కడుండేవాళ్ళు నిద్రపోయి వుండాలి!

సుమిత్ర అటువైపుకు చూసింది. మేడమీదదాకా వుడ్ కోజస్ తీగలు వున్నాయి. తీగల్ని పట్టుకుని ఆమె చూసింది. తన బరువును ఆ తీగలు ఓర్చుకోగలవని ఆమె గ్రహించింది.

తీగల్ని పట్టుకుని మెల్లిగా పై డాబామీదకు ఆమె వెళ్ళింది.

ఇంట్లోకి వెళ్ళాలి! పాకెట్ డ్రిల్లింగ్ మిషన్‌తో ఆమె తలుపులో చిల్లుచేసింది. చెయ్యిదూర్చి గడియలు తీసేసింది. మెల్లిగా మేడమీదకు ఆమె చేరుకుంది.

పెద్ద హాలు. వజ్రాల నెక్లెసు లైట్ల కాంతిలో మెరుస్తోంది. తలుపును పక్కకు తోసి ఆమె నెక్లెసును తీసుకుంది. తలుపును మూసేసింది.

ఆమె వేగంగా డాబామీదకు నడిచింది. వుడ్ కోజెస్ తీగలు పట్టుకుని ఆమె కిందకు జారింది.

గబగబా ఆమె ప్రహరీ గోడ వంక పరుగెత్తింది. మెల్లిగా గోడపైకి యెక్కింది.

ఎక్కడా గూర్ఖాలు లేరు!

గోడమీద కూర్చుని ఆమె క్షణకాలం ఆలోచించింది. ఆ వేశ్యలిద్దరకూ డబ్బును ఆమె ముందే యిచ్చేసింది. వాళ్ళను గురించి తను బెంగపెట్టుకోవలసిన అవసరంలేదు.

గూర్ఖాలు వదలగానే ఆ వేశ్యలు వాళ్ళ ఇళ్ళకు వెళ్ళిపోతారు.

సుమిత్ర కిందకు చూసింది. జీపులో కూర్చుంది.

జీపును విజయవంతంగా తన యింటివైపు పోనిచ్చింది.

పోర్టికోలో జీపు ఆపి దిగిందామె. ఆమె చేతిలో వున్న బాగ్ ను గోపాల్ అందుకొన్నాడు. అతడు జిప్పర్స్ తెరవబోయాడు.

"తెరవద్దు!" అందామె.

అతడు తెరవడం మానేశాడు. అతడి చేతిలోని బాగ్ తీసుకొని ఆమె గబగబా తన గదివైపు నడిచింది.

# 13

మర్నాడు పొద్దుటే గోపాల్, రాధిక విమానంలో ఢిల్లీకి ప్రయాణం చేస్తున్నారు. ఇద్దరూ పక్క పక్కనే కూర్చున్నారు.

గోపాల్ ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

"రాధికా! ఇంత డబ్బు నీకెలా వచ్చింది?" అడిగాడతను.

"దురాశలో కొట్టుకునేవాళ్ళను నేను తెలివిగా వుపయోగించుకున్నాను" అందామె.

"నా కర్థంకాలేదు" అన్నాడతను.

"ఆనెస్టు మనిషిని యీ లోకంలో యెవ్వరూ మోసగించలేరు. అత్యాశ వున్నవాళ్ళను మోసగించవచ్చు" అందామె.

గోపాల్ నవ్వి వూరుకున్నాడు.

ప్లేన్ ఢిల్లీ చేరుకొంది. మరో ప్లేన్ లో వాళ్ళు కాశ్మీర్ కి ప్రయాణం చేశారు.

పర్వతప్రదేశంమీదనుంచి విమానం ఆకాశంలో యెగురుతోంది. చాలా చలిగా వుంది. రాధిక, గోపాల్ స్వెట్టర్లు ధరించారు.

"ఇటు పైన యింతవరకూ నువ్వు చేసినదానికి స్వస్తి చెప్పాలి" అన్నాడు గోపాల్.

"ఇటు పైన నువ్వు నా పక్కనుంటే చాలు. నేను అంతా వదిలేస్తాను" అందామె.

అతడామెను ఆప్యాయంగా కౌగలించుకొన్నాడు.

"రాధికా! నువ్వు నా ప్రాణం" అన్నాడతను.

"అదెప్పుడు తెలుసుకొన్నావు?" అందామె.

"నువ్వు దూరమైనాక" అన్నాడతను.

శ్రీనగర్ ఏర్‌పోర్టులో విమానం దిగింది. గోపాల్, రాధిక కిందకు దిగారు.

"ఇక్కడ అఖండంగా వుంది" అందామె.

"ఇక్కడే శాశ్వతంగా వుండిపోదాం" అన్నాడతను.

"నీ ఇష్టం గోపాల్" అందామె.

ఇద్దరూ బయటకు నడిచి టాక్సీ ఎక్కారు.

"హోటల్ కాశ్మీర్" అన్నాడు గోపాల్.

టాక్సీ శర వేగంగా రోడ్డుమ్మట దూసుకుపోయింది.

అతడామె చెయ్యిని ఆప్యాయంగా పట్టుకొన్నాడు.

"రాధికా! ఐ లవ్ యూ!" అన్నాడతను.

"గోపాల్! ఐ లవ్ యూ!" అందామె.

ప్రకృతి సౌందర్యాన్ని ఇద్దరూ ఆనందంతో తిలకించసాగారు. టాక్సీ వేగంగా వెళ్ళిపోతోంది.

—: అయిపోయింది :—

సీరియల్



• బొమ్మిడి అచ్చారావు

(గత సంచిక తరువాయి)

ఇద్దరు యువకులు రెండు భారీ శునకాలని తాళ్ళతో బిగించి పట్టుకున్నారు. మరో యిద్దరు మదించిన రెండు తో దేళ్ళని యింకో యిద్దరు రెండు పోతరించిన అడవి దున్నలను పట్టుకుని నిల్చున్నారు.

అక్కడి వాతావరణం బీభత్సంగా వుంది. జనం ఆనందంతో కేరింతలు కొడుతున్నారు. మనుషుల్లో వుండే పశు ప్రవృత్తిని ప్రత్యక్షంగా చూశారు నవీన్, సౌమ్య. అసలే కొండజాతి అనాగరికులు. వాళ్ళకి దయ, జాలి, దాక్షిణ్యాలు మచ్చుకైనా వుండవు అనుకున్నారు వాళ్ళు.

సింగడు జనసంచారంలేని ఓ యిరుకుదారి గుండా వాళ్ళిద్దర్నీ తీసుకువెళ్ళాడు. దాదాపు పదినిమిషాలు నడిచాక గుహలో వున్న ఓ కొండ ప్రాంతం కనిపించింది.

"ఈడ వోరికీ అపడరు. పొద్దు గుంకేతలికి నే వొస్తను. ఈడనే కూసోండి, కదలొద్దు. పెమాదం!" అన్నాడు సింగడు.

వాళ్ళు తలూపాక మరోసారి జాగ్రత్తలు చెప్పి అక్కడ్నుంచి హడావిడిగా వెళ్ళిపోయాడు సింగడు.

సౌమ్య నవీన్ వంక చూసి, "వీడు ద్రోహబుద్ధితో మనకి సాయం చేయటానికి సిద్ధమయ్యాడు. వీడి ధోరణి అనుమానంగానే వున్నది. వాడి ఆకలి చూపులు గమనించారా? వీడికేదో దుర్బుద్ధి పుట్టింది" అన్నది మెల్లగా.

నవీన్ తలూపి, "వీడి వాలకం నేనూ గమనించాను. నీపట్ల ఆసక్తి చూపుతున్నాడు. మోసం చేయటానికి సంసిద్ధంగా వున్నాడు. మనం వెంటనే ఓ నిర్ణయానికి రావాలి!" అన్నాడు.

"ఓ ఆడదానిమీద వ్యామోహంతో తనకు దైవం లాంటి గూడెం నాయకుడినే మోసం చేసినవాడు తన కోరిక నెరవేర్చుకోవటం కోసం యింకెన్ని ఘాతుకాలనయినా సునాయాసంగా చేస్తాడు. నా కోసం నీకు ఆపద తలపెడతాడు. అనుమానంలేదు—మనం వీలయినంత త్వరలో ఇక్కడనుండి పారిపోవాలి!" అన్నది సౌమ్య.

ఆమె తనకోసం ఆరాటపడటం ఆనందం కలిగిస్తోంది నవీన్ కు.

"నాకు తెలుసు, నువ్వు బతుకుతున్నది నాకోసమని!" అన్నాడు ఆమెవంక ఆరాధనగా చూస్తూ.

"సమయం మించిపోకుండా నే జాగ్రత్తపడాలి."

"కాని మనకు దారి తెలియదే! ఎక్కడికి వెళ్ళాలి? యెటునుంచి యే ప్రమాదం ముంచుకొస్తుందో తెలీదు.

ఇంతవరకూ తుపాకీ చేతవుండటంవల్ల ఎంతో ధైర్యంగా తిరిగాం. కాని, అది శత్రువుల చేతుల్లో చిక్కుకు పోయింది! క్రూరమృగాలకు, క్రూరమృగాలకన్నా క్రూర మైన ఈ కొండజాతి మనుషులకు నిలయమైన యీ అడవిలో యేవైపునుంచి వెళ్తే బయటికి దారితీస్తుందో తెలియకుండా వుంది" అన్నాడు నవీన్.

"అలా ఆలోచిస్తూ కూచుంటే సింగడు వచ్చేస్తాడు. నాకు హాని కలిగించక మానడు. నా మానప్రాణాలు రక్షించటంకోసం కదా నువ్విన్ని కష్టాలు పడింది. ఆలస్యంచేస్తే ఇప్పుడు అవి దక్కవు! యీ మనుషుల క్రౌర్యానికి దౌష్ట్యానికి బలయ్యే బదులు, అడవిలో యే క్రూరమృగానికో బలవటమే మేలు! పద!" అంటూ కొండ గుహ నించి బయటికొచ్చింది సౌమ్య. నవీన్ చేతిని పట్టుకుని. నవీన్‌లో నూతనోత్సాహం ప్రవేశించింది.

అప్పటికే అడవిలో చీకటి పడిపోయింది. బయట సూర్యుడింకా అస్తమించి వుండడు! చెట్ల గుబుర్లో మాత్రం అప్పటికే అస్తమించాడు.

దారి కనిపిస్తోంది. చుట్టూ పరిశీలనగా చూశాడు నవీన్. ఆ దారి యెట్నుంచి యెటు పోతున్నదో తెలీదు. ఇదివరకు తామిద్దరు నడిచిన దారికాదది! ఈ అడవిలో చాలా కాలిబాటలున్నాయని వాళ్ళకు అనుభవపూర్వకంగా తెలిసింది.

తాము గూడెంవైపునుంచి కుడిపక్కనుంచి వచ్చారు. బహుశా యెడమవైపు వెళ్తే అడవి బయటకు దారితీస్తుందేమో! చూడాలి!

ఎడమ పక్క దారి పట్టుకుని చకచకా నడవ

సాగారు.

కోలాహలంగా వుంది తమ వెనుకవైపు. అది గూడెం ప్రజలు చేస్తున్న రణగొణ ధ్వని! ఈపాటికి తామిద్దరు తప్పించుకుపోయినట్టు తెలిసిపోయుంటుంది. తమ కోసం అడవంతా గాలించకుండా వదుల్తారా?

సింగడు వాళ్ళ నేమని సమాధానపరుస్తాడు? బహుశా పారిపోయారని చావుకబురు చల్లగా చెప్పివుంటాడు! తన మీద నేరం వేసుకోడు. తమ పలాయనానికి సింగడే కారకుడని గూడెం నాయకుడు గ్రహిస్తే తమకు వేసిన శిక్ష సింగడికి అమలుజరిపించేస్తాడు. వేటకుక్కలు, తోడేళ్ళు, దున్నలు సింగడ్ని నుగ్గునూచగా చేసేసి ఆరగిస్తాయి.

అంచేత తామే పారిపోయినట్టు చెపుతాడు. కోయ యువకులు తమకోసం నాలుగు చెరగులా వేటకుక్కల కన్న వేగంగా పరుగులు పెట్టి గాలిస్తారు. ఏ విధంగా చూసినా తాము బయటపడటం అసంభవంగానే కనిపిస్తోంది.

అయినా వాళ్ళిద్దరిలోనూ ఒకటే దృఢనిశ్చయం! ఆ కోయవాళ్ళకు ప్రాణాలతో దొరక్కూడదు. సింగడికి అసలే చిక్కకూడదు.

వాళ్ళిప్పుడు నడవటంలేదు — పరుగు పెడుతున్నారు. కాలికి తీగెలు, ముళ్ళు, రాళ్ళు అడ్డుతగుల్తున్నాయి. రెండు మూడుసార్లు యిద్దరూ ముందుకి తూలబోయి నిలదొక్కుకున్నారు. ఒకరి చేతులు మరొకరు పట్టుకుని పరుగుపెడుతున్నారు. ఒకరు జారిపోకుండా మరొకరు ఆసరాగా పట్టుకుని పరుగెడుతున్నారు.

వెనక కోలాహలం మరింత దగ్గిరగా వినిపించింది.

'కూ కూ' అంటూ కోయవాళ్ళు కేకలు వేస్తూ సంకే
తాలు అందించుకొంటూ పరుగులు పెట్టుకుంటూ వస్తు
న్నారు.

నవీన్ చేతిలోని సౌమ్య చెయ్యి బిగుసుకుంది. ఆమె గ్రహిం
చిందని అతనికి, అతనికి తెలిసిందని ఆమెకు అవగాహ
నైంది. అయితే యెవరూ పెదవి మెదపి ఏమీ మాట్లాడు
కోవటంలేదు. వాళ్ళు తదేకదీక్షతో ముందుకు పరుగులు
పెడుతూనే వున్నారు-మరే ఆలోచనా వాళ్ళ మనసుల్లో
లేదిప్పుడు.

పరుగు, పరుగు, పరుగు, ఒకటే పరుగు!

సౌమ్య కాలుకి యెదురుగొప్పు తగిలింది! తూలి
పోయింది. నవీన్ పట్టుకోబోయాడు గాని, చీర అడ్డు
పడటంవల్ల ఆమె కాలు మెలిక పడిపోయింది.

దబ్బున నేలమీద పడిపోయింది. ఆమెతో బాటు
నవీన్ కూడా ముందుకి తూలాడు.

అప్పటికి ఆడవి నలుమూలలా చీకటి దట్టంగా అలు
ముకు పోయింది. ముందేమున్నదో కనిపించటం లేదు.
పక్కన యేం జరుగుతుందో చూద్దామన్నా దృష్టికి
గోచరం కావటంలేదు.

అంతకంతకు కోయవాళ్ళ కేకలు, అరుపులు దగ్గర
కొచ్చేస్తూన్నాయి. సౌమ్య కాలు కదపబోయింది.
కలుక్కుమన్నది. బాధను బయటపడకుండా పళ్ళ బిగు
వున భరించింది. కాని నవీన్ కి అర్థమయిపోయింది—ఆమె
మరో అడుగు కూడా ముందుకు వేసే స్థితిలో లేదని.
ఆమెను యెత్తుకొని పరుగెత్తడం అసంభవం.

కోయలు అంతకంతకూ దగ్గర కొచ్చేస్తున్నారు.

నవీన్ చుట్టూ కళ్ళు చికిలించి చూశాడు.

సింగడు తమని దాక్కోమన్న గుహవంటిది కొంచెం దూరంలో కనిపించింది. కోయలు వెళ్ళిపోయేవరకు ఆ గుహలో తలదాచుకుంటే సరి!

నవీన్ అమాంతం సౌమ్యను రెండు చేతులలోను ఎత్తి గాల్లోకి లేపాడు. ఓ చెయ్యి ఆమె మోకాళ్ళ కింది భాగంలోను, మరో చెయ్యి భుజాల కిందుగాను లేపి పట్టుకున్నాడు. ఆమె చాలా తేలిగ్గా వుందనిపించింది.

సునాయాసంగా ఆమెను గుహ దగ్గరకు మోసు కెళ్ళాడు. గుహ ముందు భాగమంతా యెండుటాకుల్తో కప్పబడి వున్నది!

గుహ లోపలికి అడుగుపెట్టాడు నవీన్. నేలమీద దుమ్ము పేరుకుపోయి వుంది! ఎప్పుడూ ఆ గుహలో మను షులు సంచరించి వుండరని నిర్ధారణ చేసుకున్నాడు నవీన్. అదీ మంచిదే! ఇక్కడ తాము దాక్కొని వున్నా రనే అనుమానం కోయలకు రాదు!

నవీన్ సౌమ్యని గుహలో దించాడు. అక్కడ నిల్చొని వుడటం కూడా కష్టమే! కాళ్ళకు దుమ్ము పట్టేసింది. కూచోవటం ప్రసక్తే లేదు.

కాని సౌమ్య నిదానంగా నించోలేకపోయింది. ఆమె కాలు బాగా నొప్పి చేసింది.

నవీన్ ఆమె మోకాలి పైవరకు చీరను తొలగించి మెలికపడిన ప్రదేశంలో తడిమి చూశాడు. ఫ్రాక్చరయిం దేమోనని పరీక్షించాడు. సౌమ్య మెల్లిగా మూలిగింది. ఎముక విరిగివుంటే ఆమె ఆ మాత్రం కూడా నిల్చోలేదు. బెణికి వుండాలి!

నవీన్ ఆమె కాలు పైనుంచి కిందిదాకా మెత్తగా నిమురుతూ ఆమెకి ఉపశమనం కలిగించాడు.

గుహ బయట కాగడా వెలుగు కనిపించింది.

నలుగురు మనుషులు ఆ వెల్తురులో తీవ్రంగా వెతకటం కనిపించింది.

నవీన్, సౌమ్య గుహ గోడెక్కి నిల్చున్నారు. కోయలు దగ్గర కొచ్చేస్తున్నారు. కాగడా వెలుగులో తమని పట్టుకోవటం ఖాయం!

ఎండుటాకుల దగ్గర చప్పుడయ్యింది.

నవీన్ సౌమ్య ఊపిరి బిగబట్టారు.

కోయలు గుహ ముందునుంచి కిచకిచ మాట్లాడుకుంటూ గుహ దాటి వెళ్ళిపోయారు!

నవీన్ సౌమ్య గట్టిగా ఊపిరి పీల్చుకున్నారు.

కాని, అంతలో—వాళ్ళ నాసికాపుటాలకి ఏదో వాసన తగిలింది. అవును, అదే వాసన! గబ్బు వాసన!

అయితే, యీ గుహలో పెద్దపులేదో నివాస ముంటున్నదా? వాళ్ళ గుండెలు అవిసిపోయాయి ఈ ఆలోచన రాగానే. ఓ ప్రమాదంనించి తప్పించుకుని, మరో ప్రమాదంలో యిరుక్కుపోవటం తప్పలేదు!

"సౌమ్యా! లోపల పెద్దపులి వుండొచ్చు ఏవో అలికిళ్ళు వినిపిస్తున్నాయి గమనించావా? గబ్బు వాసన కూడా గుహ లోపల్నుంచే వస్తోంది. ఇక్కడుంటే ప్రమాదం! బయటకు వెళ్ళిపోదాం" అన్నాడు నవీన్ ఆమెకు మాత్రమే వినిపించేటంత మెల్లగా. సౌమ్య తలూపింది.

కాలు ముందుకు వేసింది. కలుక్కుమన్నా యిందాకటి అంతగా నొప్పిగాలేదు. గుహ బయటకు రావటానికి ఒక నాలుగడుగులే మిగిలివున్నది.

సరిగ్గా అదే సమయంలో గుహ ముందు యెండు

టాకులు చప్పుడయి సౌమ్య, నవీన్ ఉలిక్కిపడి చూశారు.

ఎదురుగా కాగడా పట్టుకుని నిల్చున్న వ్యక్తి ముఖం ఎర్రటి కాగడా కాంతిలో మరింత ఎర్రగా భయంకరంగా కనిపిస్తోంది.

అతను సింగడు! వాళ్ళని చూశాడు.

నవీన్, సౌమ్య నిర్ఘాంతపోయి చూస్తున్నారు.

సింగడు క్రూరంగా నవ్వుతూ వాళ్ళవైపు అడుగులు వేసుకుంటూ వస్తున్నాడు. అతని యెడమ చేతిలో కాగడా, కుడిచేతిలో మొనతేలిన యీటె వున్నాయి. ఈటె నవీన్ గుండెలకు గురిచేయబడి వున్నది.

అతను ఒక్కొక్క అడుగే ముందుకి వేస్తూ వాళ్ళని సమీపిస్తున్నాడు. సౌమ్య, నవీన్ గుహ గోడలకి అతుక్కుపోయి నిల్చున్నారు.

సరిగ్గా అదే సమయంలో ఊహించని సంఘటన జరిగి పోయింది.

గుహ లోపల్నుంచి ముందు పెద్దపులి, ఆ తర్వాత గర్జన బయటికి దూసుకువచ్చాయి.

పులి ఒక్క ఉదుటున సింగడిమీదికి ఉరికింది!

సింగడి చేతిలోని కాగడా యెగిరి అవతల పడింది!

మరుక్షణం అతని కంఠాన్ని పులి కొరికి రక్తం తాగేసి వుండేది! కాని సింగడు మెరుపులా లేచాడు. ఈటెను గురిచూసి దాని కంఠంలో గుచ్చాడు.

పులి అడవి అదిరిపోయేలా గర్జించింది. కాని నేల వాలిపోలేదు. రెట్టించిన వేగంతో సింగడిమీదికి ఉరికింది. ఈసారి సింగడి చేతిలోని ఈటె ఎగిరి దూరంగా

పడింది!

సింగడు మదపు టేనుగులా పోరాడుతున్నాడు పులితో — పులి పంజా విసిరింది. పంజా దెబ్బ నుంచి తప్పించుకుని పులి విసిరిన కాలును మెలితిప్పాడు. కర కరమని విరిగిపోయింది దాని కాలు. పులి మరోసారి గర్జించింది.

కాసేపు పులి, కాసేపు సింగడు ఒకరిమీదొకరు దొర్లుతుంటూ నేలమీద పొర్లారు. పులి అతని కంఠం కొరకాలని చేసిన ప్రయత్నాలన్నీ సింగడు విఫలం చేశాడు.

నవీన్, సౌమ్య కాలు కదపలేదు. ఉన్న చోటనే నించుని వాళ్ళిద్దరి పోరాటాన్ని అదిరే గుండెల్తో అలా చూస్తూ వుండిపోయారు.

సింగడు తనమీదికి నోరు తెరుచుకుని వచ్చిన పులి నోరు పెకలదీశాడు! పులి చివరిసారిగా అరచిన అరుపుకు అడవిలో పెద్ద కలకలం పుట్టింది! నేలమీద పడిన ఈటెను యెప్పుడు చేతిలోకి తీసుకొన్నాడోగాని, దాన్ని పులి నోటిలోకి బలంగా దించేశాడు సింగడు!

పులి గిలగిలా కొట్టుకుని చచ్చిపడింది!

సింగడు లేచి నించున్నాడు. తూలబోయి నిలదొక్కుకున్నాడు. అతని చేతిలోని ఈటె కాలరుద్రుడి చేతిలోని త్రిశూలంలాగా వుంది!

• • •

సింగడి చేతలో తమ చావు ఖాయమని నిర నిశ్చయాని కొచ్చేశారు నవీన్, సౌమ్య.

ఈటె సరాసరి తనకే గురిచేసి వుండటం కూడా నవీన్ స్పష్టంగా గుర్తించాడు. తనని మాత్రమే చంపేసి, ఆ

తర్వాత సౌమ్యని యెత్తుకొనిపోయి....భగవాన్, ఆ ఆలోచనే చాలా దుర్భరంగా వుంది నవీన్‌కి. అతన్ని ఎదుర్కొని చంపటానికి తన చేతిలో యెలాంటి ఆయుధమూ లేదు. తన దగ్గర్నుంచి తుపాకీ లాగేసుకుని వుండకపోతే యీ పాటికి సింగడి అంతు చూసివుండే వాడు.

కాని....విధి బలీయమైనది! క్షణంలో సగం సేపు సౌమ్యవంక చూశాడు. సౌమ్య నిర్వికారంగా నిల్చుని వున్నది. అప్పటికే యేదో నిర్ణయానికి వచ్చినదానిలా స్థిరంగా, దృఢంగా వున్నది సౌమ్య.

సింగడు ప్రళయకాల రుద్రుడిలా వున్నాడు. ఆ మరు క్షణమే అతని చేతిలోని ఈటె నవీన్ గుండెల్లో దిగి పోయి వుండేది. ఇంతలోనే ఊహించని అద్భుతం జరిగి పోయింది.

సింగడు "అమ్మా!" అంటూ కేక పెట్టాడు.

అతని చేతిలోని ఈటె చేజారిపోయింది.

నవీన్, సౌమ్య నిర్ఘాంతపోయి చూస్తూండగానే సింగడు నిట్టనిలువుగా నేలమీద విరుచుకుపడిపోయాడు! క్షణాలమీద అతని శరీరం నీలిరంగుకి తిరిగిపోయింది. నోటి వెంట నురగలు వచ్చాయి.

జరిగిందేమిటో నవీన్, సౌమ్య గ్రహించారు. పెద్ద పులిని అవలీలగా ఆయుధం కూడా లేకుండా మట్టుబెట్టిన సింగడ్ని పాము యేదో కాటందుకున్నది. చాలా ప్రమాద కరమైన పాము! క్షణాల్లో విషం సింగడి నర నరాన్ని పాకిపోయి, అతడ్ని నిర్వీర్యుణ్ని చేసింది.

సింగడు యేదో చెప్పటానికి ప్రయత్నిస్తూన్నట్టు కని పించింది. నవీన్ అతనికి దగ్గరగా వెళ్ళాడు. కాని ప్రయో

జనం లేకపోయింది.

సింగడి ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసి పోయాయి!

సౌమ్య ఎందుకో ఫక్కున నవ్వింది. సింగడి శవంవంక నిశ్చలంగా చూస్తోంది.

"పది నిమిషాల క్రితం ఈ మనిషివల్ల మనకు ప్రమాదం తప్పదనుకున్నాం. కాని క్షణాల వ్యవధిలో అంతా తారు మారయిపోయింది" అన్నది సౌమ్య.

దూరంగా కాగడాల వెలుగు కనిపిస్తోంది. "మనం యెలాగో యీ అడవి నుంచి వీలయినంత తొందరగా బయటపడాలి. కోయవాళ్ళు మనల్ని ప్రాణాలతో వదలి పెట్టరు. మన గురించి యింకా వెతుకుతూనే వున్నారు" అన్నాడు నవీన్.

"ఈ రాత్రి సమయంలో యెట్నుంచి బయల్దేరినా తిరిగి బయల్దేరిన చోటికే రావటం జరుగుతుంది. నీ ఇష్టం, నువ్వెలా చేద్దామంటే అలాగే!...." అన్నది సౌమ్య.

"మనకి యిప్పట్నుంచి ప్రతినిముషమూ విలువైనదే! మన ప్రయత్నం మనం చేద్దాం. భారం దైవానికే వది లేద్దాం. మన చేతుల్లో ఏదీ లేదని సింగడి మరణం రుజూవు చేసింది" అన్నాడు నవీన్.

*　　*　　*

ఇద్దరూ గుహ బయటకు వచ్చారు.

సింగడు యిందాకా పారేసిన కాగడా యెండు టాకుల్ని కాల్చి పెద్ద మంటను చేసింది. ఆ మంట తమకు దారి చూపిస్తూండగా వాళ్ళిద్దరూ సన్నటి కాలిబాటను పట్టుకుని నడవటం మొదలెట్టారు. కాని ఆ మంట శత్రు వులకి తమ ఉనికిని చాటుతున్న విషయం వాళ్ళకు అల

ష్యంగా గ్రహింపుకి వచ్చింది.

"మన వెనుక చాలా కాగడాలు కనిపిస్తున్నాయి. మనని వాళ్ళు వెంబడిస్తున్నట్టుంది" అన్నది సౌమ్య వెనుతిరిగి చూసి.

నవీన్ వెనక్కి తిరిగి చూశాడు. ఒకేసారి పది కాగడాలు తమ వెనుక కదిలివస్తున్నాయి. వాళ్ళు నడవటం లేదు, పరుగెడుతున్నారు. కొద్ది నిమిషాల్లో తమని చేరుకోవటం ఖాయం!

నవీన్ ధైర్యాన్ని కోల్పోలేదు. "అవును. సింగడి కాగడా చేసిన మంట మన ఉనికిని పట్టిచ్చినట్టుంది. వాళ్ళిసరికి ఆ మంటని సమీపించి వుంటారు. సింగడి శవాన్ని పులి కళేబరాన్ని చూసి, పులివాత పడి సింగడు చనిపోయాడనుకుంటారు. మనం యీ దారిన వస్తున్నట్టు వాళ్ళకి తెలిసే అవకాశం లేదు" అన్నాడు.

సౌమ్య యింకా వెనక్కి చూస్తూనే నడుస్తోంది. కాగడాలు నిశ్చలంగా ఓ చోట ఆగిపోయాయి. బహుశా ఆ కొండగుహ దగ్గర దృశ్యాన్ని చూస్తుండవచ్చునని ఊహించారిద్దరు.

సరిగ్గా అదే సమయంలో వారి కెదురుగా ఓ లేడి, కుందేళ్ళు పరుగెత్తుకొస్తూ కనిపించాయి. వాటిని యేదో తరుముకొస్తున్నట్టుంది. ప్రాణభయంతో అవి పరుగెత్తుకొస్తున్నాయి.

నవీన్ సౌమ్య చేతిని పట్టుకుని పక్కనేవున్న పెద్ద చెట్టు మొదలు వెనక్కి లాగాడు. ఇద్దరూ మాను పక్కనుంచి తొంగి చూశారు.

చిరుతపులి! మహావేగంగా పరుగెడుతోంది. వేటాడేటప్పుడు పులి కన్న యెన్నో రెట్లు వేగంగా పరుగెడ్తుంది

చిరుత! వేగంగా పరుగెట్టడానికి పేరుపడ్డ లేడిని సునాయాసంగా పట్టేసుకుంది చిరుతపులి!

ఒక్కసారిగా లేడి కంఠాన్ని పట్టుకొంది చిరుతపులి! అమాంతం నేలకరుచుకుపోయింది లేడి.

సౌమ్య గుండె వేగంగా కొట్టుకుంటోంది!

చిరుతపులి లేడిని లాక్కుని పొదల మధ్య మాయమయ్యింది.

దూరంగా కాగడాలు మళ్ళీ కదులుతున్నాయి. అయితే యీసారి మరో దారిన వెళ్ళిపోతున్నాయి కాగడాలు.

నవీన్, సౌమ్య తేలిగ్గా ఊపిరి వదిలారు. తమకు దారి తెలీకపోయినా ఎలాగో వెళ్ళగలరు. కాని వెనక ఎవరో వెంబడిస్తుంటే కాలు కదపాలన్నా కష్టమే!

ఇద్దరూ మాను పక్కనుంచి దారిలోకి వచ్చారు. దారి సరిగా కనిపించటంలేదు. పొదలు అడ్డొస్తున్నాయి. ముళ్ళ పొదలయితే కాళ్ళు గీరుకుపోతున్నాయి. అయినా వాళ్ళు లెక్కచేయటంలేదు. తదేకదీక్షతో ముందుకే సాగిపోతున్నారు.

పది నిమిషాలు....ఇరవై నిమిషాలు....ఓ గంట గడిచింది. దూరంగా యెండుటాకులు కాలుతున్న వాసన, పొగ కనిపించాయి.

ఓ క్షణం ఆగి పరిసరాలు గమనించి విస్తుపోయాడు నవీన్. "మైగాడ్! మనం మళ్ళీ బయలుదేరిన చోటికే వచ్చాం!" అన్నాడు. అతనిలో ఒక్కసారిగా నిరాశ నిస్పృహలు చోటుచేసుకున్నాయి.

సౌమ్య కూడా నిరుత్సాహపడింది. కాలుతున్న యెండు

టాకులు సింగడు చనిపోయిన గుహ దగ్గర కాగడావల్ల కాలినవే!

* * *

సౌమ్య బాగా అలిసిపోయింది. ఓపక్క ఒళ్ళంతా స్నానం చేసినట్టు చెమట్లు! మరోపక్క నాలుక పిడచ కట్టుకుపోయే దాహం! అయినా ఎండిన పెదాల్ని నాలుకతో తడుపుకుని గొంతు పెకల్చుకుని అన్నది: "మరో దిశలో ప్రయాణం సాగిద్దాం. ఆగవద్దు."

నవీన్ ఆమెవంక జాలిగా చూశాడు. "పోనీ, యీ రాత్రి యే చెట్టుమీదనైనా గడిపేద్దామా?"

"నో, నో! తెల్లారితే సింగడి నాయకుడికి చిక్కిపోక తప్పదు. తెల్లవార్లూ కోయలు మన కోసం అడవి అణువణువునా గాలిస్తూనే వుంటారు."

"అందుకే వాళ్ళకి దొరక్కుండా దట్టంగా వున్న శాఖలమధ్య కూచుని తెల్లారేవరకు గడిపేస్తే....?"

"తెల్లారాక మరీ ప్రమాదం కదా! అంతకీ కోయలు దార్లో యెదురొస్తే ఏదో విధంగా దాక్కుని తప్పించుకోలేమా? వీళ్ళకు భుజబలం వుంటే మనకు బుద్ధిబలం, సమయస్ఫూర్తి వున్నాయి. పద, వెళ్దాం!"

నవీన్ కిందికి వంగివున్న పెద్ద కొమ్మనుంచి ఓ నిడుపాటి కర్రను విరిచాడు. ఆకులు దూసి, చేత్తో పట్టుకున్నాడు. ఏ ఆయుధము లేకపోయినా యీ కర్రయినా అవసరానికి ఉపయోగపడ్తుంది!

మళ్ళీ ముందుకి సాగారిద్దరూ. ఈసారి సన్నని కాలిబాట రెండుగా చీలిపోయింది. ఓ క్షణం డైలమాలో పడ్డారు.

"ఇదిగో, ఈ కుడిపక్క దారిలో మొక్కలేవు. దారి

బాగా నలిగివున్నది. ఎడమవైపు దార్లో పిచ్చిమొక్కలు, ముళ్ళపొదలు పెరిగిపోయాయి. ఈ దారిన యెవరూ నడవటం లేదన్నమాట! మనం కుడిపక్క దారి వెంబడి నడిచిపోతే యేదోక గమ్యానికి చేరతాం!" అన్నది సౌమ్య.

నవీన్ ఆమె పరిశీలనా శక్తికి లోలోపల ఆశ్చర్యపోయాడు.

"నువ్వు చెప్పింది కరెక్టు! అయితే ఈ నలిగిన దారి మళ్ళీ గూడేనికి దారితీస్తే....!?"

"గూడేనికి వెళ్ళిన దారి మనకి పరిచితమైనదే! వెళ్ళేటపుడు అనుమానమొస్తే వెనక్కి మళ్ళిపోవచ్చు. ఎవరూ నడవని దారిన వెళ్ళి చిక్కుల్లో పడిపోయేకన్నా యిది కొంత నయం కదూ!...." సౌమ్య యింకా యేదో చెపుతుండగానే నవీన్ ఆమెని జబ్బ పట్టుకుని తనమీదకు లాక్కున్నాడు.

ఆమె క్షణంలో సగం విస్తుపోయి అంతలోనే తప్పిపోయిన ప్రమాదం గ్రహించింది.

ఆమె పక్కగా నల్లతాచు చరచరమని పాక్కుంటూ మహావేగంగా వెళ్ళిపోయింది.

"చూడగా యీ అడవినిండా క్రూరసర్పాలే వున్నట్టున్నాయి. అడుగడుక్కీ కాళ్ళకి అడ్డం పడుతున్నాయి" అన్నది సౌమ్య.

"నేను మొదట్లోనే చెప్పాను. అవి తమ దారిన తాము పోతాయి. మనం అడ్డుపడినా, వాటికి హాని కలిగించటానికి ప్రయత్నించినా అవి యెదురు తిరుగుతాయి. ప్రాణభయం జీవధర్మం కదా!" అన్నాడు నవీన్.

ఇద్దరూ నలిగిన దారి వెంట ప్రయాణం సాగించారు. దాదాపు ఓ గంట గడిచింది.

సన్నటి దారి పోను పోను విస్తరించింది. దార్లో యెలాంటి ఆటంకాలు యెదురుకాలేదు. కాని తమకి కనపడకుండా యేదో మూల నుంచి ప్రమాదం విరుచుకుపడవచ్చునని యిద్దరి మనసుల్లోనూ మెదుల్తూనే వుంది. ఎవరూ పెదవి విప్పి తమ అనుమానం బయట పెట్టలేదు.

చాలా తరచుగా ఎండుటాకులమీద జర జర చప్పుళ్లు. చిన్న చిన్న జీవాలు గెంతుతూ అటు ఇటు సంచరిస్తున్న శబ్దాలు, జంతువుల ఛీత్కారాలు, గుర్తు తెలీని సవ్వడులు వినిపిస్తూనే వున్నాయి.

వాళ్ళు అవేవీ గమనించే స్థితిలో లేరు. తదేకదీక్షతో ముందుకి నడుస్తూనే వున్నారు. వాళ్ళ కళ్ళు చీకటికి బాగా అలవాటు పడిపోయినట్టే, చెవులు కూడా అతి చిన్న శబ్దాల్ని గూడా గుర్తించగల్గుతున్నాయి. అది చాలా యాంత్రికంగా జరిగిపోతోంది.

వాచీ చూసుకున్నాడు నవీన్. నాలుగ్గంటలు కావస్తోంది. త్వరలోనే తెల్లవారబోతోంది. తెల్లారేసరికి ఈ అడవి నుంచి బయటపడితే చాలు!

మరో గంట గడిచినా అడవి అంతం కాలేదు. ఇద్దరూ బాగా అలసిపోయారు. దాహాన్ని యెప్పుడో మరచిపోయారు. అలసటను లెక్క చేయటం లేదు. కాళ్ళకు తగిలిన దెబ్బల్ని ఖాతరు చేయటం లేదు. ఎలాగైనా అడవి నుంచి బయటపడాలి. అంతే, అదే తమ యేకైక లక్ష్యం.

వెనకగా కుర్రమన్న చప్పుడు వినిపించి చటుక్కున ఆగిపోయారిద్దరూ. చీకట్లో ఆ జంతువు తాలూకు కళ్ళు

పచ్చగా మెరుస్తున్నాయి. వాళ్ళను గుర్తించినట్టు నిశ్చలంగా వారివంకే చూస్తోంది ఆ జంతువు.

నవీన్ దాన్ని గుర్తుపట్టాడు. అంతా పెద్దపులి తరహాలోనే వున్న ఆ జంతువు జంగుపిల్లి! ఒంటరిగా వున్నపుడు పులిలా పోరాడుతుందని వినివున్నాడు.

అది మెల్లగా వాళ్ళవైపు వస్తోంది. ఎగిరి మీదపడ్తుందని నవీన్ చాలా అప్రమత్తతగా వున్నాడు. సౌమ్యని పై తొలగమని సైగ చేశాడు.

ఆ మరుక్షణంలో జంగుపిల్లి నవీన్ మీదికి ఉరికింది.

నవీన్ దాని ధాటి ఎదుర్కోవటానికి సిద్ధంగా వున్నాడు కాబట్టి సరిపోయింది గాని లేకుంటే దాని ఆదురుకు వెల్లకిలా పడివుండాల్సిందే! అంత ఉధృతంగా ఉరికింది.

ఉరుకుతూనే అతని కంఠం పట్టుకోవటానికి ప్రయత్నించింది జంగుపిల్లి,

నవీన్ అది ఉరుకుతున్న సమయంలో ఒక్క అడుగు పక్కకు వేశాడు. అది నేలమీద పడిపోతూనే మధ్యలోనే ఛెంగున స్ప్రింగులా లేచింది.

నవీన్ చేతిలోవున్న ఆయుధం ఒకే ఒక్క కర్రపుల్ల! అయితే అంతకు వందరెట్లు బలం అతని దృఢ విశ్వాసానికుంది.

కర్రపుల్లతో జంగుపిల్లి కాళ్ళకు అడ్డంగా కొట్టాడు నవీన్. అది ఎగిరి కిందపడింది. ఈసారి దాని నడుమ్మీద బలంగా కొట్టాడు.

గుర్రమన్నది పిల్లి! దాని గుర్రు అచ్చంగా పెద్ద పులి గాండ్రింపులాగే వున్నది. ఎదురు కాళ్ళతో పైకి లేచి నవీన్ కి నిచ్చెన వేయబోయింది జంగుపిల్లి. ఈసారి దాని

తలమీద శక్తినంతా ఉపయోగించి కొట్టాడు. పచ్చి కర్ర కావటంతో విరిగిపోలేదుగాని, ఆ దెబ్బకు కర్ర ముక్కలు ముక్కలయిపోవాల్సిందే!

ఆ దెబ్బ దాని బ్రహ్మరంధ్రానికి తగిలిందేమో గిజ గిజ కొట్టుకుంటూనే నేలమీద పొర్లింది జంగుపిల్లి. దెబ్బమీద దెబ్బ కొట్టాడు నవీన్.

పిల్లి గిజగిజ లాడిపోయి ప్రాణాలు వదిలేసింది. నవీన్ చేతిలోని కర్రపుల్ల తుక్కయిపోయింది.

మరో కర్రపుల్లను విరిచి చేతపట్టుకున్నాడు నవీన్. సౌమ్య అతని పక్కకొచ్చి నిల్చుంది.

"ఈ అడవిలో పిల్లి కూడా పులి కన్న బలంగా క్రూరంగా వున్నది. ఏ మాత్రం అజాగ్రత్తగా వున్నా యీ జంగుపిల్లి మనల్ని ముక్కలు చేసి తినేసేది!" అన్నది సౌమ్య.

నవీన్ అప్పటిదాకా నడిచి అలిసిపోయింది ఒకెత్తు; జంగుపిల్లితో పోరాడి అలసిపోవటం మరొక యెత్తు అయింది. బాగా నీరసించిపోయాడు. కాని అతని ముఖం యేదో వింత తేజస్సుతో వెలిగిపోతోంది.

సౌమ్య అతని గుండెలమీద తల వాల్చి కొద్దిక్షణాలు మౌనంగా వుండిపోయింది. మాటల్లేని ఆ మూగమనసులు చాలా సేపు మౌనంగా మాట్లాడుకున్నాయి.

అప్పుడు సమయం ఆరుగంటలు కావస్తోంది. బయట బాగా తెల్లవారిపోయి వుండాలి. కాని, ఆ అడవిలో యింకా చీకట్లు తొలగిపోలేదు.

సరిగ్గా అదే సమయంలో యెక్కడినుంచో మాటల సవ్వడి, ఎవరో అటే వస్తున్న అడుగుల చప్పుడు వినిపించాయి.

నవీన్ సౌమ్య ఉలిక్కిపడి విడిపోయారు. చెవులు రిక్కించి విన్నారు. అనుమానం లేదు, యెవరో వస్తున్నారు.

ఇద్దరు ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు. ఒక్క క్షణం, యేం చెయ్యాలా అని ఆలోచనలో పడ్డారు.

• • •

మాటల సవ్వడి దగ్గరయ్యింది. మాటలు కలగాపుల గంగా వినిపిస్తున్నాయి. తెలిసిన భాషలా అనిపించటం లేదు.

"సౌమ్యా, ఇక్కడ దాక్కోవటాని మరుగ్గా లేదు. చెట్టెక్కటం తప్ప గత్యంతరం లేదు" అన్నాడు నవీన్ సమీపంలోని చెట్టువైపు నడుస్తూ.

చెట్టు మరీ సాఫీగా లేదు. ఎక్కడానికి అనువుగా చెట్టు మెట్లుగా గరుకు తేలి వుంది. అది యీ అత్యవసర సమయంలో బాగానే ఉపయోగపడుతోంది. చక చక యెక్కేసి సౌమ్యని పైకి చేరుకున్నాడు.

గుబురుగా వున్న కొమ్మల మధ్యకు మెల్లగా పాక్కుంటూ వెళ్లారు. పైనుంచి కింది దృశ్యంతో బాటు కొద్ది దూరం వరకు జరుగుతున్నది కనపడుతోంది.

ఊపిరి బిగబట్టి చూస్తున్నారు.

అయిదుగురు ఆటవికులు—విల్లంబులు ధరించి వున్న వున్నవాళ్ళు—కనిపించారు. విల్లు భుజానికి, అంబులపొది వీపుకి తగిలించుకున్నాడు ప్రతి ఒక్కడు. వీళ్ళు సింగడి గూడెంవాళ్ళు కాదని చూస్తూనే తెలిసిపోతుంది.

మనుషులు మొరటుగా క్రూరంగా వున్నారు. మొల చుట్టూ గోచీ కట్టుకున్నారు. ఏవేవో పూసలదండలు వేసు

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. పూర్తి వివరాలకు పత్రిక చూడండి.

అయితే, ఈ స్కీము అపన ఏజంట్లు వున్న ప్రాంతాలకు వర్తించదు. మీరు హోమ్ డెలివరీ సభ్యత్వము పంపేముందు మీ వూరిలో మా ఏజంటు లేదనే విషయం నిర్ధారణ చేసుకోండి.

నేడే మీరూ 'హోమ్ డెలివరీ'లో చేరండి!

కున్నారు. ఒంటి మీద మరేవిధమైన అచ్ఛాదనాలేదు.

సరిగ్గా వాళ్ళు అయిదుగురూ నవీన్ సౌమ్యలున్న చెట్టు కిందికే వచ్చి నిల్చున్నారు.

వాళ్ళు తమలో తాము పెద్దగానే యేదో మాట్లాడు కుంటున్నారు. కాని ఒక్క ముక్కా నవీన్‌కి, సౌమ్యకి అర్థం కాలేదు. ఉచ్చారణనిబట్టి తెలుగుగాని, మరాఠీగాని కాదని అర్థమవుతూనే వుంది. కోయవాళ్ళకు ప్రత్యేక మైన కొండభాష—లిపి లేని భాష—వుంటుంది. బహుశా అదే అయ్యుండాలి! తాము ముందుచూసిన కోయలు కొంత యాసతో తెలుగే మాట్లాడారు. వీళ్ళకి ఆ భాష రాదనుకోవాలి!

అయిదు నిమిషాలపాటు వాళ్ళు ఆ చెట్టుకింది నుంచి కదల్లేదు. ఆ తర్వాత అందులో ఒకడు శబ్దభేది విద్య తెలిసినవాడిలాగా యేదో అలికిడి వింటున్నట్టు చెవులు నోరపెట్టి విని, బాణం సంధించి ఎటో వదిలాడు. ఎక్క డ్నుంచో లేడో, దుప్పో ఆర్తనాదం చేయటంవినిపించింది.

బాణం వేసినవాడు ఆనందంతో వెర్రి కేకలు పెట్టాడు.

చెట్టమీది పక్షులు రెక్కలు టప టప కొట్టుకుంటూ భయంగా యెగిరిపోయాయి. ఆటవికులు అయిదుగురూ వేటాడిన జంతువుకోసం పరుగెత్తారు.

అంతదాకా ఊపిరి బిగబట్టి కొమ్మమీద కూచున్న నవీన, సౌమ్య తేలిగ్గా శ్వాస వదిలారు. నిజంగానే ఆ ఆటవికుడు శబ్దాన్ని బట్టి జంతువు ఉనికి తెలిసినవాడే! అలికిడి అయితే తమ యిద్దరి ఉనికి కూడా కనిపెట్టివుండే వాడు. తమమీదికూడా నిర్దాక్షిణ్యంగా ఓ బాణం వదిలివుండేవాడేమో!?

ఆ ఆలోచన రాగానే యిద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"పూర్తిగా తెల్లారిపోయింది. దూరంగా ఎటు చూసినా చెట్లు గుట్టలే కనిపిస్తున్నాయి. ఎంత తిరిగినా మనం యీ అడవిలోనే వున్నాం. సుదూరాన ఎక్కడా రైలుపట్టాలు కాదుగదా మైదానంకూడా కనిపించటం లేదు" అన్నాడు నవీన్.

సౌమ్య వెంటనే ఏం మాట్లాడలేదు. ఆమె మనసు మొద్దుబారిపోయింది. కనీసం యీ అడవినుంచి బయట పడగలిగితే చాలనుకున్నది. కాని ఆ ఆశ కాస్తా అడియాస అయ్యేలాగా వున్నది.

నవీన్ ఆమె భుజంమ్మీద ఆప్యాయంగా తట్టి, "ఏమిటి దీర్ఘాలోచనలో పడ్డావు? బాధపడుతున్నావా?" అన్నాడు.

సౌమ్య తల అడ్డంగా తిప్పి, "అదేం లేదు. బాధ, టెన్షన్, భయం, నన్ను తాకటంలేదు. వాటికి అర్థాలు మరిచిపోయానుకూడా! మన ప్రయత్నం యేదీ ఫలించక పోవటమే నాకు వింతగా అనిపిస్తోంది" అన్నది.

దూరంగా ఆటవికులు కనిపిస్తున్నారు. ఆటవికుడు వేటాడినది దుప్పిని. సాంతం ప్రాణంపోని దుప్పి ఇంకా నేలమీద కొట్టుకుంటోంది. ఆ దృశ్యం చూడలేక కళ్ళు మూసుకుంది సౌమ్య.

"ఇక చెట్టు దిగుదామా?" అన్నాడు నవీన్.

"ఆటవికులు మళ్ళీ వస్తారేమో! వాళ్ళు తూర్పు తెల్లారకముందే వేటకు బయల్దేరారు. వాళ్ళకి జంతు మాంసమే ప్రధానాహారంగా వున్నది" అన్నది సౌమ్య.

(సశేషం)

